# శ్రీ సొరకాయలస్వామి చరిత్ర



ప్రొఫెసర్ బి. రామరాజు

డాక్టర్ బి. రుక్మిణి

# శ్రీ సొరకాయలస్వామి చరిత్ర

రచన

**ప్రొఫెసర్ బి.రామరాజు**

**డాక్టర్ బి.రుక్మిణి**

**శ్రీ సొరకాయలస్వామి కైంకర్య సమాజం**

నారాయణవరం

1999

శ్రీ సొరకాయలస్వామి చరిత్ర

ప్రథమ ముద్రణ 1992 1000

ద్వితీయ ముద్రణ 1999 1000

ప్రతులకు

1. శ్రీ సొరకాయలస్వామి కైంకర్య సమాజం
   నారాయణవరం - 517 581
   చిత్తూరుజిల్లా - ఆంధ్రప్రదేశం
   ఫోను (08577) 32877
2. శ్రీ సొరకాయలస్వామి కైంకర్య సమాజం
   9, అరుణాచల పండారం వీథి,
   వేపేరి, మద్రాసు - 600 007.
   ఫోను (044) 6427846.
3. బి.రామరాజు
   1-8-117/2, చీకటిపల్లి,
   హైదరాబాదు - 500 020
   ఫోను (040) 7661034

# పూజా పుష్పం

## (ప్రథమ ముద్రణ పీఠిక)

నేను మా కుటుంబం భగవాన్ శ్రీ సత్యసాయిబాబా భక్తులం ఐన తరువాతనే **1976** నుండి బాబావారి పూర్వావతారం షిర్డీబాబా చరిత్ర పారాయణం చేయటం, షిర్డీ, అక్కలకోట, గాణ్గాపురం, మాణిక్యనగరం, మంత్రాలయం, వంటి యోగభూములు దర్శించటం, భారతదేశంలోని వివిధ ప్రాంతాల యోగుల చరిత్రలు చదవటం, ఆయా పుణ్యస్థలాలు దర్శించటం, నాకు తీరని దాహం ఐనది. ఆంధ్రదేశీయులైన యోగులు సిద్ధులు మహాపురుషుల జీవితచరిత్రలు కొన్ని చదివినాను. హిందీ, ఇంగ్లీషు భాషల్లో ఆయా ప్రాంతాల యోగుల చరిత్రలు ఒక్కచో చదివిన తరువాత సౌలభ్యం కోసం ఆంధ్రయోగుల చరిత్రల సంగ్రహం ముందుగా తెలుగులో అటుతరువాత ఇంగ్లీషులో వ్రాసి నా రచనా వ్యాసంగం సార్థకం చేసుకుందామని కడచిన రెండు సంవత్సరాలలో దాదాపు **40**మంది ఆంధ్రదేశీయ మహాపురుషుల జీవిత చరిత్రలు సేకరించగలిగినాను. ఈ ఉద్యమంలో నారాయణవరం శ్రీ సొరకాయల స్వామి చరిత్ర కోసం చాలా అన్వేషించినాను. సప్తగిరి **1976**మే సంచికలో నాలుగు వాక్యాలు, మిత్రులు జి.కృష్ణగారి నోట నాలుగు మాటలు మాత్రమే సేకరించగలిగినాను. నా పని చంకలో పాపను పెట్టుకొని ఊరంతా వెదికిన సామెతైనది. తోడి విశ్వహిందూ పరిషత్కార్యకర్త మిత్రులు అంగర త్రివిక్రమరావుగారికి నావంటి అభిరుచి ఉన్నట్లు ఆలస్యంగా గుర్తించినాను. వారి వద్ద నాకు లభించని యోగల చరిత్రలతోపాటు శ్రీ సొరకాయల స్వామివారి చరిత్ర The sage of Narayana Varam ఇంగ్లీషు పుస్తకం (ద్వితీయముద్రణం - **1951**) **1992** జనవరి రెండోవారంలో లభించింది. వారు కూడ ఎరువు తెచ్చుకున్న పుస్తకమే కనుక తొందరగా చదివి ఇమ్మన్నారు.

షిర్డీబాబా చరిత్రలో వలె The sage of Narayana Varam లో కూడ అడుగడుగున అద్భుతాలు, దివ్యలీలలు, చమత్కారాలున్నవి. ఈనాడీ గ్రంథం అలభ్యం కనుక చదువుతూ వెంట వెంట నోట్సు వ్రాస్తున్నాను. ఇంతలో **18-1-1992**నాడు తిరుపతికి వెళ్ళవలసి వచ్చింది. ఆనాడు మధ్యాహ్నం వరకు ఇంగ్లీషు పుస్తకం **130** పుటలో సొరకాయల స్వామి మద్రాసునుండి నారాయణవరం తిరిగిపోతూ రైలుబండిని

ఆపిన అద్భుత సంఘటన వరకు నోట్సు వ్రాసుకున్నాను. స్వామి ప్రదర్శించిన అద్భుతానికి నా మనసు ఉక్కిరి బిక్కిరైనది. పుస్తకం మూసిపెట్టి ప్రయాణానికి సామాను సర్దుకున్నాను. నాకు జ్ఞాపకశక్తి చాలా తక్కువ. ఎల్లుండి ప్రయాణం ఉంటే ఈనాటినుండే సామాను సర్దుతుంటాను. తీరా పరస్థలం చేరిన తరువాత ఏలినవారిపెట్టో ఆయుష్కర్మకిట్టో చేతి సంచో, చిన్నపంచో ఏదో ఒకటి మరచిపోయినట్లు తెలుసుకుంటాను. అపరాహ్ణం దాక నోట్సు వ్రాసుకున్నందున ఆదరాబాదరాగా సామాను సర్దుకున్నాను. తోడుగా మరొకరు లేకుండా ప్రయాణం చేయని స్థితి వచ్చింది కనుక సోదరుడు డా॥ సి.ఎస్.రామలింగంను తోడ్కొని నాంపల్లి స్టేషనులో 18-1-92 సాయంకాలం 4.40 గంటలకు రాయలసీమ ఎక్స్‌ప్రెస్‌లో కూర్చున్నాను. బండి 4.50కి బయలు దేరుతుందన్నారు. టిక్కెటు పాస్‌బుక్కు బయటికి తీద్దామని పెట్టె తెరిస్తే పాస్‌బుక్కు లేదు. పాస్‌బుక్కు తీసుకొని చేతనైతే బేగంపేట స్టేషనుకు రండి లేకపోతే లేదని టి.టి. అన్నాడు. కాళ్ళనొప్పులతో ఈ శరీరాన్ని ఈడ్చుకుంటూ స్టేషన్ బయటికి వచ్చి అటు రైలు బండి కదులుతుండగా ఇటు మేము ఆటోలో ఇంటిబాట పట్టినాము.

మద్రాసులో రైలుబండిని ఆపినపుడు శ్రీ సొరకాయలస్వామి తమ చేతికట్టను నిలువుగా పట్టుకొని బండిలో కూర్చున్నారు. ఆ దృశ్యం నా మనసు తెరపటం మీద ఆడింది. స్వామివారి చేతికఱ్ఱ నా చేతిలో పట్టుకున్నట్లు భావించి కుడి పిడికిలి చాచి ఆటోలో కూర్చున్నాను. ఈ రైలుబండిని బేగంపేటలో ఆపితే నీ మహిమలు నిక్కమనుకుంటానని సొరకాయల స్వామికి నా మనసులో ఛాలెంజి చేసి ఆయన నామం స్మరిస్తున్నాను. ప్రక్కన కూర్చున్న మా రామలింగం నీ చేతికేమైనదంటే తరువాత చెప్పుతానని సైగ చేసినాను. కఱ్ఱను పట్టుకున్న పిడికిలి ముద్రతో చీకటిపల్లిలో మా యిల్లు చేరి ఎడమచేతితో గేటు తీసి ఇంటిలో దూరి నా గదిలో టేబిల్‌పైన ఉన్న పాస్‌బుక్కు తీసుకొని వెనుదిరిగి వచ్చి మరల ఆటోలో కూర్చున్నాను. నా భార్య బిడ్డలు చేతికేమైనదని ఆందోళనతో అడుగుతున్నా సమాధానం చెప్పకుండా బయలుదేరినాను. ఆటో విమానం వలె దూసుకొని పోయి 5.20కి బేగంపేట రైలుస్టేషను ప్లాటుఫారం రెండోవైపు నిలిచింది. రైలు పట్టాలకు ఊతగా ఉండే రాళ్ళపై అరఫర్లాంగు కుంటుతూ పరుగెత్తి చాలా ముందు భాగాన ఉన్న AC II బోగివద్ద చేరుకున్నాను. బోగీ తలుపులు ఇటువైపు మూసి ఉంటే ఎడమచేతితో బాదినాను. అటెండరు తలుపు తీయగానే బండిలో దూకినాము. స్వామి కఱ్ఱ పట్టుకున్న పిడికిలి విప్పినాను. రైలుబండి కదిలింది. సొరకాయలస్వామి భౌతిక కాయం తెరమరుగైన 90 ఏండ్లకు ప్రదర్శించిన మహిమ యిది.

ఆనాటినుండి నారాయణవరం వెళ్ళి శ్రీ సొరకాయలస్వామి సమాధిని దర్శించాలెననే తపన పెరిగింది. అందుకు తగిన అవకాశం లభించింది. 1992 ఫిబ్రవరి 9నాడు మా కార్వేటి నగరం బంధువు మాదిరాజు కృష్ణస్వామిరాజు వివాహం తిరుత్తణిలో జరుగుతుంది. మేము దంపతులం బెంగుళూరుకు పోయి అక్కడనుండి మా అమ్మాయి చి॥సౌ॥ శ్రీదేవి, అల్లుడు మంజునాథ్, మనుమలు మధుకర దినకరులతో కారులో బయలుదేరి తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర స్వామిని సేవించి 8.2.92 మధ్యాహ్నం 1.30 గంటలకు నారాయణవరం చేరినాము. స్వామి సమాధిని దర్శించి అర్చన చేయించినాము. స్వామి గుడిపైన, మంగమ్మ గుడిపైన ఉన్న శాసనాలు వ్రాసుకున్నాను. పూజారిని అడిగితే శ్రీ సొరకాయల స్వామి చరిత్రలు ఇంగ్లీషు తెలుగు భాషల్లో ఒకప్పుడు ఉండేవని ఇప్పుడు ప్రతులన్నీ చెల్లిపోయినాయని తమవద్ద ఏమీ లేవని అన్నాడు. మద్రాసులో శ్రీ సొరకాయలస్వామి కైంకర్య సమాజం చిరునామా మాత్రం ఇచ్చినాడు. మా అమ్మాయి చి॥సౌ॥శ్రీదేవి "స్వామివారి చరిత్ర తెలుగులో మీరే వ్రాయండి. అచ్చువేసి స్వామికి సమర్పించుకుందా"మన్నది. ఆమె సంకల్పమూ నా కోరిక సమాధికి నివేదించి ఆ సాయంకాలం తిరుత్తణికి వెళ్ళిపోయినాము.

నా పుట్టినదినం 16.4.92నాడు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా సన్నిధిలో ఉండటానికై కొడైకానల్ పోతూ 14.4.92నాడు మద్రాసులో శ్రీ సొరకాయల స్వామి కైంకర్య సమాజం కార్యదర్శి ఎం.రామచంద్రన్ మరొక వృద్ధభక్తుడు ఎం.యతిరాజులు నాయుడు గార్లను కలుసుకొని నా కోరిక తెలిపినాను. శ్రీ యతిరాజులునాయుడు తమ సొంత పుస్తకంThe sage of Narayana Varam ఇచ్చినాడు. శ్రీ రామచంద్రన్ తెలుగులో శ్రీ సొరకాయల స్వామి చరిత్ర ప్రథమ ద్వితీయ భాగాలు ఇచ్చినాడు. ఈ గ్రంథాలేవీ ఇప్పుడు లభించవు. తెలుగు పుస్తకం ప్రథమభాగం 64 పుటల గ్రంథం. అది 306 పుటల ఇంగ్లీషు పుస్తకానికి సంగ్రహం. దానిని జె.వి.శ్రీనివాసులు నాయుడు, కె.చంద్రమౌళీశ్వర శాస్త్రి, ఏ.సుబ్బారెడ్డి, బి.బాలమునెయ్యలు 1958లో సిద్ధం చేసినారు. ద్వితీయభాగం 46 పుటల గ్రంథం. దీనిని బాలసుబ్రమణ్యం అయ్యర్, జె.వి. శ్రీనివాసులు నాయుడుగార్లు 1962లో సిద్ధం చేసినారు. ఇందులో స్వామివారు మహాసమాధి ఐన తరువాత ప్రదర్శించిన లీలలు, వారి శిష్యుల చరిత్రలు అదనంగా ఉన్నాయి. ఈ మూడు గ్రంథాలు కైంకర్య సమాజంవారి ప్రచురణలే. వీటి ఆధారంగా ఈనాటి భక్తుల అనుభవాలు రెండు మూడు చేర్చి మరొక గ్రంథం సిద్ధం చేయవలె అనుకున్నాను.

బెంగుళూరులో భగవాన్ బాబావారు నిర్వహించిన వేసవి శిబిరం నుండి హైదరాబాదుకు తిరిగి రాగానే 5.6.1992నాడు శ్రీ సొరకాయలస్వామి చరిత్ర రచనకు శ్రీకారం చుట్టినాను. కాని నా పాంచభౌతిక శరీరాన్ని ఆశ్రయించిన ఆర్థ్రైటిస్, బ్రాంకైటిస్, సైనసైటిస్, అర్టికేరియా, ఎన్‌లార్జ్‌డ్ ప్రొస్టేట్ అనే ఐదుగురు ఆపత్కాల బంధువులతోనే నా సమయం ఎక్కువ గడిచేది. వయసు మీరిన తరువాత లభించిన ఈ చెలిమికాండ్రను అనునయిస్తూ ఎట్లాగో ఈ గ్రంథం ప్రథమభాగం ముగించినాను. ఇంతలో వేసవి సెలవుల మూలంగా మా అమ్మాయి డా॥ రుక్మిణి హనుమకొండనుండి వచ్చింది. ద్వితీయభాగం రచన ఆమెకు అప్పగించినాను. నేను తృతీయభాగం వ్రాసినాను. అమ్మాయి రుక్మిణి వెంట వెంట ప్రెస్‌కాపీ కూడ సిద్ధం చేసింది. పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారు 20.7.1992 నాడు ముద్రణ ప్రారంభించి 29.7.1992 నాడు ముగించినారు. కళాజ్యోతి ప్రాసెస్‌వారు 24 గంటల్లో కవరు డిజైన్ చేసి ముద్రించి ఇచ్చినారు. వేగ జంఘుడైన శ్రీ సొరకాయలస్వామి మమ్ముల తరిమి తరిమి ఈ పని చేయించినారు. నారాయణవరంలో 3.8.1992 నుండి స్వామివారి 90వ ఆరాధనోత్సవాలు. ఆ సందర్భంగా స్వామి సమాధికి సమర్పించే మా అందరి పూజా పుష్పం ఇది.

సీ॥ ఇన్నూట రెండేండ్లు ఈ నేలతల్లిపై పొరాడినట్టి నీ పాదములకు
రుగ్నుల రోగాలు భగ్నుల కన్నీళ్ళు అలవోక తుడుచు నీ హస్తములకు
భక్తుల కడగండ్లు రక్తుల కోరికల్ కడచూపులనె తీర్చు కన్నుగవకు
ముల్లోకములు కడచి ముక్కాలములు దాటి వార్తలందించు నీ వాఙ్నియతికి

భూమి గర్భాన శయనించి వ్యోమమునకు
ప్రభలు చిమ్మెడు నీ యస్థిపంజరముకు
పూజ కోసము తెచ్చిన పుష్పమిద్ది
కొనుము సొరకాయ తాత మా కోర్కెదీర

1-8-117/2, చీకటిపల్లి,
హైదరాబాదు - 500 020
ఫోను (040) 7661034

శ్రీ సత్యసాయి పాదపద్మారాధకుడు
బి.రామరాజు

శా.శ. ౧౯౧౪ ఆంగీరస శ్రావణశుద్ధ గరుడ పంచమి సోమవారం 3.8.1992, శ్రీ సొరకాయల స్వామివారి 90వ ఆరాధనోత్సవం.

# ద్వితీయ ముద్రణ

శ్రీ సారకాయల స్వామివారి 90 వ ఆరాధనోత్సవం 3-8-1992 సందర్భంగా మా కుటుంబం స్వామివారికి సమర్పించిన పూజాపుష్పం ప్రతులు 1000 చెల్లిపోవటానికి ఏడేండ్లు పట్టింది. అవతారపురుషుల చరిత్రలకు ఆంధ్రదేశంలో ఉన్న ఆదరం ఇట్టిది. 26-12-1994 నుండి శ్రీ సారకాయలస్వామి కైంకర్య సమాజానికి అధ్యక్షుడనుగా ఉండటం చేత సమాజ సభ్యులుగాని, భక్తులుగాని, కోరితే ఈ పుస్తకం అందించే బాధ్యత నాది కనుక ఈ రెండవముద్రణం అవసరమైనది.

స్వామివారి అష్టోత్తరం శ్లోకాలు, నామావళి, టి. వెంకటాచలశాస్త్రి రచించిన స్తుతి శ్లోకాలు ఇటీవల లభించినవాటిని అనుబంధంలో చేర్చినాను. అఖిలభారత సాయి సమాజ స్థాపకులు, సాయిబాబాగూర్చి గొప్పగ్రంథాలు ప్రకటించిన సత్పురుషులు మద్రాసు బి.వి.నరసింహస్వామి సారకాయలస్వామి భక్తులని సాయితత్త్వ ప్రచారకులు కీ.శే.బాపట్ల హనుమంతరావుగారు తెలిపిన సమాచారం (పుట84), ప్రస్తుతం పుట్టపర్తిలో ఉంటున్న నెల్లూరు డా॥ఎమ్.వి.కృష్ణారెడ్డి తమ తల్లిదండ్రులు కూడ సారకాయలస్వామి భక్తులని తెలిపిన సమాచారం (పుట94) ఇందులో అదనంగా చేర్చినాను. స్వామివారి సమకాలీన యోగుల పేర్ల పట్టిక మరికొంత పెరిగింది. సహృదయులీ గ్రంథాన్ని ఆదరిస్తారని ఆశ.

బి. రామరాజు

16.4.1999

**శ్రీ సొరకాయల స్వామి చరిత్ర**

# విషయసూచిక

# శ్రీ సొరకాయల స్వామి చరిత్ర

## ప్రథమ భాగం

### 1. వ్యక్తిత్వము

మన పవిత్ర భారతదేశాన్ని కర్మభూమి యాగభూమి యోగభూమి అంటారు. నిరాకార పరబ్రహ్మం సాకారమై అనేకావతారాలెత్తి తన దివ్యలీలలు ప్రదర్శించిన ధన్యభూమి మనదేశం. దివ్యజ్ఞాన సంపన్నులైన మహర్షుల యోగుల తపశ్శక్తి చేత ప్రబోధల చేత పునీతమైన పుణ్యభూమి మనదేశం. ఈ దేశంలోని పలు ప్రాంతాలు నదీనదాలు కొండలు కోనలు అరణ్యాలు గిరికందరాలు ప్రత్యణువున పావిత్ర్యం పండించుకున్నవి. అట్టివానిలో కలియుగ ప్రత్యక్ష దైవం శ్రీ వెంకటేశ్వర స్వామికి ఆవాసమైన చిత్తూరు మండలాంతర్గత వెంకటాచలము దాని పరిసర ప్రాంతాలు చాల విశిష్టమైనవి. సమున్నత గిరులతోను ఎడతెగక పారే ఝురులతోను వివిధ వన్యప్రాణులతోను తీరుతీరు ఫలవృక్షాలతోను అద్భుతమైన ఓషధులతోను గహనాటవులతోను యోగుల సిద్ధుల తపోవాటికలతోను మహిమాన్విత భూములుగా ప్రసిద్ధి చెందిన ఆ ప్రాంతానికి ఒకప్పుడు తుండీర మండలమని పేరు. తుండీర మండలానికి రాజధాని నారాయణపురం. వెంకటేశ్వరస్వామి అనుగ్రహానికి పాత్రుడైన మిత్రవర్మ తన కొడుకు ఆకాశరాజుకు రాజ్యభారం అప్పగించి వానప్రస్థుడై తపస్సు చేసినది ఈ ప్రాంతపు అడవుల్లోనే. నారాయణపురం ప్రక్కనుండి పారే అరణీనదీ తీరభూమిని యజ్ఞార్థం దున్నుతుంటే ఆకాశరాజుకు అయోనిజయైన పద్మావతి లభించినది ఈ భూమిలోనే. ధరణీదేవి ఆకాశరాజుల చేతుల్లో అల్లారుముద్దుగా పెరిగి పెద్దదై సఖులతో కూడి లీలోద్యానంలో విహరిస్తున్న పద్మావతిని వెంకటాచలం నుండి వేంచేసిన శ్రీనివాసుడు చూసి మక్కువ పడినది ఇక్కడనే. శ్రీనివాసుని పక్షాన వకుళమాలికా దేవి రాయబారానికి నడిచినది ఈ భూముల్లోనే. సమస్త దేవతల సమక్షంలో పద్మావతీ శ్రీనివాసుల కల్యాణోత్సవం జరిగినది ఈ నారాయణపురంలోనే. నాటి జ్ఞాపక చిహ్నంగా ఆకాశరాజు సోదరుడు తొండమాన్ కల్యాణ వెంకటేశ్వరాలయం కట్టిస్తే శ్రీనివాసుడు మామగారి అభ్యర్థన మన్నించి పద్మావతీ సహితుడై కల్యాణ వెంకటేశ్వర నామధేయంతో భక్తవరదుడుగా విరాజిల్లుతున్నది ఈ పురంలోనే.

ఇంతకాలం నారాయణపురంగా ఉండిన రాజధానీ నగరం నారాయణావతారుని నివాసం మూలంగా నారాయణవరంగా మారినది. పద్మావతీ శ్రీనివాసుల కల్యాణవైభవం చూడవచ్చిన పరాశరముని ఒక లింగం ప్రతిష్ఠించినాడు. అదే నేటి పరాశరేశ్వరాలయం. అగస్త్యుడు ప్రతిష్ఠించిన లింగమున్న అగస్త్యేశ్వరాలయం, ఆకాశరాజు తలపెట్టిన యజ్ఞాన్ని రక్షించటానికి వేదములే కన్నులుగా గల శక్తి వచ్చి నిలిచినచోట ఆమ్నాయాక్షి దేవాలయం వెలసినవి. నారాయణవరానికి ఎనిమిది దిక్కులలో, దగ్గరా-దూరాన, అనేక పవిత్ర క్షేత్రాలు కొండలు కోనలు జలపాతాలు దేవతలకు ఋషులకు సిద్ధయోగులకు ఆవాసభూములున్నవి. తూర్పున సింగరికోన, జలపాతాలు, ఆగ్నేయంలో కైలాసకోన, కైలాసనాథేశ్వరస్వామి, పెద్దజలపాతం, అరణ్యవాస కాలంలో పాండవు లున్నారని ప్రతీతి. దక్షిణాన అరుణానది, ఆమ్నాయాక్షి దేవళం, కెంపుల పాళియం ప్రాంతాల్లో ఆకాశరాజు కోటగోడలు, కొలదిదూరంలో నగరి పట్టణం, ఈశ్వరాయలం, దేశమ్మ ఆలయం, కరికాల వెంకటేశ్వరాయలం - నైఋతిలో కొలది దూరాన తిరుత్తణి, సుబ్రహ్మణ్యేశ్వరాలయం, సొరకాయల తాత తరచుగా వచ్చిన కుమారకుప్పం గ్రామం, ఆపైన శోలింగపురం (ఘటికాచలం) కొండ పైన ఉగ్రనరసింహస్వామి - పడమట కొలది దూరాన కార్వేటి నగరం, గొప్ప కోనేరు (కొత్తగుంట) వేణుగోపాలస్వామి ఆలయం, శివాలయం, దుర్గం అనే సాళ్వ రెడ్ల కోటగోడలు, సమీపాన పుత్తూరు పట్టణం, ఈశ్వరాలయం, ధర్మరాజుల గుడి, వాయవ్యంలో దూరాన తిరుచానూరు, అలవేల్మంగ గుడి, తిరుపతి, వరదరాజస్వామి ఆలయం, కపిలతీర్థం జలపాతం, తిరుమలపై వేంకటేశ్వరస్వామి, వరాహనరసింహస్వామి ఆలయాలు - ఉత్తరం ఈశాన్యముల్లో సదాశివకోన, సదాశివుడు కోనమ్మ దేవతలు, చక్కని జలపాతం, పాండవులు నివసించిన గుహ ఉన్నవి. ఇది మన చరిత్రకందని క్షేత్రమహిమ.

ఆధునిక చరిత్ర పుటల్లో క్రీ.శ.9.8.1902 పగలు 12 గంటలప్పుడు నారాయణవరంలో కాలచక్ర పరిభ్రమణం ఒక్కక్షణం నిలిచిపోయినది. అందరి కన్నులముందు పిచ్చి బిచ్చగాడుగా నడయాడిన ఒక యోగిరాజు, ఆధివ్యాధులతో అలమటించే ఆర్తుల కన్నీళ్ళు తుడువటానికై భిక్ష నెపంతో ఊరూరు తిరిగిన కరువున బోసిన కారుణ్యమూర్తి సొరకాయల స్వామిగా ప్రసిద్ధుడైన ఒక అవధూత మహాసమాధి చెందిన క్షణం అది. ఆ మహానుభావుడు ఎక్కడ పుట్టినాడో ఎన్నడు పుట్టినాడో కన్నవారెవరో పిన్నవాడుగా చూచిన వారెవరో ఎవరికీ తెలియదు. తిరుపతి సమీపంలో ఒక నిరుపేద గొల్ల కుటుంబంలో పుట్టి రామస్వామి పేరుతో గొఱ్ఱెలు మేకలు కాస్తూ అడవుల్లో తిరుగుతుండగా ఒక యోగిపుంగవుడు

తటస్థపడి మంత్రోపదేశం చేసినాడనీ నాటినుండి ఈ గొల్ల పిల్లవానికి ఇహలోక బంధాలు పోయినవని ఒక జనశ్రుతి. చెంగల్పట్టు జిల్లా తిరువళ్ళూరులో చాలాకాలం భిక్షమెత్తుతూ తిరిగేవాడనీ ఆయన చేతిలో ఒక గరుడపక్షి ఉండేదనీ క్రమంగా మహాయోగిగా సొరకాయల స్వామిగా ప్రసిద్ధుడైనాడనీ మరొక జనశ్రుతి. ఆయన సంచారం చుట్టుపట్టు పది గ్రామాలకే పరిమితం. ఎక్కువగా అడవుల్లోనే తిరుగుతూ ఆకలైనపుడు గ్రామం చొచ్చి నాలుగిండ్లు తిరిగి బిచ్చమెత్తి తినేవాడు. అందువలన సమకాలీన జానపదులు ఆయనను పిచ్చివాడనుకున్నారు. ఆయన వేషం కూడా అట్లాగే ఉండేది. భుజాన గుడ్డల మూట, నెత్తికి పెద్ద రుమాలు, మోకాళ్ళవరకు కట్టిన చిరుగుల పంచె, ఒక చేతిలో రెండు కుక్కలకు కట్టిన త్రాడు, త్రాగటానికి, తినటానికి బిచ్చమెత్తిన గింజలు అన్నం గంజి భద్రపరచుకోవటానికి సొరకాయ బుఱ్ఱలు. ఈ వేషంతో తిరుగుతుంటే స్థూలదృష్టి గల సాధారణ జనం ఆయనను ఎక్కడపడితే అక్కడ బిచ్చమడిగి తినే పిచ్చివాడనుకున్నారు. ఆయన మహిమలు ఒక్కటొక్కటిగా ప్రకటమౌతుంటే సొరకాయల స్వామి అన్నారు. అడవి చెట్లు నరికి చిదుగులు ఏరి మంటలు వేస్తుంటే తొలిదినాలలో చలి మంటలు అనుకున్నవాళ్ళు, స్వామి తామున్నచోట తప్పనిసరిగా అగ్నిహోత్రం వెలిగిస్తుంటే అటు తరువాత దత్తావతారుడన్నారు.

ఆయనది చామనచాయ పొట్టి విగ్రహం, జడలు కట్టిన శిరోజాలు, దట్టమైన నిడుపాటి తెల్లని గడ్డం, వక్షస్థలాన వ్రేలాడే ఆ గడ్డం చివరన ఒక ముడి, లోకాంతరాలు ఆలోకించే వజ్రాలవలె మెరిసే కన్నులు, గంభీరముద్రాంకితమైన ముఖం, తనలో తానుగాని ఇతరులతో గాని ద్వంద్వార్థాలతో పిట్టకథల రూపంలో మాట్లాడే తమిళభాష, శరీరం చాలించేనాటికి ఆయన వయస్సు ఇన్నూరేండ్లకు పైన; కాని చూడటానికి మాత్రం అంత వయస్సున్నట్లు కనపడరు. చింపిరి వేషంతో ఉన్నా ఆయన ముఖంలో బ్రహ్మవర్చస్సు తాండవించేది. కన్నులు మానవాతీత శక్తులను ప్రసరించేవి. మాటలు సరిగా అర్థమయ్యేవి కావు. నర్మగర్భంగా మాట్లాడేవారు. ఎక్కువకాలం ఏకాంతంలోనే గడిపేవారు. అప్పుడప్పుడు దుఃఖితుల గోడు వినేవారు. గుండె గాయాలకు ప్రేమామృతసేచనం చేసేవారు. ఆధివ్యాధిపీడితులకు మందులు మాకులు, తాము త్రాగే పచ్చినీళ్ళు తాము తినే పిడికెడు మెతుకులు ఇచ్చి ఆరోగ్యభాగ్యాలు ప్రసాదించేవారు. బాధాసర్ప దష్టులకు కష్ట నివారణోపాయాలు చెప్పేవారు. ఆశ్రితులకు భవిష్యత్తులో తప్పనిసరి ముప్పురానుంటే ముందుగానే హెచ్చరించి అనుభవించే గుండెదిటవు కూర్చేవారు. ప్రారబ్ధం బలీయమైతే వారికోసం కన్నీరు కార్చేవారు.

సొరకాయల స్వామి ఏ సంప్రదాయంవారో సరిగా తెలియదు. స్థూలంగా చెప్పుకోవాలంటే సత్యం, దయ, పరోపకారం, ఆయన మతం. సంకుచితాభిప్రాయభేదాలతో పరస్పరం పోట్లాడుకొనే మతాలకు ఆయన చాలా దూరం. ఆయన ఆజ్ఞ మేరకు భక్తులు అనుచరులు సన్నిధిలో నిరంతరం ధుని వెలిగిస్తుండేవారు. ఆయనను ఆశ్రయించిన శైవులా బూడిదను విభూతిగాను, వైష్ణవులు యజ్ఞశేషంగాను గ్రహించేవారు. ఆయన తన నొసట ఏదో ఒక సంప్రదాయానికి చిహ్నంగా బొట్టు పెట్టుకోలేదు. ఆయా భక్తులు తమ తమ సంప్రదాయాలకు అనుకూలంగా నిలువుగా అడ్డంగా చుక్కగా ఏ తీరుగా వారి నొసట బొట్టు పెట్టినా నిరాకరించ లేదు. ఆయన ఆచరణ ద్వారా, వాచా కూడ, విశ్వజనీనమైన నీతు లుపదేశించేవారు. మానవుల యెడనే కాదు పశుపక్షి మృగ కీటకాదుల యెడ కూడ దయతో మెలగవలెనని భక్తులకు ఉపదేశించేవారు. ఆయనవద్ద రెండు కుక్కలుండేవి. వాటిని గారాబంగా సాకుతూ లాలించేవారు. అవి చనిపోయిననాడు ఎంతో దుఃఖించినారు. హిందూ బౌద్ధ ధర్మాల్లోని జీవ కారుణ్యాభావం ఆయనలో కొట్టవచ్చినట్లు కనబడేది. ఏ రూపంలోను జీవహింస వారు సహించలేదు. ఏ ప్రాణినీ బాధించరాదని వారి తాత్పర్యం. స్వామివారు సర్వమతాల మూలసూత్రాలను ఉత్తమనీతులను సర్వదర్శనముల సారాన్ని పాటించేవారు, ప్రబోధించేవారు. వారి ప్రేమాదరాలకు ఎల్లలు లేవు. ధనికులను దరిద్రులను సమానంగా ఆదరించేవారు. అందరినీ ఆశీర్వదించి దుఃఖాలనూ బాధలను తొలగించేవారు. గొప్ప అధికారులు కోటీశ్వరులు కూటిపేదలు వారి దృష్టిలో సమానం. వారి అనుగ్రహం కోసం ఆగర్భ శ్రీమంతులు వారాల తరబడి కాచుకొని ఉన్నా నిరుపేదలకు వారి ఆశీర్వచనాలు వెంటనే లభించేవి. ఇందుమూలంగా స్వామి నిష్పక్షపాతి అని తెలుస్తుంది. స్వామి నిరీహులు, నిస్పృహులు, నిర్మములు. స్వామికి భోజనాదికముల పట్టింపు లేదు. ఏమి పెట్టినా తృప్తిగా తినేవారు. పంచభక్ష్య పరమాన్నాలు కాని రాగి జావకాని రసం మెతుకులు కాని వారు ఆరగించేది ఆకలి పాపుకోవటానికే గాని రుచులకోసం కాదు. దర్శనానికి వచ్చే భక్తులు తమ శక్తికొలది ఏ ఖాద్యపదార్థాలు తెచ్చినా సమానంగా ఆదరించి అందరికి పంచేవారు. ఆయన మహా విరాగి, గొప్ప తపస్వి. వారు పట్టుబట్టి శరీరాన్ని శుష్కింపజేయలేదు. తమ శరీరాన్ని తాము హింసించుకోలేదు. ఇతరులకు అట్లా చేయండని బోధించనూ లేదు. ఐతే యోగ విద్యారహస్యాలు ఉపదేశించటానికి దీక్షితులు కానివారు యోగ్యులు కారని వారి అభిప్రాయం. సాధారణ మానవ జీవిత స్థితినుండి పైకి ఎదగటానికి మితిమీరిన కృత్రిమపద్ధతులు అవలంబించటం కంటె అంతరాత్మ ప్రబోధాన్ని అనుసరిస్తూ స్వార్థాన్ని విషయ లంపటత్వాన్ని విసర్జించటం మేలనేవారు.

స్వామివారు కలుపుగోలుతనం గాంభీర్యం ఔదార్యం మూర్తీభవించిన వ్యక్తి. వారి హృదయంలో దయాపయస్సు లుప్పొంగేవి. పతితులను ఉద్ధరించటం దుఃఖితులను ఆదుకోవటం వారి ధ్యేయం. స్వామి త్రికాలజ్ఞాని. వారి అనుభూతులు ఆలోచనలు సామాన్యులకు గోచరమయ్యేవి కావు. వారి లోచూపులు వారి ఆధ్యాత్మిక వైభవానికి దర్పణములు. స్వామి ఒక్కొక్కపుడు హఠాత్తుగా ఉద్విగ్నులై కోపతాపాలు ప్రకటించేవారు. వెంటనే శాంత మనస్కులయ్యేవారు. అప్పుడే నవ్వు, అప్పుడే ఏడ్పు. ఇవి ఊరకే చేసే పిచ్చిచేష్టలు కావు. వారి దివ్యదృష్టికి గోచరించే అజ్ఞాత వాస్తవ దృశ్యాలకు ప్రతిస్పందించే భావ ప్రతీకలు. స్వామి నిరంతర కార్యశీలి, వేగ జంఘులు. బలిష్ఠులు కూడా వారివలె వేగంగా నడవలేరు. చాలా దూర ప్రదేశాలకు గూడ కాలినడకన పోయేవారు. కట్టెలు కొట్టేవారు, బిచ్చమెత్తేవారు. జీవితంలో చాలాభాగం నారాయణవరం నాగలాపురం మధ్యనే తిరిగినారు. చరమదశలో మాత్రమే మద్రాసువంటి మహానగరానికి రెండుమూడుసార్లు వెళ్ళి వచ్చినారు. నాగలాపురానికి నారాయణవరానికి రాకపోకలు సాగించినపుడు కూడా ఎన్నడూ ఏ వాహనమూ ఉపయోగించ లేదు. కాలినడకనే పోయేవారు. తమ వస్తువులన్నీ తామే మోసుకపోయేవారు. భక్తులు శిష్యులు 'స్వామీ' అని సంబోధించేవారు. మిగతా జనం 'తాతా' అని పిలిచేవారు. సామాన్యజనంలో 'తాత' 'సొరకాయల తాత' అనే వాడుక ఎక్కువ.

# 2. ఆవిష్కరణము

క్రీ.శ. 1875 ఏప్రిల్‌లో ఎన్.రత్నసభాపతి పిళ్ళై ఇంజనీరు, అతని స్నేహితులు నారాయణస్వామి నాయుడు, చెంగల్వారాయ మొదలియారు ఉద్యోగరీత్యా నారాయణ వరంలో నివాసం ఏర్పాటు చేసుకున్నారు. ఒక నెల గడిచింది. ఎండలు మండే మే నెలలో ఒకనాడుదయం తొమ్మిది గంటలప్పుడు మొదలియారు తన యింటి వీధి అరుగుమీద కూర్చున్నాడు. రెండు కుక్కలను కట్టిన త్రాడు ఒక చేతిలో, వెదురుకఱ్ఱ మరొక చేతిలో వీపుమీద పెద్ద గుడ్డల మూటతో పోతున్న ఒక వృద్ధమూర్తి ఆతని కంట పడినాడు. వీథిలోని వారంతా వారివైపే చూస్తున్నారు. ఆ సమయాన అక్కడున్న సుందర సుబ్బరాయులు నాయుడు ఆ వృద్ధమూర్తి సాధారణుడు కాడని ఒక మహాత్ముడని మొదలియారుతో అన్నాడు. ( ఆ వెదురుకఱ్ఱ మొదలియారు ఇంట్లో పూజావస్తువుగా భద్రంగా ఉన్నది). ధార్మికనిష్ఠ కలవాడు కనుక మొదలియారు విశేషాలు తెలుసుకోవాలనే ఉద్దేశంతో ఆ వృద్ధమూర్తిని వెంబడించినాడు. ఆ మహాపురుషుడు ఇల్లిల్లు తిరిగి బిచ్చమెత్తి తాను కొద్దిగా తిని మిగతా కుక్కలకు వేసినాడు. ఈవిధంగా ఆ మహాపురుషుని వెంట తిరిగి గమనించిన విశేషాలు మొదలియారు ఇంటికి వచ్చి తన మిత్రులకు వినిపించినాడు.

సూర్యాస్తమయం తరువాత ముగ్గురు మిత్రులు స్వామి మాహాత్మ్యం ఏమిటో తెలుసుకుందామని వారి దర్శనానికి బయలుదేరినారు. సాయంకాలం 7 గంటలప్పుడు స్వామి సుందరచెట్టి ఇంటి ఎదురుగా వీథిలో కూర్చుండి “అమ్మా! అమ్మా!” అంటూ పిలుస్తున్నారు. దారిన పోయేవారంతా ఆయన చుట్టూ మూగినారు. అప్పుడే ఒక నల్లకుక్క తోకాడిస్తూ చిన్నగా మొరుగుతూ అక్కడికి చేరుకున్నది. అది గమనించి అక్కడ మూగిన వారిలో ఒకడు “ఓ రామస్వామీ! మీ వద్ద ఇదివరకే రెండు కుక్కలున్నాయి గదా! ఇంకొక కుక్క ఎందుకు?” అంటూ విడ్డూరంగా ప్రశ్నించినాడు. స్వామి ఒక వింత చిరునవ్వు విసిరి మూడవ కుక్క గురించి చెప్పకుండా మొదలియారును చూపుతూ “ఇది మద్రాసు నుండి వచ్చిన కుక్కయ్యా!” అన్నాడు. అవకాశం కోసం ఎదురుచూస్తున్న చెంగల్వారాయ మొదలియారు స్వామి అనుగ్రహం సంపాదించుకోవటానికి మంచి అదను దొరికిందనుకొని తనను పరిచయం చేసుకొని ‘స్వామీ! మీకేమి కావలె?” అన్నాడు. స్వామి “త్రాగటానికి మంచినీళ్ళు కావలె” అనగానే తెచ్చి యిచ్చినాడు. స్వామి “చుట్ట త్రాగాలె” అనగానే పొగాకు తెచ్చి యిచ్చినాడు. స్వామి నింపాదిగా రెండు గంటల సేపు పొగ పీల్చి నిద్రపోయినారు. ముగ్గురు మిత్రులు తమ బసకు చేరుకున్నారు.

చెంగల్వరాయ మొదలియారు స్వతంత్రుడు కనుక విరామం ఎక్కువ. ధార్మికనిష్ఠ ఉత్సాహము కలవాడు కనుక సమయం చిక్కినపుడల్లా స్వామి దర్శనానికి పోయి సేవిస్తూండేవాడు. స్వామి ఎటుపోతే అటు వెంట పోతుండేవాడు. ఒకనాడు స్వామి మొదలియారును తమ వెంట సమీపారణ్యానికి తోడ్కొని పోయినారు. అది భయంకరమైన కీకారణ్యం. సూర్యకిరణాలు చొరరాని దట్టమైన ఆ చీకటి అడవిలో మృత్యునిశ్శబ్దం తాండవించే ఆ గహనాటవిలో పోతూ పోతూ స్వామి ఒక లింగం ఉన్న చోటుకు చేరి ఆగినారు. స్వామి ఆ లింగానికి ప్రదక్షిణం చేస్తుండగా మొదలియారు కుక్కలకు కట్టిన తాడు పట్టుకున్నాడు. అప్పుడొక చిత్రం జరిగింది. తన దగ్గరున్న కుక్క హఠాత్తుగా 50 గజాల దూరాన మొరుగుతున్నట్లు కనపడింది. ఆ కుక్క రెండుసార్లు అప్పుడే సమీపాన అప్పుడే దూరాన గోచరించింది. ఈ వింత దృశ్యాన్ని చూస్తూ విస్తుపోయిన మొదలియారును స్వామివారు లింగానికి ప్రదక్షిణించుమని ఆదేశించినారు. మొదలియారు ప్రదక్షిణం చేసినాడు. ఇద్దరూ నారాయణవరానికి తిరిగి వచ్చినారు. మొదలియారుకు స్వామి మహత్వంపై విశ్వాసం దృఢపడింది.

స్వామికి భిక్ష చేయవలెననే తీవ్రమైన ఆకాంక్ష చెంగల్వరాయమొదలియారుకు కలిగింది. ప్రతిదినం స్వామికోసం వంట చేయించేవాడు. కాని స్వామి ఆవైపు రాకపోయేవారు. ఐతే ఒకనాడు పారుగింటివారి సమయానుకూల సహకారం మూలంగా స్వామివారిని ఇంజనీర్లుండే ఇండ్లవైపు రావలసిందిగా ప్రార్థించినారు. వచ్చీ రావటంతోనే నన్నెందుకు పిలిపించినావని స్వామి మొదలియారుపై గట్టిగా అరచినారు. మొదలియారు సాష్టాంగపడి భిక్ష స్వీకరించ వలసిందిగా ప్రార్థించినాడు. స్వామి మందహాసం చేసి "ఓ ! నువ్వు నాకు అన్నం పెట్టి తరువాత గొంతు కోస్తావు" అన్నారు. మొదలియారు తానటువంటి పని చేయనంటూ బతిమాలినాడు. స్వామి అంగీకరించి "అటులైతే వీధిలో విస్తరి వేయి, నీ కోరిక తీరుస్తాను" అన్నారు. మొదలియారు స్వామి ఆజ్ఞను పాటించినాడు. స్వామి రెండు ముద్దలు తిన్నారు. నాటినుండి స్వామివారు ప్రతిదినం ఆ యిండ్లవైపు వచ్చి తినిపోయేవారు. ఉన్నట్లుండి ఒకనాడు స్వామి "నేను తూర్పుకు పోతాను. మీరు పడమటికి పొండి" అన్నారు. దీని భావం మొదలియారుకు అతని స్నేహితులకు తెలియలేదు. కాని రెండు మూడు దినాల తరువాత ఎన్.రత్నసభాపతి పిళ్ళైగారిని చిత్తూరుకు బదిలీ చేసినట్లు ఉత్తర్వులు వచ్చినవి. స్వామి భవిష్యవాణి ఫలించింది. ఆ ముగ్గురు స్నేహితులూ చిత్తూరుకు వెళ్ళిపోయినారు. అటు తరువాత ఎన్. రత్నసభాపతి పిళ్ళై అప్పుడప్పుడు వచ్చి స్వామిని దర్శించిపోయేవాడు. కాని చెంగల్వరాయ మొదలియారు ఎస్.నారాయణస్వామి నాయుడు మాత్రం తరుచుగా వచ్చి సేవించేవారు. ఈ యిద్దరిలోనూ మొదలియారు స్వామివెంట ఎప్పుడూ ఉండేవాడు. రాబోయే పుటల్లో వర్ణించిన స్వామివారి మాహాత్మ్యాలన్నింటికి ఈ మొదలియారే సాక్షి. స్వామి చెప్పిన భవిష్యాలన్నీ యధార్థ కథనాలే.

# 3. అద్భుతాలు

సొరకాయల స్వామివారు చేసిన అద్భుతాలు, ప్రదర్శించిన మహిమలు లెక్కకు మిక్కిలి. అవి గారడీ విద్యలు కావు. తర్కసూత్రాలంత శాస్త్రీయంగా ఉండేవి. దీనులపైన దుఃఖార్తుల పైన వారు కురిపించిన దయావృష్టికి అవి నిదర్శనాలు. మానవులకు నోరులేని మూగజీవాలకు తేడా పాటించకుండా సమస్త ప్రాణికోటిపై వారి దయావృష్టి కురిసేది.

ఒకనాడు నిర్మలాకాశంలో పట్టపగలింటి సూర్యుడు తీక్షంగా వెలిగి పోతుండగా నారాయణవరానికి 12 మైళ్ళదూరాన గల తెన్నంబేడు గ్రామంలో ఒక మారుమూల చింతచెట్టు క్రింద స్వామివారు ఏమీ పట్టనట్లు కూర్చున్నారు. పొగ పీలుస్తూ మాట్లాడుతున్నారు. అప్పుడు ఆకస్మికంగా ఒక వృద్ధురాలు తన మనుమరాలును వెంటబెట్టుకొని వచ్చింది. ఆ అమ్మాయి చాలాకాలంగా తీవ్ర జ్వరంతో బాధపడుతున్నదనీ, ఏ మందులూ పనిచేయలేదనీ, గొప్ప గొప్ప వైద్యులంతా పెదవి విరిచినారనీ చెప్పింది. ఆ పిల్ల చిక్కి శల్యమై ఊపిరి కూడ పీల్చలేకపోతున్నది. ఆ పిల్ల కొడిగట్టిన దీపంవలె జ్వరతీవ్రతతో వణుకుతూ జీవితం చరమావస్థకు చేరుకున్నది. స్వామివారు ఆ పిల్లపై జాలి తలచి నేలమీది మట్టి తీసి ఇచ్చి తినిపించుమన్నారు. ముసలమ్మ తినిపించింది. ఆ పిల్ల జ్వరం తగ్గి క్రమంగా కోలుకొని రెండు మాసాల్లో సంపూర్ణారోగ్యం పొంది కండ పట్టింది.

ఒకరాత్రి స్వామివారు, చెంగల్వరాయ మొదలియారు నారాయణవరంలో ఒక యింటి అరుగుపై పడుకున్నారు. దోమలు విపరీతంగా మొదలియారును కుడుతున్నాయి. మొదలియారు లేచి కూర్చున్నాడు. ఏమి చేయాలో తోచటం లేదు. స్వామికూడ లేచి 'ఏమి సంగతి?' అని అడిగినారు. దోమల బాధకు తట్టుకోలేకపోతున్నాని మొదలియారు అన్నాడు. స్వామివారు "అయ్యో! పాపిష్టి దోమలు అంత పని చేసినాయా?" అంటూ అరుగుపై నడుం వాల్చి ఒక కాలుమీద మరొకకాలు పెట్టి తమ కుడిచేతిని అటు ఇటు త్రిప్పి వట్టి బయలులో ఒక వృత్తాకారం సృష్టించినట్లు చేసి మొదలియారును "ఇక పడుకొ"మ్మన్నారు. దోమల బెడద ఆశ్చర్యకరంగా మటుమాయమై పోయింది. మొదలియారు సుఖంగా గాఢనిద్ర పోయినాడు.

ఈ సంఘటన తరువాత కొన్నిదినాలకు స్వామివారు మొదలియారును పిలిచి "వాడు తిండిలేక మాడిపోతున్నాడు. పోదాం పద, ఏమైనా పెడుదాం" అంటూ బయలు

దేరదీసినారు. పోతూ పోతూ కొన్ని వీథులు నడచి హఠాత్తుగా స్వామివారు ఒక ఇంటిముందు ఆగిపోయి "ఇక్కడికే నేను రావాలనుకున్నది" అన్నారు. అక్కడ ఎవ్వరూ లేరు. వాకిలిచెంత ఒక ఎద్దు కట్టివేసి ఉన్నది. మొదలియారు "మనం వచ్చింది ఎవరికోసం?" అని అడిగతే స్వామి ఆ యెద్దును చూపినారు. మొదలియారు ఆ యింట్లోకి పోయి పెద్దగా కేకలు వేసి ఆ యింటి యజమానిని స్వామిచెంతకు తోడ్కొని వచ్చినాడు. ఆ మోటుమనిషి ఎద్దుకు ఏదో రోగం పట్టుక్కున్నదనీ ఏమీ తినటం లేదనీ నీళ్ళు కూడ త్రాగటం లేదనీ స్వామికి చెప్పినాడు. స్వామి ఆ యెద్దు చుట్టు మూడుసార్లు తిరిగి తినుమని గట్టిగా ఆజ్ఞాపించినారు. వెంటనే అది ఇంత గడ్డి తిని నీళ్ళు త్రాగింది. చుట్టు మూగినవాళ్ళంతా ఆశ్చర్యపోయినారు. గురువు శిష్యుడు తిరిగి వచ్చినారు. ఆ పశువు గురించి అంత శ్రమ ఎందుకు పడ్డారని మొదలియారు ప్రశ్నిస్తే స్వామి ఆ యెద్దు పూర్వజన్మలో ఒక నిష్ఠాగరిష్ఠుడైన వైష్ణవుడనీ గోపూజ చేసేవాడనీ ద్వాదశోర్ధ్వ పుండ్రాలు తులసిమాల ధరించేవాడనీ సమాధానం చెప్పినారు. ఆధ్యాత్మిక పరిణామంలో అట్లా భ్రష్టుడైపోయినందుకు స్వామి అతనియెడ జాలి ప్రకటించినారు.

క్రమంగా స్వామి మహిమలు బాగా ప్రఖ్యాతమైనవి. చాలా ప్రాంతాల నుండి జనం తండోపతండాలుగా స్వామి సన్నిధికి రాసాగినారు. ఒక చాకలికి మెడ మీద వీపుమీద రాచ కురుపులు పుట్టి చిక్కి శల్యమైపోయినాడు. ఎన్ని తీరుల ఔషధాలు సేవించినా ప్రయోజనం లేకపోయింది. ఆతడు హతాశుడై స్వామివారి సన్నిధికి వచ్చి సాగిలపడ్డాడు. దయామయుడైన స్వామి "చింతపండు గుజ్జు పుండ్లకు రాయి. నయం ఔతుంది" అంటూ దీవించినారు. పక్షం దినాల్లో వానికి సంపూర్ణారోగ్యం కలిగి ఎప్పటివలె దృఢకాయుడై కాయకష్టం చేసుకున్నాడు.

ఒకసారి చెంగల్వరాయ మొదలియారు, సుబ్బరాయ మొదలి అనే మిత్రుణ్ణి స్వామి దర్శనం కోసం తనవెంట తీసుకపోయినాడు. ఇద్దరూ స్వామివారి వెంట ఒకచోటి నుండి మరొకచోటికి చాలాదూరం తిరిగి తిరిగి చివరకు రామగిరి పర్వతం సమీపాన ఉన్న శివాలయం చేరినారు. సుబ్బరాయమొదలి విపరీతమైన నడుంనొప్పితో బాధపడుతూ ఎట్లాగో ఇంతదూరం నడువగలిగినాడు. అక్కడికి చేరిన తరువాత స్వామివారు తమ నడుము కాళ్ళు ఒత్తుమని సుబ్బరాయమొదలిని ఆదేశించినారు. అతడు తానే దుర్భరమైన నడుంనొప్పితో బాధపడుతున్నాడు కదా! స్వామివారి ఆజ్ఞను ఉల్లంఘించటమా అనే శంకలో పడ్డాడు. అతని పరిస్థితి గమనించిన చెంగల్వరాయ మొదలియారు వెంటనే స్వామి ఆజ్ఞ పాలించవలసిందని, అందులో ఏదో విశేషం తప్పక ఉండి తీరుతుందని సలహా యిచ్చినాడు. వెంటనే సుబ్బరాయ

మొదలి స్వామి ఆజ్ఞ పాలించినాడు. చిత్రమేమిటంటే స్వామి పడుకున్న తరువాత తాను కూడ పడుకుందామని లేచేసరికి తన నడుం నొప్పి మాయమైపోయింది.

కీ.శే. అరవముదు నాయుడు, కె.పార్థసారథి నాయుడు గౌరవం గల ప్రభుత్వోద్యోగులు, స్వామివారికి భక్తులు. వాళ్ళిద్దరూ సంపన్నులు, స్వామి మహిమల్లో అపారవిశ్వాసం ఉన్నవాళ్ళు. అందువలన పల్లెటూరి నివాసము, ప్రయాణము, అందులో ఉండే కష్టనష్టాలు అసౌకర్యాలు ఓర్చుకుంటూ స్వామి దర్శనానికి వస్తుండేవారు. ఒకసారి ఈ యిరువురు నాయుళ్ళు చెంగల్వ రాయ మొదలియారు కలిసి స్వామిని ఒక దూరపు గ్రామం నుండి నారాయణవరానికి ఒక బండిలో తోడ్కొని వస్తున్నారు. స్వామి బండి ఎక్కబోతుండగా కొద్దిగా చినుకులు పడుతున్నవి. "అమ్మా! బిడ్డలు బయలుదేరుతున్నారు. తడువనీయకు" అనే మాటలు వినపడినవి. ఆ మాట లెవ్వరన్నారో తెలియలేదు. స్వామివారు ఇద్దరు నాయుళ్ళూ బండిలో కూర్చున్నారు. మొదలియారు బండి వెనుక నడుస్తున్నాడు. అప్పుడొక అద్భుతమైన వింత జరిగింది. చుట్టు ప్రక్కల నాల్గువైపులా జడివాన కురుస్తున్నందున జనం తల దాచుకోవటానికి అటుఇటు పరుగెత్తుతున్నారు కాని బండి పైనగాని మొదలియారుపైన గాని ఒక్క చినుకైనా పడలేదు. నాయుళ్ళిద్దరూ ఈ అద్భుతాన్ని గమనించినారు. ఆ బండి నారాయణవరం చేరేదాకా చుట్టూ కుంభవృష్టి కురుస్తున్నా బండిమీద, మొదలియారు మీద వాన పడనేలేదు. ఇది స్వామి వారి మహిమే అని వాళ్ళు గ్రహించినారు.

ఒకనాడు స్వామి చెంగల్వరాయ మొదలియారు నారాయణ వరానికి 13 మైళ్ళు దూరాన ఉన్న శరవంబాక్కం గ్రామంలోని శివాలయం ప్రవేశించి అక్కడే భోజనాల ఏర్పాట్లు చేయుమన్నారు. భోజనాలకు విస్తళ్ళు వేస్తుండగా స్వామివారు మొదలియారుతో మరొక విస్తరి ఎక్కువ వేయుమన్నారు. అట్లా ఎందుకోసం వేయుమన్నారో తెలియకపోయినా మొదలియారు స్వామి చెప్పినట్లే చేసినాడు. స్వామి భోంచేసి నడుం వాలుస్తుండగా ఇద్దరు మనుష్యులొక రోగిని మోసుకవచ్చినారు. ఆ రోగి 8 మాసాల నుండి తీవ్రజ్వరంతో బాధపడుతున్నాడనీ ఏమీ తినటం లేదనీ స్వామికి నివేదించినారు. స్వామి మొదలియారుతో ఇందాకటి విస్తరి వేసి మిగిలిన అన్నం బీరకాయ పులుసూ ఆ రోగికి వడ్డించుమన్నారు. రోగి తోడుగా వచ్చినవాళ్ళు మొదలియారును పెట్టవద్దని బతిమాలినారు. స్వామి మాత్రం వడ్డించవలసిందిగా ఆదేశించి ఆ రోగిని అన్నం తినుమని ఆజ్ఞాపించినారు. రోగి కడుపునిండా అన్నం తిన్నాడు. ఇంతటితో అతని రోగం పోయి మృత్యుముఖం నుండి బయటపడ్డాడు.

ఒక సాయంకాలం 4 గంటలప్పుడు స్వామి తమ మూటముల్లె సర్దుకొని నారాయణవరం నుండి బయలుదేరినారు. స్వామివెంట చెంగల్వరాయ మొదలియారు నారాయణస్వామి నాయుడు మరొక వృద్ధుడు ఉన్నారు. ఎక్కడికి పోతున్నారో ఎవరికీ తెలియదు. స్వామివారు వాళ్ళను ఒక కొండవద్దకు తోడ్కొని పోయి ఒక గుహవద్ద వాళ్ళను కూర్చుండబెట్టినారు. సమీపాన ఒక చెరువు ఎదురుగా విశాలమైన మైదానం ఉన్నాయి. నలుగురూ భోజనాలు ముగించి విశ్రాంతి కోసం నడుములు వాల్చినారు. అది భయంకర నిశ్శబ్దం ఆవరించిన చోటు. అప్పుడు రాత్రి 9 గంటల సమయం. చుట్టుపట్ల జన సంచారపు చాయలే లేవు. అడవి జంతువుల భీకర రణగొణ ధ్వనులు వినపడుతున్నాయి. పలపలమని వెన్నెల కాసే చంద్రుడొక్కడే ఆ భయంకర దృశ్యానికి సాక్షి. వాళ్ళు మేల్కొనే ఉన్నారు. ఒకరితో ఒకరు గుసగుసలు చెప్పుకుంటున్నారు. చెరువుకు అద్దరిని ఒక పెద్దపులి వచ్చి నీళ్ళు త్రాగి పడుకున్నది. వృద్ధుడా దృశ్యం చూచి భయంతో వణికిపోతున్నాడు. అందరికీ చావు మూడిందని ఏడ్వసాగినాడు. "స్వామీ! మీ అతీంద్రియేచ్ఛల అయోమయంలో మమ్ముల ఇట్లా ఇరికించకండి. అదిగో పెద్దపులి పొంచి చూస్తున్నది. ఒక్క క్షణంలో మాపై దూకుతుంది. మిమ్ముల విడిచిపెట్టి మమ్ముల చీల్చి చెండాడుతుంది. ఇట్లా చేయటం మీకు తగునా? మీరు సర్వసమర్థులు. మా ప్రాణాలు రక్షించండి" అంటూ బావురుమన్నాడు. స్వామివారు ఆ ముసలివాణ్ణి బెదరించి నోరు మూయించినారు. ఐనా అతడు వేడిగా నిట్టూరుస్తూ కన్నీరు కారుస్తూనే ఉన్నాడు. అరగంట కాకముందే ఆ పెద్దపులి లేచి అడవిలోకి మెల్లగా జారుకున్నది. అది పోగానే ఒక ఎలుగుబంటి వచ్చి నీళ్ళు త్రాగి వీళ్ళవైపు తీక్షణంగా చూడసాగింది. ఆ పిరికి వృద్ధుడు మరల పాతపాటే మొదలు పెట్టినాడు. అప్పుడు స్వామివారు కోపంతో "నీవు ఇట్లా అరిస్తే అది వచ్చి అందరినీ పొట్టన పెట్టుకుంటుం"దని భయపెట్టినారు. మొదలియారు, నాయుడు ఆ వృద్ధుని రాత్రంతా ఓదారుస్తునే ఉన్నారు. ప్రొద్దు పొడిచిన తరువాత అందరూ నారాయణవరం తిరిగి వచ్చినారు. స్వామివారా సాహసకృత్యం ఎందుకు చేసినారో వారిలో ఎవరికీ తెలియలేదు కాని స్వామివారి మహత్వం మాత్రం అందరికీ నిస్సందేహంగా అవగతమైనది.

ఒకసారి స్వామి దర్శనార్థం మొదలియారు నారాయణవరం వెళ్ళేవరకు స్వామివారక్కడ లేరు. ఆ సమయాన స్వామివారు నారాయణవరానికి 8 మైళ్ళ దూరాన తుంబూరు గ్రామంలో ఉన్నారు. మొదలియారు వెంట గూడురు తాసీల్దారు కుప్పుస్వామి చెట్టియారు కూడా తుంబూరు వెళ్ళినాడు. రెండు దినాల తరువాత తన ఉద్యోగధర్మ

నిర్వహణకు తిరిగిపోవటంకోసం స్వామివారి అనుమతి కోరినాడు. కాని స్వామి అనుమతించకుండా తరువాత పోదువులే అన్నారు. చెట్టియారు ఇరకాటంలో పడ్డాడు. అటు నుయ్యి ఇటు గొయ్యి, అటు డ్యూటీ ఇటు స్వామి ఆజ్ఞ. ఎటూ తోచక అతడు ఆందోళన పడుతుంటే మొదలియారు రాత్రి ట్రేనుకు పోదువులే అన్నాడు. చెట్టియారు వేదాంతంలో ఎం.ఏ. పట్టభద్రుడు. స్వామివారి మానవాతీతశక్తిలో అచంచల విశ్వాసం ఉన్నవాడు కనుక వారి ఆజ్ఞను ఉల్లఘించదలచలేదు. ఓపికతో వేచియున్నాడు. ఇంతలో రాత్రి 12 గంటలైనది. వీథిలో బండిని నిలబెట్టి చెంగల్వరాయ మొదలియారు స్వామివారిని నారాయణవరానికి పోదామని బయలుదేర దీసినాడు. ఇది భంగ్యంతరంగా చెట్టియారు ప్రయాణానికి స్వామి అనుమతి పొందటమే. అనుకున్నట్లే అందరు బయలుదేరి ప్రయాణం సాగించినారు. మార్గమధ్యంలో ఒక నది దాటవలసి ఉంటుంది. నదీతీరం చేరుకోగానే స్వామి బండి దిగి నిలిచిపోయినారు. చెట్టియారు మాత్రం జాగు చేయకుండా నేరుగా రైల్వేస్టేషనుకు వెళ్ళినాడు. చెంగల్వరాయ మొదలియారు స్వామితోనే ఉండిపోయినాడు. మరునాడుదయం స్వామివారు మొదలియారు నదీతీరాన ఉపాహారం సేవిస్తుండగా హఠాత్తుగా అప్సరసల వంటి ఇద్దరు సుందరాంగులక్కడ ప్రత్యక్షమై తమ కోమల మధుర కంఠస్వరంతో స్వామివారిని పిడికెడు ప్రసాదం యాచించినారు. స్వామికి సాష్టాంగ ప్రణామం చేసి నిలుచుండి చేతులు చాచినారు. స్వామి ప్రసాదం అనుగ్రహించినారు. ఒక్కక్షణం మరోధ్యాసతో వేరుదిక్కు చూస్తుండిన మొదలియారు దృష్టి ఈ సుందరాంగులున్న వైపు మరలేవరకే వారు మటుమాయ మైనారు. చెట్టు చేమ పుట్ట పొద లేని ఆ విశాల మైదానంలో వాళ్ళు క్షణంలో ఎట్లా కనుమరుగైనారో మొదలియారుకు అంతు పట్టలేదు. ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరై అతడు ఆ సుందరాంగు లెవరని స్వామివారి నడిగితే "ఎవరో! వాళ్ళెవరైతే నీకెందుకు?" అన్నారు. స్వామివారు మొదలియారుతో మనం ఎక్కివచ్చిన బండి ఏమైనదంటే నారాయణవరం పోయిందన్నాడు. స్వామివారు "అయితే ఆయన తొందరగానే తిరిగి వస్తాడు" అన్నారు. అన్నట్లుగానే కుప్పుస్వామి చెట్టియారు మూడు దినాల్లోగానే నారాయణవరానికి తిరిగి వచ్చినాడు. స్వామివారి అనుమతి తీసుకోకుండా వెళ్ళి పోయినందుకు తన అంతరాత్మ పదే పదే హెచ్చరించటం చేత సెలవుదినాలు స్వామిచెంతనే గడిపి పోదామనే కోరికతో తిరిగి వచ్చినానన్నాడు చెట్టియారు.

ఒకరాత్రి స్వామివారు మంచి నిద్రలో ఉండగా కార్వేటి నగరం రాజుల సమీప బంధువు ఒకాయన వచ్చి స్వామి నిద్ర లేచేదాకా కాచుకొని ఉన్నాడు. స్వామి నిద్ర లేవగనే స్వామికి సాష్టాంగ పడి తాను తెచ్చిన కమలాఫలాలు సమర్పింపబోయినాడు. కాని స్వామివారు

కోపంతో గుడ్లెఱ్ఱజేసి పాదాలతో భూమిని తాడిస్తూ ఆ పండ్లు వద్దన్నారు. ఆ పెద్దమనిషి మొదలియారుతో మాట్లాడి స్వామివారు ఫలాలు స్వీకరించేటట్లు ఒప్పించవలసిందిగా బతిమాలినాడు. ఆయన ఒక కార్యార్థియై వచ్చినట్లు మొదలియారుకు చెప్పినాడు. ఔషధాల్లో వాడటానికి మంచి కాపర్ సల్ఫేట్ (మైల తుత్తం) పొడి సులభంగా సిద్ధం చేసే ఉపాయం కనుక్కుందామని వచ్చినాడు. ఆయన ఇంతకు పూర్వం ఎందరో వైద్యులను దీనికోసం ఆశ్రయించినాడు. కాని కృతకృత్యుడు కాలేదు. ఐతే స్వామివారు ససేమిరా వినిపించుకోలేదు. ఆ ఫలాలు తాము ముట్టకపోగా మొదలియారును కూడ తీసుకోవద్దన్నారు. మొదలియారు స్వామి ఆజ్ఞను అక్షరాలా పాలించినాడు. కాని స్వామివారు కూర్చుండే అరుగు ఇంటి యజమాని మాత్రం మొదలియారు మాట వినకుండా ఆ పండ్లు తీసుకొని తన పిల్లలకిచ్చినాడు. పండ్లు తిన్న కొలది నిముషాల్లో పిల్లలు తీవ్రజ్వరంతో వణకటం ప్రారంభించినారు. ఇంటి యజమాని తన మూర్ఖత్వం తప్పిదం తెలుసుకున్నాడు. స్వామినడిగే ధైర్యం లేక మొదలియారును బతిమాలినాడు. స్వామివారు కల్పించుకొని తన పిల్లల ప్రాణాలు కాపాడేటట్లు చేయవలసిందని ప్రార్థించినాడు. పిల్లలమీది జాలితో మొదలియారు స్వామికి మనవి చేస్తే స్వామి "ఔను నిషిద్ధ ఫలాలు తిన్నందుకు అనుభవిస్తున్నారు" అన్నారు. అంతకంటే మిక్కిలి మాట్లాడలేదు. భోజనాల సమయందాకా అందరూ కాచుకొని ఉన్నారు. భోజనాలప్పుడు స్వామి ఆ పిల్లలకు తలా పిడికెడు ప్రసాదం పెట్టినారు. ప్రసాదం తిన్న క్షణంనుండి వాళ్ళ జ్వరం తిరుగుముఖం పట్టింది. ఆరోగ్యం కలిగింది.

ఒక వింతమనిషి మద్రాసునుండి ప్రతి కృత్తికా నక్షత్రానికి తిరుత్తణికి పోయేవాడు. అతనికి మతపిచ్చితో పాటు దురాశ, తొందరపాటులు కూడ ఎక్కువే. తిరుత్తణిలో అతడు సదైయమ్మాళ్ అనే వేదాంతిని యింట్లో ఉండేవాడు. ఒకసారి అతడు తిరుత్తణికి పోయేవరకు ఆమె లేదు. నారాయణవరం పోయిందన్నారు. అతడు బయలుదేరుతుండగా ఆమె నారాయణవరంనుండి తిరిగివచ్చి స్వామివారి మహత్వం అద్భుతశక్తులు విపులంగా చెప్పింది. వెంటనే పోయి స్వామిని దర్శించి ఆధ్యాత్మిక రహస్యాలు తెలుసుకోవాలనే కోరిక అతనికి కలిగింది. తత్క్షణమే బయలుదేరి నారాయణవరం చేరి స్వామివారు అసాధారణవ్యక్తి అని గుర్తించినాడు. స్వామివారి ప్రతిచర్యను గమనిస్తూ నీడవలె వెంటాడసాగినాడు. స్వామి ఏటికి పోయి మల విసర్జనం చేసి అశుద్ధాన్ని ముండ్లపొదలలోనికి విసిరివేయటం చాటుగా ఉండి గమనించినాడు. ఇతడు స్వామి మలానికి పరుసవేదివంటి శక్తులుంటాయని భావించి కొద్దిగా తిని మద్రాసుకు పారిపోయినాడు. కాని అతని మతి చలించింది. పిచ్చి చేష్టలు చేయసాగినాడు. ఉచితానుచితాలు కోలుపోయినాడు. తీరుతీరుల చికిత్సలు చేయించినారు

కాని నయం కాలేదు. ఎప్పుడో మంచిగా స్పృహలో ఉన్నపుడు తాను చేసిన అపచారం తత్ఫలితంగా స్వామివారి నిగ్రహానికి పాత్రుడు కావటం ఒక మిత్రునికి చెప్పినాడు. వెంటనే అతణ్ణి స్వామివారి చెంతకు నారాయణవరం తీసుకపోయినారు. కాని స్వామి ఆగ్రహోదగ్రులై అక్కడినుండి తరిమి వేసినారు. మద్రాసుకు తిరిగి వచ్చి ఇంకా కొన్ని మాసాలు బాధపడ్డాడు. బంధువులు మరొకసారి ఆతణ్ణి స్వామివారి దర్శనానికి నారాయణవరం తోడ్కొని పోయినారు. అప్పుడు స్వామికి దయ కలిగింది. తాము తింటున్న విస్తరినుండి కొన్ని అన్నం ముద్దలు ప్రసాదంగా ఇచ్చినారు. ఆతని పిచ్చి వెంటనే కుదిరింది.

ఈ సంఘటన తరువాత స్వామి తమ మలాన్ని ఒక లోహపాత్రలో జాగ్రత్తపరచి ఏటిలో కలిపివేసేవారు. స్వామివారు అట్లా ఎందుకు చేసేవారో ఎవరికీ తెలియదు. ఆ పాత్రను ఎవరినీ తాకనిచ్చేవారు కాదు. కొందరు దానికి స్వర్ణయోగ శక్తులున్నాయనేవారు. ఒకనాడొక పెద్దమనిషి స్వామివారి మలపాత్రను దొంగిలించ ప్రయత్నించినాడు. కాని అతని చేతులప్పటికప్పుడు పడిపోయి అడుగులు తడబడి నేలపై దబాలున కూలినాడు. చేతిలోని పాత్ర క్రింద పడింది. ఆ చప్పుడుతో అందరికీ ఆతని ఉద్దేశం తెలిసిపోయింది. చుట్టుమూగినవా రాతనికి బాగా దేహశుద్ధి చేసినారు. స్వామి రహస్యాలు కనిపెట్టాలనుకునే వారికిది గుణపాఠం ఐనది.

స్వామివారు ప్రదర్శించిన అద్భుతాలు లెక్కకు మిక్కిలి. స్థలాభావం చేత రెండుమూడు మాత్రమే మనవి చేస్తున్నాము.

1. ఒకసారి స్వామివారు మొదలియారును వేపాకులు తెమ్మన్నారు. మొదలియారు వెంట తోకె నారాయణస్వామి నాయుడు కూడ వెళ్ళినాడు. వేపచెట్లున్న చోట్లంతటా చుట్టూ దట్టమైన ముండ్లపొదలున్నాయి. ఎట్లాగో ప్రయత్నించి మొదలియారు ఒక వేపమండ పట్టుకున్నాడు. కాని ముండ్ల పొదలో కూలిపోయినాడు. దూరాన ఉన్న నారాయణస్వామి మొదలియారు చచ్చె చచ్చె అని అరిచినాడు కాని మొదలియారు మాత్రం స్వామి అనుగ్రహంతో ఒక్క ముల్లు ఐనా గీరుకోకుండా బయటపడ్డాడు.

2. ఒక మద్రాసు పెద్దమనిషి నారాయణవరం వచ్చి స్వామి సమక్షంలో పేదలకు అన్నదానం చేయించే కార్యక్రమం పెట్టుకున్నాడు. నారాయణవరం పాపయ్యచెట్టి ఇంట్లో వంటలు చేయించినాడు. ఉన్నట్లుండి చెట్టి భార్య స్పృహ కోలుపోయింది. నాడి క్షీణించింది. ఆమె చనిపోయిందని అందరన్నారు. చనిపోయిన యింట్లో అన్నం మైలపడినట్లే

కదా! అది భోజ్యయోగ్యం కాదు కనుక ఇంత డబ్బు వ్యయం చేసి వంటలు చేయించిన పెద్దమనిషికి ఏమీ తోచక బిక్కపోయినాడు. స్వామివారు వంటకాలు తెచ్చి వడ్డన ప్రారంభించవలసిందిగా ఆదేశించినారు. అక్కడున్నవారు నారయణచెట్టి భార్య చనిపోయిందన్నారు. స్వామివారు "ఆమె యింకా చావలేదు పోయి చూడండి" అన్నారు. ఇంతలో ఆ చచ్చిపోయిందనుకున్న చెట్టిభార్య స్పృహలోకి వచ్చి "పేదలకోసం వండిన వంటకాలు త్వరగా ఇక్కడినుండి తరలించండి. అరగంట కంటె ఎక్కువ బ్రతుకను" అన్నది. అందరూ ఆ వింత గమనించి ఆశ్చర్యపోయినారు. వంటకాలు ఆమె యింటినుండి స్వామివారి యింటికి తరలించగానే ఆమె కన్ను మూసింది.

3. ఒకనాడు స్వామివారు 'మా నాయన అమ్మ వచ్చినా'రంటూ మొదలియారును, పురుషోత్తమ నాయుడును వెంటబెట్టుకొని ఒక ఎత్తైన కొండ వద్దకు తీసుకపోయినారు. అక్కడ ఎవరూ లేరు. కొలది నిముషాలకు ఒక దీర్ఘశరీరుడు అల్లంత దూరంలో కొండశిఖరాన కనపడ్డాడు. స్వామి గట్టిగా పిలిచినా ఆయన వినిపించుకోలేదు. ముగ్గురూ కలిసి బిగ్గరగా పిలిస్తే ఆయన శిఖరం నుండి మెల్లగా అడుగులు వేస్తూ దిగనారంభించినాడు. స్వామివారు సంతోషంతో ఉప్పొంగుతున్నారు. ఆయన స్వామివారి చెంతకు వచ్చినాడు. స్వామి ఆయనకు మద్రాసులో తాము చూచిన విశేషాలు చెప్పి ఒక నారింజపండు అందించినారు. ఆయన వెనుదిరిగి పోతూ హఠాత్తుగా అదృశ్యుడైనాడు. ఇట్లా స్వామివారి తండ్రి రావటమూ పోవటమూ జరిగింది. కాని తల్లి మాత్రం రాలేదు. స్వామివారు మరికొంతసేపు కాచుకొని ఉన్నారు. ఇంతలో ఒక వృద్ధురాలు కొండపైన గోచరించింది. ముగ్గురు కలిసి బిగ్గరగా ఎంత పిలిచినా 'మీతో నాకేమిపని?' అంటూ ఆమె రానేలేదు. "మీకొక దండం నా మానాన నన్ను విడిచిపెట్టండి" అంటూ ఆమె దారిన ఆమె వెళ్ళిపోయింది. ఆమె కూడ ఆశ్చర్యకరంగా తిరోహితురాలైంది. ఆమె దాక్కోవటానికి అక్కడ చెట్లు గాని పొదలుగాని ఏమీ లేవు. స్వామివారు "చాలా బాగుంది" అంటూ ఆశ్చర్యం ప్రకటించినారు. ముగ్గురు కలిసి నారాయణవరం తిరిగి వచ్చినారు. స్వామివారి మహత్వం గూర్చిన విశ్వాసం వారిలో మరింత బలపడింది.

# 4. స్వామివారి సర్వజ్ఞత్వము-భవిష్యవాణి

ఇంతవరకు పేర్కొన్న అద్భుతాలే కాక నారాయణవరం సొరకాయల స్వాములవారు తమ సర్వజ్ఞత్వంచేత భవిష్యవాణి చెప్పటంచేత ఇతరుల మనస్సులోని సంగతులు గ్రహించి చెప్పటంచేత ప్రదర్శించిన మహిమలు కూడ లెక్కకు మిక్కిలి ఉన్నవి. అట్లా చెప్పటంలో స్వామికి కించిత్తైనా స్వార్థం లేదు. ఇది ఆయన తమ భుక్తికోసం పెట్టుకున్న వృత్తి కాదు. మానవాళికి సుఖసంతోషాలు పంచటమే వారి పవిత్రధ్యేయం. కష్టాల్లో ఉన్నవారిని ఆదుకోవటం బాధితులకు దుఃఖోపశమనం కలిగించటం వారి పని. వారు పాంచభౌతిక సుఖాలు ఆశించలేదు. నాగరికుల ధనాడంబరానికి గాని అధికారుల దర్పానికి గాని వారు వశులు కాలేదు. ఆయన నిగ్రహానుగ్రహాలు కోటీశ్వరుని మొదలు కూటిపేదవరకు అందరికీ సమానంగానే లభించినవి. స్వామివారు చేతనైన సహాయం అందరికీ చేసినారు. పాపులూ, ప్రారబ్ధం బలీయమైనవారు, అవశ్యంగా కర్మఫలం అనుభవించవలసినవారు తారసపడితే బుద్ధి గరపి వెళ్ళగొట్టేవారు. ఇట్టి విశిష్టగుణాల మూలంగా స్వామివారు మోసంగురువుల కంటె, కుహనా సన్న్యాసులకంటె, మెట్ట వేదాంతులకంటె భిన్నులనీ నిజమైన యోగిరాజనీ నిర్లిప్తులనీ తెలుస్తుంది. ఆయన ప్రాచీన ఋషులతోను మధ్యకాలీన ఆచార్య పురుషులతోను దీటైనవారు. వారి నావరించిన ప్రభామండలం వారి నిగూఢ అప్రమేయశక్తులకు తార్కాణం. ఈ ప్రకరణంలో వారి సర్వజ్ఞత్వాన్ని చాటే కొన్ని మానవాతీతశక్తుల వృత్తాంతం తెలుసుకుందాము.

పుత్తూరు సమీపాన తాయిమాంబాపురం అనే ఇనాం గ్రామమున్నది. యజ్ఞరామశర్మ ఇనాందారు గొప్ప పౌరాణికుడు, పండితుడు. ఆయన అవ్వ స్వామివారి భక్తురాలు. స్వామి అప్పుడప్పుడు భిక్షకు పోతే ఆయవ్వ స్వామివారిని పూజించేది. ఆమె భక్తికి మెచ్చి స్వామివారు ఆమెకు ఒక కాలణా (కాణీ) బిళ్ళనిచ్చి "దీనిని జాగ్రత్తగా దాచుకో! పగటిపూట మాత్రమే దీనిని వాడుకో! రాత్రిపూట ఉపయోగించకు, జాగ్రత్త!" అంటూ హెచ్చరించినారు. ఆ యవ్వ ఆ కాణీని ఎత్తైన దిగూడులో భద్రపరచి పగటిపూట అవసరమైనపుడు చిల్లర సామాను, పండ్లు పూలు కొనటానికి వ్యయం చేసేది. వెంటనే ఆ దిగూడులో మరొక కాణీ ఊరేది. ఆ కాలణా ఆమె పాలిటి అక్షయనిధిగా మారింది. ప్రతిదినం ఎన్నిసార్లు వాడినా అక్కడ మరొక కాణి ఊరుతూనే ఉండేది. ఇట్లుండగా కొంతకాలం తరువాత

ఆ యింటి బాలుడు రాత్రిపూట ఆ కాణి తీసి ఏదో కొన్నాడు. అంతే. మరల ఆ గూటిలో కాణి ఊరలేదు. ఆ యవ్వ కుఱ్ఱవాడు చేసిన పాడు పనికి చాలా వగచింది. స్వామివారు కొన్ని దినాల తరువాత భిక్షకోసం వస్తే ఆమె జరిగిన పొరపాటు స్వామికి నివేదించింది. స్వామి "కాలణా వెళ్ళిపోయిందా? అయ్యో! ఏమి చేస్తాం?" అన్నారు.

ఒకనాడు స్వామివారు శిష్యుడు చెంగల్వరాయ మొదలియారు వెంట రాగా కీలగరం గ్రామంలో భిక్షాటన చేస్తూ ఒక యింటిముందు నిలబడి "కామాక్షీ! కామాక్షీ!" అని పిలిచినారు. ఎవ్వరూ పలుకలేదు. లోపల ఎవ్వరూ లేనట్లున్నారు. అరవటం వృధా అని మొదలియారంటే స్వామివారు చిరునవ్వుతో నువ్వూరుకుండుమని మందలించినారు. "మంగై! మంగై" అని మరల పిలిచినారు. ఒక చింపిరిజుట్టామె బయటకి వచ్చి స్వామివారిని మొండివాడనీ అందరినీ పీడిస్తాడనీ దుర్భాషలాడింది. ఆమె తిట్లను లెక్క పెట్టకుండా స్వామివారు అన్నం పెట్టుమన్నారు. ఆమె పెట్టనన్నది. స్వామివారామెను కూరైనా పెట్టుమని బతిమాలితే కూర లేదు గీర లేదన్నది. నవ్వుతూ స్వామివారు "మంచి కూర వండి ఫలానా మూలకు ఫలానా చోట దాచినావు. లేదంటున్నావు. ఎందుకు అబద్ధం ఆడుతావు?" అన్నారు. ఆమె కూర ఎక్కడ దాచిపెట్టిందో కచ్చితంగా చెప్పిన స్వామివారి అద్భుతశక్తికి చకితురాలై వారి పాదాలపై బడినది. కూర తెచ్చి పెట్టినది. స్వామి వర్ణించిన ఆ సత్యకథనానికి అక్కడున్న మొదలియారు తదితరులు ఆశ్చర్యపడ్డారు.

ఒకసారి నారాయణవరంలో కోమటి పాపయ్యచెట్టి స్వామివారికి ఒక మినపరొట్టె ఇచ్చినాడు. స్వామి "ఏం పిసినిగొట్టువయ్యా! ఇంట్లో 18 రొట్టెలు పెట్టుకొని ఒక్కటిస్తావా?" అన్నారు. ఇంట్లో ఎన్ని రొట్టెలున్నాయో చెట్టికి తెలియదు. అతడు లోపలికి పోయి లెక్కిస్తే స్వామి చెప్పినట్లే సరిగ్గా 18 రొట్టెలున్నవి.

ఒకనాడు స్వామివారు చాలా వ్యాకులపడుతూ ఒక నిరుపేద ఆకలితో మాడిపోతున్నాడనీ ఏమైనా తినిపించివద్దామంటూ తమ శిష్యుడు మొదలియారును తొందర పెట్టినారు. అది మధ్యాహ్నం 12గంటల ఎండవేళ. ఐనా స్వామి తమ పట్టు విడువలేదు. చేసేదేమీ లేనందున మొదలియారు స్వామి వెంట బయలుదేరినాడు. స్వామివారొక మాలవాడ చొచ్చి తమ వద్దనున్న ఆహారం ఒక కుక్కకు పెట్టినారు. అడిగితే ఆమె పూర్వజన్మలో దయగల మహిళ అనీ తమకు పండ్లు కూరలు ఇచ్చిందనీ, దుష్కర్మ మూలంగా అట్లా పుట్టిందనీ అన్నారు. స్వామి దానిపై సానుభూతి వర్షించి నారాయణవరం తిరిగిపోయినారు. భూతభవిష్యత్కాలవార్ధుల సంధిలో స్వామి నిల్చినట్లుందీ సంఘటన. ఇది వారి అతిలోక శక్తికి తార్కాణం.

ఒకనాడు రాత్రి 11 గంటలప్పుడు తమ పడకనుండి లేచి స్వామివారు ఏడుస్తూ బిగ్గరగా "అయ్యో! వాడు చచ్చిపోయెనే! ఎంత దుర్మార్గుడు! ఉరి పోసుకొని ప్రాణాలు తీసుకున్నాడు" అన్నారు. మరునాడుదయం మొదలియారు విచారిస్తే ఒకడు కడుపునొప్పి భరించలేక వేపచెట్టుకు ఉరి పోసుకుని కడచిన రాత్రి చనిపోయినాడని తెలిసింది. ఇంకొకనాడు మొదలియారుతో కలిసి నదిలో స్నానం చేస్తూ హఠాత్తుగా నిట్టూరుస్తూ "నా చెలికాడు పాయెనే! ఏం చేసేది ?" అంటూ చేతులు పిసుక్కున్నారు. స్వామి అట్లా ఎందుకు చేస్తున్నారో మొదలియారుకు అర్థం కాలేదు. తరువాత తెలిసింది. స్వామి ఆ విధంగా సంతాపించిన సమయాన్నే నారాయణవరానికి 70 మైళ్ళ దూరాన చట్టి పరదేశి అనే మహాత్ముడు (తోభాస్వామి శిష్యులు) దేహం చాలించినట్లు తెలిసింది.

నారాయణవరంలో సొరకాయల స్వామి నివాసానికి ఎదురింటి యజమాని నరసయ్యరు, స్వామిభక్తులు శిష్యులు చేసే ఆర్భాటపు చేతలన్నీ బూటకంగా భావించేవాడు. ఆయన వాళ్ళను వెక్కిరించేవాడు; వేళాకోళం చేసేవాడు. వాళ్ళంతా అపహాస్యభాజనులని అతని నమ్మకం. నరసయ్యరు తానేమి చేసినా పరాయివారికే కాదు కట్టుకున్న భార్యకు కూడా తెలియనిచ్చేవాడు కాదు. పొరుగూరిలో భూములు కొనవలె ననుకున్నాడు. అందుకోసం ఒకనాడు ఎవరి కంటబడకుండా ప్రొద్దున్నే పోయి పొరుగూరి ముగ్గురు క్రయందార్లతో బేరం చేసి రావటానికి ఏర్పాటు చేసుకున్నాడు. ఈ విషయం మూడవ కంటికి తెలియదు. నరసయ్యరు బయలుదేరటానికి బండి ఎక్కుతుండగా ఎదురింటి అరుగుపైన ఉన్న స్వామివారు అయ్యరును పిల్చినారు. తాను అసహ్యించుకునే సన్న్యాసి కార్యార్థియై పోయే తనను ఇట్లా పిలవటం అపశకున మనుకున్నాడు. ఇష్టం లేకున్నా స్వామి చెంతకు పోయి ఎందుకు పిల్చినారని అడిగినాడు. నరసయ్యరుకు జ్ఞానోదయం కలిగించే ఉద్దేశంతో స్వామి మందహాసంతో "అయ్యా! ఈనాడు పోవద్దు. భూములు కొనే నిమిత్తమై నీవు కలుసుకోగోరే ముగ్గురు వ్యక్తులు వేరువేరు చోట్లలో ఉన్నారు. కనుక నీ కార్యం నెరవేరదు" అన్నారు. స్వామివారిని, వారి భక్తులను అవహేళన చేసే అయ్యరు ఈ మాటలు వినగానే పాతాళానికి క్రుంగిపోయినాడు. ఇంత కాలం తన బుద్ధి గడ్డి తిన్నందుకు నొచ్చుకొని ప్రయాణం మానుకున్నాడు. రెండు దినాలు తాళి మూడవనాడు తానైపోయి స్వామివారికి సాష్టాంగపడి అనుమతి వేడితే స్వామి "ఈనాడు పో ! ఆ ముగ్గురూ ఊళ్ళోనే ఉన్నారు, నీ కార్యం నెరవేరుతుంది" అన్నారు. నరసయ్యరు ప్రయాణమై పోయినాడు. అంతా స్వామివారు చెప్పినట్లే సవ్యంగా జరిగింది. నరసయ్యరుకు బుద్ధి వచ్చింది. గర్వం అణగింది. చెంగల్వరాయ మొదలియారును మిగతా వారిని క్షమాపణ వేడుకున్నాడు. అటు తరువాత ఒకనాడు స్వామిని స్వామిభక్తులను

మేళతాళాలతో ఊరేగింపుగా తన యింటికి తీసుకపోయి విందులు చేసినాడు. మరల ఊరేగింపుగా తోడ్కొని వచ్చి చందన తాంబూలాదులతో అత్తరు పన్నీరులతో సత్కరించి వారి విడిదిలో దించిపోయి అప్పుడు తాను తిన్నాడు.

ఈ సంఘటన తరువాత కొలది దినాలకు నరసయ్యరు ఒక బావి త్రవ్వించ దలచి స్వామివారి అనుమతి పొందినాడు. గంగమ్మ తల్లి తృప్తికోసం మేకను బలి ఇవ్వాలని జనులన్నారు. కాని స్వామి వలదన్నారు. కూలివాళ్ళు పట్టుపట్టటం చేత మేకకు బదులుగా నరసయ్యరు వాళ్ళకు రెండు రూపాయలిచ్చినాడు. కూలీలు ఆ రెండు రూకలతో మేకను కొని తెచ్చి నరసయ్యరు ఇంటిముందే కట్టివేసినారు. అయ్యరు ఇది గమనించలేదో గమనించికూడ కనుమొరగినాడో కాని కూలివాళ్ళు తాము అనుకున్నంత పని చేసి బావి త్రవ్వినారు. ఫలితంగా ఉప్పునీరు పడింది. ఇంత కష్టపడినందుకు ఫలితం దక్కలేదు. నరసయ్యరుకు ఖేదం కలిగింది. స్వామివారియందు పరిపూర్ణవిశ్వాసంతో నరసయ్యరు తన దురదృష్టపు గోడు వినిపించినాడు. స్వామి మందహాసంతో "పట్టుబట్టి మూగజంతువును చంపినందుకు ఇట్లా ఐనది. పశ్చాత్తాప పడుతున్నావు కనుక ఇప్పుడున్న నీరంతా తోడివేయండి. తరువాత మంచినీటి ఊట పడుతుంది" అన్నారు. స్వామివారన్నట్లే జరిగింది.

ఒకసారి చెంగల్వరాయ మొదలియారు మద్రాసులో స్వామివారికొకటి తనకొకటి రెండు శాలువలు కొని ఆనాడే నారాయణవరం చేరినాడు. ఆనాడు శనివారం మంచిదినం కాదని స్వామివారికి శాలువా సమర్పించకుండా తన సంచిలోనే దాచినాడు. స్వామికీసంగతి తెలిసే వీలులేదు. నాటి సాయంకాలమే స్వామివారు మొదలియారును పొరుగూరికి బయలుదేర దీసినారు. ఆ వూరి మైదానంలో రాత్రంతా గడుపుదామన్నారు. స్వామివారికి నమ్మినబంటు కనుక మొదలియారు స్వామి ఆజ్ఞను అక్షరాలా పాటించినాడు. అది మంచు కురిసే కాలం, విపరీతమైన చలి. రాత్రి 9 గంటలప్పుడు స్వామివారు మొదలియారుతో "నల్లస్వామీ ! చలి దుర్భరంగా ఉంది. మద్రాసునుండి తెచ్చిన రెండు శాలువలేమైనాయి ? శనివారం పనికిరాదను కుంటున్నావా? పరవాలేదు తే" అన్నారు. అమితాశ్చర్యంతో మొదలియారు రెండు శాలువలు స్వామివారికే ఇచ్చినాడు. ఆ రాత్రి చలికి తాను గడ్డకట్టుకపోతా ననుకున్నాడు. అతని మనసెరిగిన స్వామి 'నీవు పడుకో' అన్నారు. మొదలియారు అట్లాగే పడుకున్నాడు. ఐతే మరునాడుదయందాకా గాఢనిద్రలో మునిగిపోయినాడు. అంత భయంకరమైన చలి అతణ్ణి ఏమీ చేయలేదు. తెల్లవారి చూస్తే మైదానంలోని గడ్డి పొదలు చెట్లు మంచు బిందువులతో వర్లశబలితమైపోయి తళతళ

మెరుస్తున్నాయి. తనను మాత్రం మంచుతో తడువకుండా ఉంచినది స్వామివారి నెనరు వెచ్చదనమే అని ఆ భక్తుడు గుర్తించినాడు.

పెరంబూరు రైల్వే ఆఫీసులో పనిచేసే రామయ్యరు అనే గుమాస్తా స్వామివారి మహిమలు ఆధ్యాత్మికశక్తులు విని వారిని దర్శించటానికై నారాయణవరం వెళ్ళినాడు. కాని స్వామివా రానాడు అక్కడ లేరు. రామయ్యరు చాలాసేపు కాచుకొని ఉండి దుర్గిగుడి గురించి, ఆ దేవి మహిమల గురించి విని, ఆ దేవినైనా కొలిచి వద్దామనుకున్నాడు. ఎంత వేచియున్నా స్వామివారు రానందున దుర్గిగుడికే బయలుదేరినాడు. మార్గమధ్యంలో నదివద్ద స్వామివారు ఎదురైనారు. రామయ్యరు స్వామివారికి సాష్టాంగప్రణామం చేసి తన అభీష్టం నెరవేరినందుకు సంతోషించినాడు. స్వామివారు "దుర్గిగుడికి పోతున్నావు గదా! అబ్బాయీ! త్వరగా వెళ్ళు" అన్నారు. మొదటి దర్శనంలోనే స్వామి సర్వజ్ఞత్వం రామయ్యరుకు అవగతమైనది. ఆయన దుర్గిగుడికి పోయి సేవించి రెండు దినాల తరువాత నారాయణవరం తిరిగి వచ్చినాడు. మద్రాసుకు తిరిగి పోవటానికి స్వామివారిని సెలవడిగితే "పో! తొందరగా తిరిగిరా" అన్నారు. రామయ్యరు స్టేషనుదాకా పోయి రైలు ఎత్తిపోయినందున స్వామి అన్నట్లే నారాయణవరం తిరిగివచ్చినాడు.

చెంగల్వరాయ మొదలియారు భార్య చనిపోయింది. ఆతని సన్నిహిత బంధువులు పునర్వివాహం కోసం ఒత్తిడి చేస్తే ఆతడు నిరాకరించినాడు. కాని ఆతని పిన్నమ్మ కూతురు మరికొందరు సమీపబంధువులు స్వామిద్వారా చెప్పించే ఉద్దేశంతో నారాయణవరం వెళ్ళినారు. వాళ్ళు స్వామివారికి సాష్టాంగపడి లేవగానే స్వామివారు "ఇష్టం లేకున్నా వాడొక ఆడమేకను కొన్నాడు. అది నాలుగు పిల్లలు ఈనింది. పిల్లలూ తల్లీ చనిపోయినాయి. వాణ్ణి మరల ఎందుకు బాధ పెడుతారు?" అన్నారు. ఆ వచ్చినవాళ్ళను స్వామివారు చూడటం ఇదే ప్రథమం. వాళ్ళెవరో ఎందుకు వచ్చినారో ఇంకా చెప్పనే లేదు. వాస్తవమేమంటే మొదలియారు అయిష్టంగానే పెండ్లి చేసుకున్నాడు, నలుగురు సంతానం కలిగినారు. వాళ్ళంతా చనిపోయినారు. కడపటికి భార్య కూడ చనిపోయింది. స్వామివారు మొదలియారు వైవాహికజీవితం గురించి వాస్తవాలు భంగ్యంతరంగా చెప్పినందుకు ఆగంతుకులు దిగ్భ్రాంతితో అవాక్కైపోయినారు. వాళ్ళు నారాయణవరం రాకపూర్వమే స్వామివారు తమ చుట్టున్నవారితో ఎవరో వస్తున్నారనీ మిఠాయిలు తెస్తున్నారనీ చెప్పినారట. వాళ్ళే వీళ్ళు.

సొరకాయల స్వామివారు చేసిన అద్భుతాలు, చెప్పిన భవిష్యత్తులు లెక్కకు మిక్కిలి. అవి ఎటువంటి అవిశ్వాసినైనా నాస్తికునైనా నమ్మించగలవు. గాలివాటం సూచించే గడ్డి పరకలవలె అవి వారి దైవీసంపదను సర్వజ్ఞత్వాన్ని చాటుతాయి.

ఒకనాడు ఉన్నట్లుండి స్వామివారు కెంపరంపాక్కం చేరుకున్నారు. వారు ఒక గుడిసె ముందునుండి దాటిపోతుండగా వాకిలి చెంత ఉన్న కుక్క ఊరక మొరగసాగింది. స్వామి దానివైపు అదొకతీరుగా చూచినారు. కాసేపటికి "చుష్! మొరుగకు, నీ దినాలు మూడినాయి" అన్నారు. స్వామివారి చూపుల్లోను కంఠస్వరంలోను ఒక ప్రత్యేకతను చుట్టున్నవాళ్ళు గుర్తించి నారు. పక్షం దినాలలో ఆ కుక్క హఠాత్తుగా చనిపోయింది. ఆ సమీపంలోనే కూర్చుండి లోకాభిరామాయణం చెప్పుకుంటున్న ఒక యువతి ఆమె తల్లి ఉన్నవైపు స్వామి తిరిగినారు. వాళ్ళు వెంటనే తమ మాటలు చాలించి స్వామివైపు దీనంగా ప్రార్థనాపూర్వకంగా చూచినారు. స్వామి తన నాల్గు వ్రేళ్ళు చూపి వెక్కి వెక్కి ఏడ్చినారు. నాల్గవనాడే ఆ తల్లి చనిపోయింది. స్వామి మాటల్లో స్వామి సైగల్లో వారి సర్వజ్ఞత్వం ప్రకటితమైనా అది గుర్తించలేరు జీవులు.

మద్రాసులో మంచి శ్రీమంతుడు ప్రభుత్వోద్యోగి ఐన అరవముదు నాయుడుండేవాడు. అతడు ధనికుడు కావటం చేత సుఖజీవనానికి అలవాటు పడ్డవాడు. స్వామివారి మహిమలు చాలా విన్నవాడు కనుక 1883లో తనను స్వామి చెంతకు తీసుకపోవలసిందిగా చెంగల్వరాయ మొదలియారును కోరినాడు. పల్లెటూరి ప్రయాణాలు అక్కడి అసౌకర్యాలు తెలియని నాయుడును మొదలియారు తీసుకపోక తప్పిందికాదు. కొలది గంటల్లోనే వారు నారాయణవరం చేరినారు గాని స్వామివారు అక్కడ లేరు. స్వామి దర్శనంకోసం ఒకటి తరువాత మరొకటి చుట్టుపట్ల గ్రామాలన్నీ తిరిగినారు. ఎట్లాగైనా స్వామిని దర్శించవలెనని నాయుడు పట్టుదలగా ఉండినాడు. చిట్టచివరకు నిర్వాయ్ అనే కుగ్రామంలో స్వామివారిని దర్శించి ఉభయులూ సాష్టాంగపడ్డారు. భోజనాల ఏర్పాట్లు జరిగినవి. బాగా అలసిపోయినందున నాయుడు కడుపునిండా స్వామి ప్రసాదం తిన్నాడు. ఆ సమయాన కుప్పుస్వామి చెట్టియారు కూడ స్వామి సన్నిధిలో ఉన్నాడు. అతనికింకా స్వామివారి దివ్యశక్తుల్లో విశ్వాసం దృఢపడలేదు. స్వామి అతనితో పిట్టకథల రూపంలో కుతూహలజనకంగా మాట్లాడుతున్నారు. ఆ భాషణంలోని సంఘటనలన్నీ తన జీవితంలోని వాస్తవాలతో సంవదించటంతో చెట్టియారుకు స్వామివారి అతీంద్రియశక్తిలో విశ్వాసం బలపడి స్వామివారి పాదాలపై పడ్డాడు. స్వామిని తన ఆధ్యాత్మిక గురువుగా అంగీకరించినాడు. తరువాత నాయుడు, చెట్టియారు మద్రాసుకు తిరిగిపోవటానికి అనుమతి వేడితే స్వామి వద్దన్నారు. ఎట్టకేలకు చెంగల్వరాయ మొదలియారు కల్పించుకున్నందున స్వామివారు అనుమతించినారు. కాని ప్రయాణంలో చాలా కష్టపడవలసి వస్తుందనీ ఓర్చుకొని ధైర్యంగా ఉండవలసిందనీ హెచ్చరించినారు. అన్నట్లే దారిలో వారు

భయులూ అనేక కష్టనష్టాలకు లోనైనారు. ఇది స్వామి తమకు పెట్టిన పరీక్ష అనుకొని ధైర్యంగా సాగిపోయినారు. అప్పటినుండి వారికి స్వామియందలి విశ్వాసం ద్విగుణీకృతం ఐనది. మరొకతూరి నాయుడు స్వామి దర్శనానికి పోయినప్పుడు తాననుకున్నట్లే ప్రయాణం సవ్యంగా జరిగింది. జీవితాంతం అతడు స్వామిభక్తుడుగా ఉండిపోయినాడు.

ఒకసారి చెంగల్వరాయ మొదలియారు, తోకె నారాయణస్వామి నాయుడు ఇద్దరూ కలిసి స్వామివారిని దర్శించటానికి కుప్పం గ్రామానికి పోయినారు. అక్కడ వారు వంటప్రయత్నం ప్రారంభించినారు. ఐతే అన్నం వండటానికి ఎక్కడా కనీసం మట్టిపాత్రైనా చిక్కలేదు. వారి పరిస్థితి గమనించి స్వామివారు "ఆ ప్రక్కనున్న గుడిసెలో అడగండి. ఆమె మీరే చూచుకోండి అంటుంది. అటుక మీద ఒక పాత్ర ఉన్న సంగతి ఆమెకే తెలియదు. మీకు లభిస్తుంది తెచ్చుకోండి" అన్నారు. వాళ్ళు పోయి వంటపాత్ర అడిగితే ఆ యింటి ముసలావిడ "ఈ గ్రామంలో ఉన్నవే ఆరు కొంపలు. నాది తప్ప మిగతావి ఇటీవలే అగ్గిపాలైనాయి. మాకు తినటానికే తిండిలేదు. పాత్రలెక్కడివి నాయనా ?" అన్నది. వాళ్లు మరల మరల ప్రాధేయపడితే ఆమె 'మీరే లోపలికి పోయి చూచుకోండి. ఉంటే తీసుకోండి' అన్నది. వాళ్ళు అటకపై వెదికితే ఒక పాత్ర లభించింది. స్వామివారి దివ్యదృష్టికి వాళ్ళు అబ్బురపడ్డారు. ఇక ఆ వృద్ధురాలి ఆశ్చర్యానికి అవధులే లేవు.

సొరకాయల స్వామివారికి సన్నిహిత సేవకుడైన చెంగల్వరాయ మొదలియారు స్వగ్రామం ఇలయనర్ వేలూరు. అతని స్నేహితులు తణికాచల మొదలియారు, వినాయక ఉడయరు స్థానిక సుబ్రహ్మణ్యస్వామి ఉత్సవాలకు రథం చేయించవలెనని ఆశించినారు. తమ కోరిక ఎప్పుడు ఫలిస్తుందో కనీసం ఒక్క రథోత్సవమైనా దర్శించేదాకా బ్రతుకగలమో లేదో సొరకాయల స్వామివారి నడిగి తెలుసుకోవలసిందని చెంగల్వరాయ మొదలియారును కోరినారు. స్వగ్రామానికీ తన స్నేహితులకూ సంబంధించిన సత్కార్యం కనుక స్వామివారినడిగి తెలుసుకోవాలెనని అతనికీ కుతూహలంగా ఉన్నా వీలు పడలేదు. అటు తరువాత మరచి పోయినాడు. ఇట్లా కొంతకాలం గడిచింది. చాలా దినాల తరువాత మొదలియారు స్వామి సన్నిధికి పోయినాడు. అప్పుడు స్వామివారే మొదలియారును చూడటంతోనే "నల్లస్వామీ! రథం వీథుల్లో త్రిప్పి నిలువ నీడలేని చోట నిలిపినారే!" అన్నారు. ఆ మాటలు వింటూనే మొదలియారుకు తన మిత్రులడిగిన రథం విషయం గుర్తుకొచ్చింది. ఈలోగా తణికాచల మొదలియారు, వినాయక ఉడయరు ప్రక్కఊరి వడ్రంగి శిల్పిని పట్టుకున్నారు. అతడు

ప్రతిఫలాపేక్ష లేకుండా రాత్రింబవళ్ళు కష్టించి రథం సిద్ధం చేసి యిచ్చినాడు. ఆనాటినుండి ఈ రథోత్సవం జరుగుతూనే ఉన్నది. ఐతే రథం నిలపటానికి మాత్రం చోటు లేక వీథిలోనే పడి ఉంటుంది. స్వామివారి కాలజ్ఞానం ఫలించింది.

నారాయణవరంలోని కల్యాణ వేంకటేశ్వర స్వామివారి రథం చక్కబరచటానికి కొయ్య కావలసి వచ్చింది. నారాయణవరం అడవుల్లో అంత పెద్ద చెక్కలు వెళ్ళే చెట్లు ఎక్కడా కానరాలేదు. వెదకి వెదకి వేసారి దేవస్థానంవారు సొరకాలయస్వామితో మొరపెట్టుకున్నారు. స్వామివారు నారాయణవరం అడవిలోనే ఒక స్థలం గుర్తు చెప్పి అక్కడ పెద్ద చెట్టున్నదని అది రథం అవసరం తీరుస్తుందని చెప్పినారు. వారి ఆజ్ఞప్రకారం ఆ స్థలానికి పోతే అక్కడొక పెద్ద చెట్టు కనపడింది. ఇంతకుపూర్వం ఆ స్థలంలో వెదకినపుడు కానరాని ఆ వృక్షం ఇప్పుడు కనపడింది. దేవస్థానం అధికారులకు ఆశ్చర్యం కలిగింది. స్వామివారి ఆజ్ఞమేరకు అక్కడ అంత పెద్ద వృక్షం సిద్ధమైనదా? లేక చిన్నవృక్షం పెద్దదిగా మారిందా వారికి తెలియలేదు. ఇది అఘటనాఘటన సమర్థులైన స్వామివారి మహిమ అనుకున్నారు.

ఒకసారి సొరకాయల స్వామి కుమారకుప్పం వెళ్ళి ఒక ఖాళీ స్థలంలో కూర్చుండి, అక్కడొక దేవాలయం నిర్మిస్తారనీ నిత్యపూజలు జరుగుతాయనీ భవిష్యం చెప్పినారు. ఇప్పుడా స్థలంలో రామాలయం వెలసింది. నిత్యపూజలు, ఉత్సవాలు సక్రమంగా జరుగుతున్నవి. భవిష్యత్ కాలగర్భంలో దాగి ఉన్న సంఘటనను స్వామివారు చాలా ముందుగా చెప్పినారు. ఇది లోకాంతరాలు కాలాంతరాలు చీల్చుకొని పోయే వారి అద్భుతశక్తి.

మరొక అద్భుత సంఘటన స్వామివారి సర్వజ్ఞత్వానికి భవిష్యవాణికి చక్కని నిదర్శనం. ఒక పోలీసు ఆఫీసరుకు రావలసిన ప్రమోషన్ చాలా కాలందాకా రాలేదు. ఆతడు సదాచార పరాయణుడైన నైష్ఠికబ్రాహ్మణుడు. తనకు జరుగుతున్న అన్యాయానికి కుమిలిపోయినాడు. సొరకాయలస్వాములవారి మహిమలు విని వారి అనుగ్రహం సంపాదించుకుందామనే ఆశతో నారాయణవరం వెళ్ళినాడు. స్వామివారి పాదములపై బడి ఆశీస్సు లభ్యర్థించినాడు. స్వామివారు "ఈ బ్రాహ్మణుని అంగడికి తీసుకపోండి. అక్కడొక బలిసిన పొట్టేలును కోసి పోగులు వేసి పంచుకోబోతున్నారు. అందులోనుండి ఈ పెద్దమనిషికి పెద్ద కుప్ప ఇప్పించండి" అన్నారు. స్వామివారి మాటల వాచ్యార్థం మాత్రమే గ్రహించిన నైష్ఠిక బ్రాహ్మణునికి జుగుప్స కలిగింది. స్వామివారు పిచ్చివాడో లేక బూటకపు వేషధారో అనుకుంటూ

నిరాశతో స్వస్థలానికి తిరిగి పోయినాడు. కొలది దినాలలోనే పెద్ద ఉద్యోగపు ఖాళీ ఏర్పడింది. తలవని తలంపుగా ఈతనికే అది లభించింది. ఆ పదవి ఇతనికిస్తారని ఎవ్వరూ అనుకోలేదు. ఈతడు కూడ అనుకోలేదు. ఆకాశం నుండి అదృష్టం ఊడి ఒడిలో పడ్డట్టుగా ఈతనికి దక్కింది. అప్పుడా అయ్యరు స్వామివారు చెప్పిన బలిసిన పొట్టేలు అర్థం గ్రహించినాడు. పూలు, పండ్లు తీసికొని పోయి స్వామివారి కర్పించి భక్తితో సేవించినాడు. మరల రానని వెళ్ళిపోయిన అయ్యరు వచ్చి తనకు లభించిన ప్రమోషన్ సంగతి వినిపిస్తే అచ్చటివారందరు స్వామివారి మహిమకు ఆశ్చర్యానందాలలో తేలియాడినారు.

# 5. స్వామివారి దివ్యత్వము

గతానుగతికంగా లోకయాత్ర సాగించేవారందరు పాంచభౌతిక సుఖాలకోసం అఱ్ఱులు చాస్తూ వాటి సముపార్జనం కోసమే తమ శక్తినంతా ధారపోస్తారు. తాము ఎక్కడినుండి వచ్చినారో ఎందుకు వచ్చినారో ఎక్కడికి పోతారో ఏమి చేయవలెనో తెలియకుండానే జీవితాలు వ్యర్థం చేసుకుంటారు. కోటికొకరు మాత్రమే ఆత్మాన్వేషణకు ప్రయత్నిస్తారు, తాము తరిస్తారు; తోడివారిని తరింపజేస్తారు. అట్టివారే సత్పురుషులు. ఆ సత్పురుషుల్లో సారకాయల స్వామివారు అగ్రశ్రేణికి చెందిన దివ్యాత్ములు. వారు స్వయంగా భగవత్స్వరూపులై యుండికూడ తమ తోడి మానవుల దుఃఖాలను దూరం చేయటంలో నిరంతరం కార్యశీలురై ఉండేవారు. రాబోయే కష్టాలగురించి ముందుగానే హెచ్చరించేవారు. వారి భాష గణయతి ప్రాసలు లేని కవిత్వం వలె ఉండేది. ఊపిరులూదే భావాలు జ్వలంతమైన శబ్దాలు వారి భాషా విశిష్టత. సమయోచితంగా కడుపుబ్బ నవ్వేవారు. రాళ్ళు కరిగేటట్లు ఏడ్చేవారు. మోమోటం లేకుండా సత్యమే పలికేవారు. వారినోట ఎన్నడూ అసత్యవాక్కు వెలువడలేదు. వారు చెప్పిన భవిష్యవాణి ఎన్నడూ పొల్లు పోలేదు. అనవసరంగా ఎవరి మనస్సులూ వారు నొప్పించి యెరుగరు.

అరవముదు నాయుడు ఎగ్మూరులోని తన భూమిని కొంత దక్షిణ రైల్వే కంపెనీవారికి అమ్మవలసి వచ్చింది. ప్రతిఫలంగా కంపెనీవారెంత డబ్బు ఇస్తారో అనే చింత పట్టుకుంది. చింతావ్యాకుల మనస్కుడైన నాయుడు ఒకనాడు స్వామివారి ముందు కూర్చున్నాడు. ఆయన ఊహలన్నీ అటువైపే ప్రసరిస్తున్నాయి. ఏమీ పట్టనట్లు స్వామివారు నాయుడు చేతిలో ఎనిమిది (వరహాలు) పణములు పెట్టినారు. దీని భావమేమిటో అర్థం కాక నాయుడు చెంగల్వరాయ మొదలియారును అడిగినాడు. స్వామితో ఎప్పుడూ ఉండటం చేత స్వామి మాటలకు చేతలకు భాష్యాలు చెప్పే నేర్పరి ఐనాడు మొదలియారు. కంపెనీవారు రూ.8000/- ఇస్తారన్నాడు. అన్నట్లుగానే దక్షిణ రైల్వే కంపెనీవారు భూమికిగాను నాయుడుకు కచ్చితంగా 8000/- రూ. ఇచ్చినారు. ఎంత ఆశ్చర్యం!

మరొకపుడు ఎస్.రత్నసభాపతి పిళ్ళే తల్లి నంద్యాలకు పోతూ స్వామివారిని దర్శించటం కోసం నారాయణవరం చేరింది. ఆ సమయాన పిళ్ళే నంద్యాలలో ఇంజనీరుగా ఉన్నాడు. ఆమెను కొడుకు వద్దకు పోవటానికి అనుమతించి స్వామివారు కన్నీరు కారుస్తూ

"అయ్యో! పాపం ఎక్కడ పుట్టినావో! ఎక్కడ పెరిగినావో! ఎక్కడికి పోతున్నావో!" అన్నారు. అప్పుడా మాటలకు అర్థం బోధపడలేదు. కాని ఆ యమ్మ నంద్యాలలోనే తనువు చాలించింది.

సొరకాయల స్వామివారు ఒకసారి నారాయణవరం సమీప గ్రామంలోని ఒక యింటి వాకిట్లో కూర్చుండి ఆకస్మికంగా ఏడ్వటం ప్రారంభించినారు. స్వామివారు గట్టిగా చేతులు పిసుక్కుంటూ పండ్లు నములుతుంటే ఇరుగుపొరుగు అమ్మలక్కలు దారినపోయే దానయ్యలు అక్కడ గుమిగూడినారు. సంధ్యవేళ ఈ పిచ్చి బిచ్చగాడు దుందుడుకుగా ధార్ష్ట్యంగా తన వాకిట్లో ఏడ్వటం ఇంటి యజమానురాలికి కోపకారణమైనది. ఆమె వెంటనే స్వామివారిని తన వాకిటినుండి తరిమివేసింది. ఆమెకు వత్తాసుగా అక్కడ గుమిగూడినవారు ఆయన అట్లా కన్నీరు కార్చటం యింటికి మంచిది కాదన్నారు. స్వామికి నీడవలె ఉపచరించే మొదలియారు అక్కడే ఉన్నాడు. ఐతే స్వామివారు అతణ్ణి అక్కడే మరికొంతసేపు ఉండుమని తాము మాత్రం ఆ చోటు విడిచి తరలిపోయినారు. మొదలియారు స్వామి ఆజ్ఞను అక్షరాలా పాటిస్తూ అక్కడే నిల్చిపోయినాడు. కొలది నిముషాల్లో ఒక దుర్వార్త రానే వచ్చింది. ఆ యింటి యజమానురాలి తమ్ముడు సుదూర గ్రామంలో నాటి ఉదయమే పాముకాటుతో చనిపోయినాడని ఒక వార్తాహరుడు వచ్చి చెప్పినాడు. ఇంటివారు ఒక్కసారే గొల్లుమన్నారు. ఊరంతా అక్కడ చేరినారు. ఇందాకటి వింత బిచ్చగాడి శోకం మూలంగానే ఈ కీడు మూడిందని అక్కడ చేరినవారన్నారు. ఇంటావిడ స్వామివారినీ ఇంకా అక్కడే కూర్చున్న మొదలియారును అనరాని మాటలన్నది. ఐతే మొదలియారు కూడ ఆమెకు తగినట్లు బుద్ధి చెప్పినాడు. స్వామి ఏడ్పుకూ ఆమె తమ్ముని మరణానికి ఏమీ సంబంధం లేదని, పాము కరచి చనిపోయింది ఉదయం, స్వామి దాన్ని సూచించింది సాయంకాలం అని చెప్పి, అక్కడినుండి లేచిపోయి స్వామివారిని కలుసుకున్నాడు. తమకు రాబోయే దుర్వార్తను ముందుగా తెల్పినా గ్రహించలేరు అజ్ఞానులు. ఇది స్వామివారి కారుణ్యానికి దయకు తార్కాణమే గాని అన్యం కాదు.

స్వామివారు ఎంతటి దయాపూర్ణులో జీవకారుణ్యమూర్తులో ఒక చిన్న సంఘటన విశదం చేస్తుంది. నారాయణవరానికి సమీపాటవిలో ఒకనాడు స్వామివారు తిరుగుతుండగా దెబ్బ తగిలినందున కుంటుతు ఆయాసపడుతు నడుస్తున్న మేకపిల్ల కంటపడింది. స్వామివారా దృశ్యం చూడలేకపోయినారు. వెంటనే వారు దాని కాలు తోమి ఏదో మందువేసి కట్టుకట్టినారు. కాలు నొప్పి నయమయ్యేదాకా స్వామివారు దాన్ని కాపాడి మందలో చేర్చినారు.

ఒకసారి ఎన్.రత్నసభాపతి పిళ్ళే స్వామివారికి విలువైన శాలువా కానుకగా సమర్పించినాడు. అప్పుడు చెంగల్వరాయ మొదలియారు ఇంకా చాలామంది కలిసి స్వామివెంట ప్రయాణం చేస్తున్నారు. ఆ గుంపులో ఒక అపరిచిత వ్యక్తి శ్రద్ధాభక్తులున్న అమాయకునివలె నటిస్తూ నమ్మించినాడు. సమయం చూచి వాడు స్వామివారి శాలువా చేజిక్కించుకుని పారిపోయినాడు. వాడే ఆ దొంగపని చేసి ఉంటాడని మిగతావారందరు భావించినారు. వాణ్ణి పట్టి బంధించి బాగా తన్నితే శాలువా బయట పడుతుందని పోలీసువారు కూడ సమర్థించినారు. కాని స్వామివారు అంగీకరించలేదు. వాడు ఎంతటి దుర్మార్గుడైనా వాణ్ణి హింసించటం కారుణ్యమూర్తియైన స్వామివారికి ఏ మాత్రము ఇష్టం లేదు. "వాడు సూర్యుని సాక్షిగా తనకేమీ తెలియదని ప్రమాణం చేస్తే వాణ్ణి మీరేమి చేస్తారు? కనుక వాణ్ణి విడిచి వేయండి" అన్నారు. ఐతే ఆ దొంగ కొలది దినాలకు తనవారినీ తనకున్న సొమ్మునూ కోలుపోయి దుర్గతిపాలై తినటానికి తిండిలేక మరల స్వామివారి చెంతకు వచ్చి కాళ్ళపైన పడ్డాడు. చుట్టున్న భక్తులు అతణ్ణి తరిమి వేయవలసిందిగా స్వామిని ప్రార్థించినారు. కాని స్వామివారు నిండు మనసుతో వాణ్ణి క్షమించి తిండి పెట్టినారు. వాడు కోలుకునేదాక తమవద్దనే ఉంచుకొని సాకినారు. ఇదీ స్వామి దయాగుణం.

నారాయణవరానికి సమీప గ్రామంలో మంగమ్మ, ఆమె ముసలితల్లి ఉండేవారు. వాళ్ళిద్దరు స్వామివారికి అనన్యభక్తులు. తల్లి కడు వృద్ధురాలు. ఆమె చివరిగడియలు సమీపించినాయి. చనిపోయేముందు స్వామివారి చేతి తీర్థం త్రాగాలెనని ఆమె కోరిక. మృత్యువు సమీపించినందున ఆమె స్పృహ కోలుపోయింది. మంగమ్మ తన తల్లి కోరిక తీరకుండానే వెళ్ళిపోతున్నదే అని దీనంగా ఏడ్చింది. స్వామివారు ఎక్కడున్నది కూడ వాళ్ళకు తెలియదు. స్వామివారి ఆశీస్సులెట్లా లభిస్తాయి? అనుకుంటూ స్వామిని తదేకంగా ధ్యానించి ప్రార్థించినది. అంతలోనే స్వామివారక్కడికి వచ్చినారు. ఆసన్నమరణయైన వృద్ధురాలి నోట్లో తమ దివ్యహస్తాలతో తీర్థం పోసినారు. ఆమె చివరి కోరిక తీర్చినారు. అక్కడ మూగినవారందరికి స్వామివారి అంతర్యామిత్వం దయాగుణం తెలిసి వచ్చినవి. వాళ్ళు ఆశ్చర్యానంద సాగరంలో తేలియాడినారు.

సొరకాయల స్వామివారి యోగశక్తు లత్యద్భుతమైనవి. అవి వర్ణనాతీతములు. దీనులు దుఃఖార్తులు వందల సంఖ్యలో వచ్చి స్వామివారిని ఆశ్రయించి బాధోపశమనం పొంది సంతోషంతో తిరిగిపోయేవారు. మన దేశంలో స్త్రీలను దయ్యాలు భూతాలు పట్టటం గాలి సోకటం దానిమూలంగా వాళ్ళు అనేక కష్టనష్టాలకు లోనుకావటం కొన్ని సమయాల్లో

ప్రాణాలు సైతం కోలుపోవటం అధికం. అటువంటివారికి మంత్రాలు తంత్రాలు ఉచ్చాటనలు చేసి డబ్బు గడించే మాంత్రికులకు భూతవైద్యులకు కూడ మన దేశంలో కొరత లేదు. కొందరి చికిత్సావిధానం మొరటుగాను భయంకరంగాను బాధాకరంగాను ఉంటుంది. కాని నారాయణవరం స్వామివారి విధానం ఇందుకు పూర్తిగా భిన్నమైనది. వారి యోగబలం దొడ్డది. వారి దర్శనంచేత కొందరికి, స్పర్శనంచేత కొందరికి; సంభాషణంచేత మరికొందరికి దుష్టగ్రహాదిపీడలు వదలి పోయేవి. స్వామివారు ఆజ్ఞాపిస్తే బ్రహ్మరక్షస్సులు కూడ పారిపోయేవి.

ఒకనాటి సాయంకాలం 4.30 గంటలప్పుడు నారాయణవరంలో సుందరచెట్టి అరుగుపైన కూర్చుండి స్వామివారు పొగ పీలుస్తున్నారు. అప్పుడు నలుగురైదుగురు మనుష్యులు దయ్యం పట్టిన ఒక యువతిని అక్కడికి పట్టుకవచ్చినారు. ఆ సమయాన చెంగల్వరాయ మొదలియారు స్వామి సన్నిధిలోనే ఉన్నాడు. ఆమె అక్కడికి ఎందుకు వచ్చిందో అడుగుమని స్వామివారు మొదలియారును ఆదేశించినారు. స్వామి ఆజ్ఞాపిస్తే వచ్చినానని ఆమె సమాధానం చెప్పింది. స్వామి నవ్వి మరికొంత సమాచారం వివరంగా అడుగుమన్నారు. మొదలియారు వివరంగా అడిగినాడు. ఆమె ఉచ్చైస్స్వరంతో గర్జిస్తూ తన వృత్తాంతమంతా వినిపించింది. ఆ ధ్వనికి చుట్టుప్రక్కల వాళ్ళంతా అక్కడ మూగినారు. స్వామి ఆమె మాటలు ఓపికగా వింటూ హఠాత్తుగా లేచి ఆమెను విడిచి పోతాడా లేదా? అడుగుమని మొదలియారును ఆదేశించినారు. దయ్యం కాళ్ళబేరానికి వచ్చి పోతానన్నది. స్వామివారా యువతికి విభూతి ఇవ్వటంతోనే ఆమెకు స్పృహ వచ్చింది. నాటినుండి ఆమె ఆరోగ్యం చక్కబడసాగింది. అనేక సంవత్సరాలనుండి బాధ పడుతున్న ఆమె పీడ తొలగిపోయి స్వాస్థ్యం చేకూరింది.

ఒకసారి దయ్యం పట్టిన అమ్మాయిని ఆమె బంధువులు నారాయణవరం తోడుక పోయినారు. ఆమెకు నయం చేయవలసిందిగా స్వామివారిని వేడుకుందామని వాళ్ళు అక్కడ 20 దినాలున్నారు. కాని స్వామితో మాట్లాడే అవకాశం చిక్కలేదు. ఒకనాడు స్వామివారు నదిలో ఉండగా ఆ అమ్మాయి తానే అక్కడికి పోయి స్వామివారి పాదాలపైన వ్రాలింది. తనను కనికరించి దోసెడు ఆ నదీజలాలు ప్రసాదిస్తే వెళ్ళిపోతానంటూ ఆమెను పట్టుకున్న దయ్యం వేడినది. స్వామివారు కరుణించి ఆమె కోరిక తీర్చినారు. ఎంతోకాలంగా దయ్యంపీడ అనుభవిస్తున్న అమ్మాయికి ఆక్షణంనుండి ఆరోగ్యం కలిగింది.

ఒకసారి మొండిదయ్యం పట్టిన బ్రాహ్మణకన్యను నలుగురైదుగురు నారాయణవరం తోడుకవచ్చినారు. ఆ సమయాన స్వామివారు చెంగల్వరాయ మొదలియారు

ఇంకొక ముగ్గురు భక్తులతో కలిసి అక్కడి కోనేరులో స్నానం చేస్తున్నారు. ఉన్నట్లుండి ఆ అమ్మాయి నిర్లక్ష్యంగా కొలను మధ్యలోనికి నడచి మునిగిపోయింది. వెంటనే మొదలియారు ఆ పిల్లను కష్టంగా ఒడ్డు కీడ్చినాడు. ఆమె స్పృహ కోలుపోయింది. స్వామివారు స్నానం ముగించి ఒడ్డుకు రాగానే బంధువులా అమ్మాయి ప్రాణాలు కాపాడవలసిందిగా ప్రార్థించినారు. దయాసాగరులైన స్వామి ఆ కన్యకను సమీపించి ఒక చుట్టు తిరిగి "లే! నాతో రా!" అన్నారు. తత్‌క్షణమే ఆ కన్యక లేచి స్వామివెంట నడచింది. వాళ్ళందరు 6 దినాలు స్వామి సన్నిధిలో ఉండి సంతోషంతో తిరిగి పోయినారు.

మరొకసారి ఘోరమైన బ్రహ్మరక్షస్సు ఆవహించిన ఒక యువతిని స్వామివారి చెంతకు తీసుకొని వచ్చినారు. అది గమనించనట్లుగానే స్వామివారు తమ సేవకునికి అగ్నిగుండంలో కట్టెలు వేయుమని ఆజ్ఞాపించినారు. బ్రహ్మరక్షస్సు భయంకరంగా అరుస్తూ అట్టహాసం చేస్తూ స్వామివారిని సమీపించి "దయ్యాలు పారదోలేవారి నెందరినో ఆట పట్టించినాను. ఈ ముసలివాడు నాకొక లెక్కా? వీడేం చేస్తాడో చూస్తానుగా" అన్నది. స్వామివారా మాటలు లక్ష్య పెట్టక మంటను ఎగదోస్తూనే ఉన్నారు. ఇంతలో ధునిలో వేసే వంటచెఱకు ఐపోయింది. బ్రహ్మరక్షస్సు ఉద్ధృతంగా చెలరేగినది. స్వామివారు స్వయంగా కట్టెలు కొట్టటానికి గొడ్డలి పట్టుకొని లేచినారు. కాని పొరుగింటి ముసలావిడ స్వామివారిని తన చెట్టు కొట్టకుండా ఆపింది. స్వామి నిరాశగా తిరిగి వచ్చినారు. ఇంతలో గ్రామమునసబు వచ్చి స్వామికి నమస్కరించి కూర్చున్నాడు. స్వామివారాతని సహాయంతో చెట్టు కొట్టించి మంట వేసినారు. మంట పెరిగిన కొలది బ్రహ్మరక్షస్సు ప్రభావం సన్నగిలసాగింది. ఇంతలో స్వామి చేస్తున్న పుణ్యకార్యానికి అడ్డు తగిలిన ఆ ఒంటరి ముసలమ్మ తీవ్రంగా జబ్బు పడింది. ఆమెకు త్రాగటానికి నీళ్ళిచ్చే దిక్కు కూడా లేరు. స్వామివారామెపై కరుణించి కూలిమనిషి నిచ్చి పొరుగూరికి పంపినారు. అక్కడున్న భక్తులకు ఆమెకు సేవ చేసే బాధ్యత అప్పగించినారు. ఆ భక్తులు వృద్ధురాలిని చనిపోయేదాకా అన్నివిధాల సంరక్షించినారు. తన కార్యానికి అడ్డు తగిలిన వృద్ధురాలిని కూడ ఆదుకొన్న స్వామి క్షమాగుణం ఎంతటిదో కదా! అక్కడ నారాయణవరంలో బ్రహ్మరక్షస్సు పట్టిన యువతి విపరీతంగా అరుస్తూ అల్లరి పెట్టేది. స్వామివారు నిరంతరం ధుని వెలిగిస్తూనే ఉన్నారు. మంటలెంత విజృంభిస్తే రక్షస్సు అంత తగ్గిపోయేది. కొన్ని దినాల తరువాత ఆ రక్షస్సు "ఈ సొరకాయల స్వామి భయంకరుడు, నన్ను కాల్చి చంపుతున్నాడు. నేను భరించలేను. వెళ్ళిపోతాను" అన్నది. ఇట్లని ఆ యువతి మూర్ఛపోయింది. కొన్ని దినాలదాకా స్పృహ లేకుండా పడి ఉండి క్రమంగా తేరుకొని ఆరోగ్యం పుంజుకున్నది. బ్రహ్మరక్షస్సు పీడ తొలగిపోయింది.

ఇంతేకాదు - ఎవరైనా మోసం తలపెట్టినా నటించినా స్వామివారు క్షణంలో కనిపెట్టి బుద్ధి చెప్పేవారు. సర్వాంతర్యామియైన స్వామికి అందరి హృదయాంతర్గత భావాలు తెలుసు. కపటనాటక మాడేవారి రహస్యాలు బట్టబయలై లోకుల దృష్టిలో హాస్యాస్పదు లయ్యేవారు. ఒకసారి ఒక స్త్రీ తనకు దయ్యం పట్టినట్లు నటిస్తూ స్వామివారి వద్దకు వచ్చింది. వెంటనే స్వామివారు "శీఘ్రంగా మంగలిని తీసుకరండి. ఆమెకు నున్నగా గుండు కొరిగిస్తాము" అన్నారు. తత్క్షణమే ఆమె తన కపటం అంగీకరించి చెంపలు వేసుకొని వెళ్ళి పోయింది. వేషధారులైన కపట సన్న్యాసులను ఆడంబరంగా భక్తి నటించే భాగవతులను స్వామివారు తమ దరికి చేరనిచ్చేవారు కాదు. ఒకసారి మృదుభాషి, కపటవర్తనుడైన హరిదాసు స్వామి సన్నిధికి వచ్చి పాట పాడుతూ నృత్యం చేసినాడు. "మూర్ఖుని కాల్చినా మతాచారాలు పట్టుబడవు. రామనామం పలుకలేడు" అని ఆ పాటలోని భావం. భాగవతారు ఆవేశంతో ఈ పాట మధురంగానే పాడినాడు కాని స్వామివారు కోపంతో లేచి "మూర్ఖుడా! ఆ పాట నాముందు పాడకు! నన్ను కాల్చినారు కనుకనే బ్రతికిపోయినాను. కాల్చబడనివారి ముందు ఆ పాట పాడు! వెళ్ళిపో" అంటూ గద్దించగనే ఆ భాగవతుడు కొలది క్షణాలు స్తంభించిపోయి స్వామికి సాష్టాంగపడి వెళ్ళిపోయినాడు.

దురహంకార పూరితులకు సజ్జనులను అవమానపరచటం బాధించటం ఒక సరదా. ఒక మాంత్రికుడు స్వామివారిని గేలి చేయటానికి ప్రయత్నించి భంగపడిన వింత సంఘటన ఒకటి జరిగింది. నగరి సమీపాన దామరపాకం గ్రామంలో నల్లత్తూర్ మునుస్వామి శాస్త్రి అనే మాంత్రికుడు ఉండేవాడు. అతడు అధర్వణవేదవేత్త. తీరు తీరు మంత్రాలు మాయలలో నిపుణుడు. తనకు కిట్టనివారికి హాని చేస్తూ ఇష్టమున్నవారికి సంతోషం కలిగిస్తూ చుట్టుప్రక్కల గ్రామాలలో ప్రచండుడని పేరు తెచ్చుకున్నాడు. అమాయికులందరు ఆతనికి భయపడేవారు. తనకు ఎదురు ఎవరు లేరని ఆతడు దుర్గర్వంతో విఱ్ఱవీగు తుండేవాడు. ఒకనాడు స్వామివారు దామరపాకం వెళ్ళినప్పుడు తమ చుట్ట ముట్టించు కోవటానికి అగ్గిపుల్ల గీస్తే అది ఆరిపోయింది. స్వామి మరొక అగ్గిపుల్లను గీసినారు. అదికూడ అట్లాగే ఆరిపోయింది. ఆశ్చర్యచకితులైన స్వామివారు అటుఇటు చూచినారు. అల్లంతదూరాన మాంత్రికుడు కనపడ్డాడు. "ఛీ కుక్కా! అక్కడే ఉండు" అంటూ స్వామి అతణ్ణి శాసించి ఇంకొక అగ్గిపుల్ల వెలిగించి చుట్ట ముట్టించుకొని అక్కడినుండి వెళ్ళిపోయినారు. మునుస్వామి శాస్త్రి తానున్న చోటనే స్తంభించిపోయినాడు. కదలటానికి మెదలటానికి వీలు లేకుండా కాళ్ళు భూమిలో పాతినట్లయినవి. మిత్రులు వచ్చి కదిలించటానికి ప్రయత్నించి విఫలులైనారు. ఇట్లా రెండు దినాలు మాంత్రికుడు అక్కడే నిలుచుండిపోయినాడు. మాంత్రికుని బంధుమిత్రులు కారణం తెలుసుకొని స్వామివారి సన్నిధికి పోయి క్షమాభిక్ష వేడినారు. స్వామి అనుగ్రహంతో అతడు మరల కదలగలిగినాడు. ఆతని గర్వం అణగిపోయింది.

# 6. మదరాసు రాకపోకలు

శ్రీ సొరకాయల స్వాములవారిని ఎన్.రత్నసభాపతి పిళ్ళే, ఆయన స్నేహితులు చెంగల్వరాయ మొదలియారు తోకె నారాయణస్వామి నాయుడు ముగ్గురు మొదటిసారి నారాయణవరంలో 1874 వేసవిలో దర్శించినారు. ఆనాటినుండి స్వామివారు 1893 సంవత్సరం దాక దక్షిణాన నారాయణవరం ఉత్తరాన నాగలాపురం మధ్య గ్రామాలలో సంచరించినవారే కాని అవి దాటిపోలేదు. స్వామివారి భక్తులు, శిష్యులు వారిని మదరాసుకు తీసుకపోవటానికి చాలాసార్లు ప్రయత్నించినారు కాని స్వామి అంగీకరించలేదు. మదరాసు వంటి మహానగరాలు ధనమదాంధుల అధికారబధిరుల దుశ్చేష్టలకు వారి కామవిలాసాది పాపకర్మలకు నిలయాలని స్వామివారి అభిప్రాయం. స్వామివారు ప్రాపంచిక భోగభాగ్యాలకు ఆడంబరజీవితపు సుఖసంతోషాలకు చాలా దూరంగా ఉండేవారు. పల్లెటూరి స్వచ్ఛ వాతావరణంలో అమాయిక ప్రజల సుఖసంతోషాలలో స్వామివారు పాలు పంచుకునేవారు. ఇట్లుండగా పైన పేర్కొన్న మిత్రత్రయం వంటి భక్తులు వారిద్వారా మద్రాసులోని ఆధ్యాత్మికచింతనాపరులు తరుచుగా నారాయణవరం వచ్చి స్వామివారిని సేవించి వారి అనుగ్రహానికి పాత్రులై ఆశీస్సులందుకొని పోయేవారు.

ఎన్.రత్నసభాపతి పిళ్ళే ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, తమ కూతురు జ్ఞానాంబాళ్ వివాహం 1893 సంవత్సరం వేసవి (మార్చి)లో చేయ తలపెట్టినారు. వరుడు టి.భక్తవత్సలం, (స్వామి వారి దివ్యచరిత్రం రచయిత). రత్నసభాపతి వివాహశుభపత్రిక పూలు పండ్లు కర్పూర తాంబూలాదులిచ్చి చెంగల్వరాయ మొదలియారును, నారాయణస్వామి నాయుడును నాలుగు దినాలముందే నారాయణవరం పంపినాడు. మొదలియారు, నాయుడు, రెండుదినాలు స్వామిని సేవించి తాంబూలము టెంకాయ సమర్పించి కర్పూరహారతి ఇచ్చి పెండ్లిపత్రిక చేతిలో పెట్టి రత్నసభాపతి పక్షాన తమ పక్షాన స్వామివారిని మద్రాసుకు రావలసిందని ప్రార్థించి సాష్టాంగ పడ్డారు. స్వామివారు తమ ప్రార్థన అంగీకరిస్తారని వారు కలలో కూడ అనుకోలేదు. స్వామి వెంటనే తమ అంగీకారం తెలుపటమే కాక తమ మూట ముల్లె సర్దుకున్నారు. సొరకాయ బుట్టలు గుడ్డలమూట భుజాన తగిలించుకొని చేతికఱ్ఱ పట్టుకొని బయలుదేరినారు. ఈ వింత చూచేవారందరికీ ఆశ్చర్యం కలిగించింది. స్వామివారిని ఒక బండిలో పుత్తూరు రైల్వేస్టేషనుకు తోడ్కొని పోయినారు. అక్కడ స్వామివారికి వారి వెంట వస్తున్న భక్తులందరికీ ఒక కంపార్టుమెంటు ప్రత్యేకించే ప్రయత్నం చేసినారు. స్టేషను మాష్టరు సజ్జనుడు కావటం

చేత స్వామివారికి వారి భక్తులకు ఆ మాత్రం సౌకర్యం చేయటానికి అంగీకరించినాడు. ఐతే రైలుబండిలోని అన్ని పెట్టెల్లో ఆనాడు క్రిక్కిరిసిన జనం ఉండటం చేత వీలుపడలేదు. స్టేషన్‌మాస్టరు తన అశక్తతను ప్రకటించినాడు. అప్పుడొక వింత జరిగింది.

అనుకోకుండా ఒక పెట్టెలోని ప్రయాణికులందరు పుత్తూరులో దిగిపోయినారు. స్టేషను మాస్టరుకు స్వామిభక్తులకు ఇది కాకతాళీయం కాదనీ స్వామివారి దివ్యలీల అని తెలిసిపోయింది. స్వామివారిని వారి భక్తులను ఆ పెట్టెలో ఎక్కించినారు. రైలుబండి ఆర్కోణం చేరగానే స్వామివారు మద్రాసుకు వస్తున్నట్లు తంతివార్త పంపినారు. మద్రాసులో ఆ వార్త వెంటనే వ్యాపించింది. వేలకొలది స్వామిభక్తులు అనుయాయులు ధనికులు దరిద్రులు మద్రాసు స్టేషన్‌లో స్వామివారిని స్వాగతించటానికి చేరినారు. ప్లాటుఫారంపై స్వామివారిని పూలదండలతో ముంచెత్తి కర్పూరహారతు లిచ్చి సాగిలి మ్రొక్కినారు.

స్వామివారిని ముందుగా చింతాద్రిపేటలోని తోకె వెంకటపతి నాయుడు (మద్రాసు కార్పొరేషన్ రెవెన్యూ ఆఫీసర్) ఇంటికి తీసుకపోయినారు. అక్కడ ఇద్దరు రోగులు స్వామికి శరణాగతి చేస్తే స్వామివారు వాళ్ళను ఆశీర్వదించినారు. వారు వెంటనే ఆరోగ్యవంతులైనారు. మద్రాసులో స్వామివారు ప్రదర్శించిన మొదటి అద్భుతలీల ఇది. అటు తరువాత స్వామివారు ఎగ్మూరులోని అరవముదు నాయుడింటికి పోయి ఆ రాత్రి అక్కడనే బస చేసినారు. మరునాడుదయం ఉపాహారం సేవించిన తరువాత స్వామివారిని రత్నసభాపతి యింటి కల్యాణ మంటపానికి తోడ్కొని పోయినారు. వివాహం చాలా వైభవంగా జరిగింది. స్వామివారి రాకతో పెండ్లి పందిరికి వింతశోభ చేకూరింది. వివాహానికి పిలువనివారు కూడ స్వామి దర్శనార్థం వేల సంఖ్యలో వచ్చినారు. స్వామిని మేడపై అలంకరించిన పందిరి క్రింద సింహాసనంపై కూర్చుండ జేసినారు. స్వామివారు వేయి సూర్యుల కాంతితో వెలిగిపోతున్నారు. స్వామివారికి కొబ్బరికాయలు కొట్టేవారు, పూలదండలు వేసేవారు, కర్పూరహారతు లిచ్చేవారు సాగిలపడి మ్రొక్కేవారు చేసే హడావుడి అంతా ఇంతా కాదు. ఆ యిల్లొక దేవాలయం వలె రూపొందింది. స్త్రీపురుష జనసమ్మర్దాన్ని అదుపు చేయటానికి పోలీసువారి సాయం కూడ అభ్యర్థింపవలసి వచ్చింది. స్వామి కన్నులు వజ్రాలవలె తళతళమన్నవి. ఆయన ముఖంలో దివ్యజ్ఞాన కాంతిపుంజం తాండవించింది. జనులు తండోపతండాలుగా వచ్చి శరణాగతి చేస్తుంటే స్వామి ఒకరికి జరిగింది చెప్పేవారు మరొకరికి జరుగబోయేది చెప్పేవారు. ఒకరి మనసుపొరల్లో దాగిన రహస్యాలు బయట పెట్టేవారు. ఒకరి దుష్టవాంఛలు చూపులతోనే పారద్రోలేవారు. రోగులకు ఆరోగ్యం, దీనులకు ఆశ్రయం, దుఃఖితులకు సంతోషం పంచుతూ స్వామి సహస్రావధానం చేసినారు. స్వామి వధూవరులను ఆశీర్వదించి 10 నిమిషాల దాకా తమ కరకమలాలతో శేషహోమం చేసినారు.

ఉన్నట్లుండి స్వామివారు " మా తమ్ముడు వస్తున్నాడు, మా తమ్ముడు వస్తున్నాడు" అని అరచినారు. స్వామివారి మాటలకు అర్థం అక్కడివారి కెవరికి బోధపడలేదు. ఐదు నిమిషాల్లో కన్నుకుట్టిస్వామి అనే మరొక మహాత్ముడక్కడికి వచ్చినాడు. అప్పుడే కల్యాణసుందరం చెట్టియారు (డిప్యూటీ కలెక్టరు) వచ్చి స్వామికి సాగిలపడి తన బాధలు చెప్పుకున్నాడు. స్వామివా రాయనకు ఊరట కలిగించి బాధానివారణోపాయం చెప్పినారు. వివాహానంతరం భోజనాలైనవి. స్వామి విందారగించినారు. సాయంత్రం 5 గంటలు కాగానే స్వామి తన కుర్చీనుండి లేచి "ఇక్కడ నేనుండను. అనర్హులు రాబోతున్నారు" అంటూ ప్రయాణమైనారు. కొలది నిమిషాల్లోనే వివాహపు వేడుకల్లో వినోద కార్యక్రమం నెరపే భోగంమేళంవారు వచ్చినారు. సర్వజ్ఞులైన స్వామివారు ముందుగానే ఆ తావు విడిచినారు.

స్వామివారు ఒకనాడు పార్థసారథి నాయుడింట్లో మరొకనాడు అరవముదు నాయుడింట్లో ఉండి మరునాడు వెంకట రామానుజులు నాయుడు (లండన్ దొరైస్వామి నాయుడుగా ప్రసిద్ధులు) తోటకు (ఈనాటి రాయపేట మోహనవిలాస్) వెళ్ళినారు. అక్కడ స్వామివారికి పూజలు మహావైభవంగా జరిగినవి. ఆనాటికి ఎన్.రత్నసభాపతి పిళ్ళే యింట మూడునాళ్ళ వివాహవిధులు పూర్తి కావటంతో పిళ్ళే తమ అల్లుడు - నూతన వరుడు భక్తవత్సలంను తోడ్కొని పూజాకార్యక్రమంలో పాల్గొనవచ్చినాడు. అక్కడే ఎదురుపడిన దివాన్ బహద్దురు రాజరత్న మొదలియారుతో మాట్లాడి మామ అల్లుండ్లు స్వామివారికి సాగిలపడినారు. స్వామివారు వారిని ఆశీర్వదించి భక్తవత్సలంతో "మేజోళ్ళు తొడుక్కున్న పెద్దమనిషిని కలుసుకో" అన్నారు. ఒక నిమిషం తరువాత "నీకు ముందుగా ఇద్దరు కూతుండ్రు తరువాత కొడుకు పుడుతారు" అని దీవించినారు. ఉద్యోగం విషయమై దివాన్ బహద్దురుతో తాము ఇందాక మాట్లాడిన విషయాలు స్వామివారు సూచించటంతో భక్తవత్సలం ఆశ్చర్య చకితుడైనాడు. స్వామి చెప్పిన జోస్యం ఫలించింది. ఈవిధంగా స్వామివారి మద్రాసు ప్రథమయాత్ర ముగిసింది. నాలుగవనాడు స్వామివారిని నారాయణవరం తోడ్కొని పోయినారు. స్వామి వెంట దాదాపు 12 మంది భక్తులు నారాయణవరం పోయి వారం దినాలుండి తిరిగి వచ్చినారు.

దీని తరువాత నాలుగు మాసాలకు చెంగల్వరాయ మొదలియారు నారాయణవరం వెళ్ళినాడు కాని స్వామివారు అక్కడ లేరు. స్వామి నిన్రాయిలో ఉన్నారు. మొదలియారు అక్కడికే వెళ్ళినాడు. ఇద్దరు కలిసి నారాయణవరం తిరిగి వచ్చినారు. అక్కడ కొన్ని దినాలు గడపిన తరువాత ఇరువురు మద్రాసుకు వెళ్ళినారు. ఇది స్వామివారి రెండవ ప్రయాణం. ఈసారి స్వామివారు ఎగ్మూరులోని అరవముదు నాయుడింట్లో బస చేసినారు.

భక్తులంతా అక్కడే చేరి స్వామివారిని సేవించినారు. స్వామివారి కైంకర్యానికి భక్తులకు అతిథులకు అయ్యే భోజనాదికముల వ్యయం అందరు కలసి భరిస్తే బాగుంటుందని కొందరన్నారు. కాని అరవముదు నాయుడందుల కంగీకరించలేదు. పార్థసారథి నాయుడు, బి.వి.రామానుజులు నాయుడు జోక్యం చేసుకొని చెంగల్వరాయ మొదలియారు మాధ్యస్థం కోరినారు. ఆయన ఒక్కరే పెత్తనం వహించేకంటె అందరూ కలిసి పంచుకుంటే బాగుంటుందని సలహా ఇచ్చినాడు. అరవముదు నాయుడు, మొదలియారును తూలనాడి గొడవ పెట్టినాడు. స్వామివారు మొదలియారును ఊర్కుండుమని సైగ చేసి సాయంకాలం హఠాత్తుగా కోపావిష్టులై అరవముదు నాయుడును గట్టిగా మందలించి మరికొందరిని చీవాట్లు పెట్టి "కంపుచేప"లంటూ అరచినారు. అక్కడుండను భోజనం చేయనంటూ మొదలియారును తోడుకొని భిక్షాటనకు బయలుదేరి సీతాపేటలో ఒక ఇంటికి చేరినారు. అక్కడొక పెద్దమనిషి పురాణజ్వరంతో బాధపడుతుంటే ఆతనికి తత్క్షణమే ఆరోగ్యం ప్రసాదించినారు. మరునాడు భక్తులందరు ఏకాభిప్రాయానికి వచ్చి శాంతచిత్తులైన తరువాతనే స్వామివారు అరవముదు నాయుడింటికి తిరిగి వచ్చి భోజనం చేసినారు. కొలది దినాల తరువాత స్వామి నారాయణవరం వెళ్ళిపోయినారు.

నాల్గు మాసాల తరువాత తోకె నారాయణస్వామి నాయుడు చెంగల్వరాయ మొదలియారు కలిసి స్వామి దర్శనార్థం నారాయణవరం వెళ్తే వారక్కడ లేరు. స్వామివారు అప్పుడు నాగలాపురం సమీపాన గల మాంబాక్కంలో ఉన్నారు. స్వామిని నారాయణవరం తోడ్కొని పోవటానికి వాళ్ళు ఒక బండిని ఏర్పాటు చేసినారు. స్వామి బండెక్కినారు. బండి బయలుదేరే సమయానికి స్వామి ఒక్కసారి 'తోలకు, తోలకు' అని బండి తోలేవాణ్ణి గట్టిగా హెచ్చరించినారు. స్వామి అట్లా ఎందుకన్నారో తెలియదు. ప్రయాణం ఆపి ఆ రాత్రి అక్కడే ఉండిపోయినారు. కొలది గంటల తరువాత కుంభవృష్టి కురిసి వరదలు పారినవి. చుట్టుపట్లు జలమయమైపోయినవి. ఈ ఆపద రానుంది కనుకనే స్వామివారు ప్రయాణం ఆపినారని స్నేహితులు గ్రహించినారు. మరునాడుదయం మాంబాక్కంనుండి నారాయణ వరం చేరినారు. అక్కడ ఒకటి రెండు దినాలుండి మద్రాసు చేరినారు. స్వామివారు మద్రాసుకు పోవటం ఇది మూడవసారి. ఈసారి స్వామివారు తిరువళ్ళిక్కేణిలోని కిత్తి పార్థసారథినాయుడు బంగళాలో బస చేసినారు. వేలసంఖ్యంలో భక్తజనులు వచ్చి స్వామివారిని అర్చించినారు. ఈసారి స్వామివారు ప్రదర్శించిన అద్భుతాలు లెక్కకు మిక్కిలి. ఎందరెందరికో భవిష్యత్తులో కలుగబోయే సుఖదుఃఖాలు చెప్పినారు. ఆశ్రయించిన వారినందరినీ ఆపద్బాంధవులై కటాక్షించినారు.

ఈసారి మద్రాసులో స్వామివారొకనాడు గుఱ్ఱపుబండిలో పోతుండగా ఒక మహమ్మదీయ సన్న్యాసి ఎదురుపడ్డాడు. ఆ యిరువురు కొంతసేపు ప్రియంగా మాట్లాడుకున్నారు. ఈ నగరాన్ని పాలించిన నవాబుల వారసుడని స్వామివారాయనను అభినందించి పండ్లు సమర్పించి సెలవు తీసుకున్నారు.

## స్వామివారు మద్రాసులో ప్రదర్శించిన అద్భుతాలలో కొన్ని :-

1. అరవముదు నాయుడు వీపులో పెద్ద రాచపుండు పుట్టి చాలా బాధ పడుతుంటే డాక్టర్లు వెంటనే శస్త్రచికిత్స చేస్తేనే ప్రమాదం తప్పుతుందన్నారు. స్వామివారియందు ప్రగాఢ విశ్వాసమున్న నాయుడు మొదలియారును స్వామికి తన విషయం చెప్పుమన్నాడు. స్వామివారు శస్త్రచికిత్సససేమిరా పనికిరాదన్నారు, తంగేడాకు నూరి కట్టుమన్నారు. రెండు దినాల్లో పుండు పగిలింది కాని చీము మాత్రం కొన్ని దినాలదాకా కారుతునే ఉంది. నాయుడు చాలా బలహీనుడై పోయినాడు. స్వామి ఏదో మొక్కను చూపించి ధాని పసరు పూయుమన్నారు. వెంటనే చీము ఆగిపోయి త్వరలోనే పుండు మానిపోయింది. ఈ అద్భుతాన్ని చూచిన డాక్టర్లు అది ఓషధుల ప్రభావం కాదనీ కేవలం స్వామివారి మహిమ అని తీర్మానం చేసినారు.

2. ఒకనాడు తిరువళ్ళిక్కేణి బంగళా వరండాలో కూర్చుండి స్వామివారు "మా అత్తగారు నా కోసం మిఠాయి తెస్తున్నారు" అన్నారు. ఎవ్వరూ రావటం లేదని మొదలియారంటే స్వామివారు "చూడు ! వస్తున్నారు, అదిగో వచ్చినారు" అన్నారు. ఇంతలో ఒక బండి వచ్చి నిలిచింది. అందులో నుండి శ్రీమతి భక్తవత్సలం (జ్ఞానాంబాళ్) ఆమె కూతురు కృపా భక్తవత్సలం దిగి స్వామివారికి మిఠాయి సమర్పించినారు. స్వామివారు మిఠాయిలను తీసి ఒకటి నెత్తిపైన రెండు భుజాలపైన రెండు తొడలపైన పెట్టుకున్నారు. ఒకటో రెండో తాము తిని మిగతా వాటిని అక్కడున్న భక్తులందరికీ పంచినారు. అప్పుడు కృపాభక్తవత్సలం వయస్సు మూడేండ్లు. స్వామివారు తమ అత్తగారని చెప్పింది ఆ అమ్మాయినే. ఆ పిల్ల స్వామిని గడ్డం అట్లా ఎందుకు ముడివేసుకున్నారనీ, వెంట తెచ్చుకున్న ఆ మూటలు సరంజామా ఎందుకనీ ఇటువంటి ప్రశ్నలే అడిగింది. స్వామివారు చిరునవ్వుతో "అక్కడే అన్నీ తెలుసుకొని ఇక్కడికి వచ్చి అడిగితే సమాధానం ఏం చెప్పను?" అన్నారు.

3. స్వామివారక్కడే ఉన్నప్పుడు ఒకసారి పి.రాజరత్న మొదలియారు (ప్రెసిడెన్సీ మెజిస్ట్రేటు) ఒక బ్రాహ్మణ మిత్రునితో వచ్చి దర్శించినారు. వాళ్ళిద్దరూ స్వామి పాదాల వద్ద కూర్చున్నారు. ఉన్నట్లుండి స్వామివారు ఆ బ్రాహ్మణుని తన కాలితో తన్నినారు. అక్కడున్న మరొకాయన కల్పించుకొని అట్లా తన్నవద్దని స్వామిని ప్రార్థించినాడు. కాని చిత్రమేమంటే ఆ బ్రాహ్మణుడు తాను మనసులో స్వామి పాదస్పర్శ కోసం ప్రార్థించినందుకే స్వామివారట్లా తన్నినారని తన సంతోషం ప్రకటించినాడు. అతడు మరొకసారి తన్నవలసిందిగా ప్రార్థిస్తే స్వామి మరల తన్నినారు. ఆ బ్రాహ్మణుని మనస్సు కుదుటపడింది.

4. దివాన్ బహద్దరు పి.రాజరత్న మొదలియారు కూతురు తీవ్రంగా జబ్బుపడితే స్వామివారిని తన యింటికి తీసుక రావటానికి కొడుకును గుఱ్ఱపు బండిని పంపినాడు. కాని స్వామివారు ఎంత బతిమాలినా వెళ్ళలేదు. ఆ అమ్మాయి బ్రతుకదనే సూచనలు చేసినారు. అమ్మాయి రెండు దినాల తరువాత మరణించింది. అంతకు పూర్వమే స్వామివారా యింటికి పోయినప్పుడు "నేను పడుకుంటాను చాప వేయండి" అన్నారు. ఇది అమ్మాయి మరణసూచనే అని తరువాత తెలుసుకున్నారు.

5. ఒకనాడు భక్తవత్సలం తమ యింటికి స్వామివారిని తోడ్కొనిపోయి తమ రెండో అమ్మాయిని ఆశీర్వదించండంటే అమ్మాయి చాలాకాలం బ్రతుకదన్నట్లు సూచనలు చేసినారు. కొలది మాసాల్లో హఠాత్తుగా ఆ పిల్ల చనిపోయింది. భక్తవత్సలం పెద్దమ్మాయితో స్వామి నవ్వుతూ తుళ్ళుతూ మాట్లాడేవారు కాని చిన్నమ్మాయిని జాలిగా చూస్తూ దయనీయంగా మాట్లాడేవారు. ఇట్టి వర్తనమే చిన్నమ్మాయి మరణసూచనమని తరువాత తెలిసింది.

6. మురుగప్ప చెట్టియారు స్వామివారియందు అచంచల విశ్వాసం పెంచుకున్న భక్తుడు. ఆయన స్వామివారిని దర్శించి సాగిలపడి ఎదురుగా కూర్చున్నాడు. అది గమనించి స్వామివారి సేవకుల్లో ఒకడు మొరటుగా ఆక్షేపిస్తూ వెళ్ళిపొమ్మని అరచినాడు. చెట్టియారు చాలా నొచ్చుకున్నాడు. కొలదిసేపటికే ఆ సేవకునికి దెబ్బ తగిలి కింది కనురెప్పల నుండి బాగా రక్తం కారింది. తగిన శాస్తి జరిగిందన్నట్లుగా స్వామివారు వ్యంగ్యంగా నవ్వినారు. స్వామి అతనికి తగిన శిక్ష విధించినాడని చెట్టియారు తృప్తిపడ్డాడు. బయటికి పోయినాడు. స్వామి నిజంగా మహాత్ముడే ఐతే తనను వారంలోగా సన్నిధికి పిలిపించుకోవాలెనని మనసులో

అనుకొని బయట ఒక కొబ్బరిచెట్టు క్రింద కూర్చున్నాడు. నాలుగు దినాలు గడచిన తరువాత స్వామివారొక భక్తుని పిల్చి "బయట ఒక సజ్జనుడున్నాడు, తీసుకరా పో" అని పంపినారు. అతడు పోయి తిరిగివచ్చి ఎవ్వరు లేరన్నాడు. "కొబ్బరిచెట్టు క్రింద చూపు మేరకు ఆవల కూర్చున్నాడయ్యా! పోయి చూడు. వెంటనే తీసుకరా!" అన్నారు. చెట్టియారు వచ్చి సాష్టాంగపడి తన మనసులోని మాట యెరిగిన స్వామివారియందు విశ్వాసం మరింత బలపరచుకున్నాడు. గొప్ప భక్తుడైనాడు. జీవితాంతం నారాయణవరం యాత్ర చేస్తూ గురుపూజోత్సవాల్లో పాల్గొన్నాడు.

7. ఒకనాడు రాత్రి 12.30 గంటలప్పుడు స్వామివారు బిగ్గరగా ఏడుస్తూ "అయ్యా! ఆ పేదరాలు చావబోతున్నది. అదిగో ! చెరువులో పడి చావాలనుకుంటున్నది. త్వరగా పొండి" అంటూ అరచినారు. అక్కడున్న స్వామిభక్తులు బిత్తరపోయి ఆ తోట చివరన మారుమూలన ఉన్న చెరువు వైపు పరుగెత్తినారు. తిరిగి వచ్చి అక్కడెవ్వరు లేరని స్వామివారికి నివేదించినారు. స్వామి వాళ్ళను తిట్టి దూరాన ఉన్న మరొక చెరువు జాడ చెప్పినారు. వాళ్ళు వెంటనే అక్కడికి పరుగెత్తినారు. నిజంగానే అక్కడొక స్త్రీ చెరువులో పడి చావటానికి ఉద్యమిస్తున్నది. వీళ్ళు ఆమెను నిరోధించినారు. ఆమె చావటానికే దృఢంగా నిశ్చయించు కున్నది. ఆమె భయంకరవ్యాధితో బాధపడుతూ ప్రాణాలు త్యజించ నిర్ణయించుకున్నది. భక్తులామెతో గంటసేపు వాదించి ఎట్లాగో ఆమెను ఒప్పించి ప్రాణాలు కాపాడి పుణ్యం కట్టుకున్నారు. ఇట్లాంటి చమత్కారాలు అద్భుతాలు స్వామివారు ఎన్నో చేసినారు మద్రాసులో.

# 7. మహా సమాధి

శ్రీ సొరకాయల స్వామి దర్శనానికి పోయిన వారెవరు నిరాశతో తిరిగి రాలేదు. చాలామంది వారిని గొప్ప మహాత్ములుగా మహాపురుషులుగా కొలిచి సేవించినారు. భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్ముడు "సంభవామి యుగే యుగే" అని వాగ్దానం చేసిన ప్రకారం అవతరించినారని కొందరు భక్తుల విశ్వాసం. ఎవరెవరి అభిప్రాయాలు విశ్వాసాలు ఎట్లున్నా ఆయన ఒక మహాత్ముడనీ గొప్ప దివ్యశక్తి గలవారనీ అతిమానుషవిభూతి సంపన్నులనీ చెప్పటంలో అతిశయోక్తి లేదు.

అవతార పురుషులూ మహాత్ములూ కారణజన్ములైన వారందరూ తాము భూమి మీదికి వచ్చిన పని ముగియగానే ఏమాత్రం జాగు చేయక తమ తమ తనువులు సునాయాసంగా చాలిస్తుంటారు. శ్రీ సొరకాయల స్వామివారు కూడ తమ కర్తవ్యం పూర్తి కాగానే దేహయాత్ర చాలించటానికి నిశ్చయించుకున్నారు. స్వామివారు మహాసమాధి చెందే కొలది మాసాలకు ముందు రత్నసభాపతి పిళ్ళే బళ్ళారిలో ఎక్జిక్యూటివ్ ఇంజనీరుగా ఉన్నారు. ఆయన భార్య, పిల్లలతో మద్రాసునుండి భర్త వద్దకు బళ్ళారికి పోతూ నారాయణవరంలో స్వామివారి దర్శనం చేసుకున్నది. స్వామివారిని సేవించి వారి సెలవు అడిగింది. చాలాదూరం పోతున్నది కనుక మరల స్వామి దర్శనభాగ్యం ఎప్పుడో కదా అని మనసులో అనుకొన్నది. స్వామి యెడబాటువలన కలిగే వారి మనస్సుల్లోని బాధ వారి ముఖాల్లో స్పష్టంగా కనపడుతున్నది. స్వామి తత్క్షణమే " నా ఛాయాచిత్రం తీసి అక్కడుంచినారు. దాన్ని చూచుకొండి" అంటూ గోడకు వ్రేలాడుతున్న తమ చిత్రం చూపించినారు. వాళ్ళకు ఇదే చివరి దర్శనమని దీని సూచన.

స్వామి ఇంకా నాలుగేండ్లకు తమ దేహయాత్ర చాలిస్తారనగా చెంగల్వరాయ మొదలియారు అరవముదు నాయుడు స్వామివారిని దర్శించటానికి వెళ్ళినారు. వాళ్ళు నారాయణవరంలో ఉన్నప్పుడే మద్రాసునుండి ఒక జాబు వచ్చింది. అరవముదు నాయుడు ఇంటిలో ఒక అమ్మాయి తీవ్రంగా జ్వరపడిందని కనుక నాయుడు వెంటనే బయలుదేరి రావలెనని ఆ జాబు సారాంశం. చెంగల్వరాయ మొదలియారు ఆ జాబును స్వామి చేతిలో పెట్టి "ఈయనెప్పుడు పోతాడో అని వాళ్ళు అడుగుతున్నారు" అన్నాడు. అందుకు సమాధానంగా స్వామివారు "ఆడి (శ్రావణ) మాసంలో పోతానని చెప్పు"మన్నారు. మొదలియారుకు ఈ

మాటల్లో అప్పుడే ఏదో కీడు ధ్వనించింది. అతడు స్వామి ఆడి (శ్రావణ) మాసంలో దేహం చాలిస్తారనుకున్నాడు. అనుకున్నట్లే జరిగింది.

స్వామివారు సమాధి చెందటానికి పది సంవత్సరాలు ముందే నారాయణ వరంలో ఏటి ప్రక్కన ఒక ప్రత్యేక స్థలం ఎంపిక చేసి అందులోని ముండ్లపొదలన్నీ కొట్టివేసినారు. ప్రతిదినం మధ్యాహ్నం రెండు గంటల తరువాత స్వామివారు అక్కడి నేలంతా మిట్టపల్లాలు సరిచేస్తూ శుభ్రం చేసేవారు. తమతోపాటు భక్తులను కూడా తీసుకపోయి కాయకష్టం చేయందే ఫలితం రాదని బోధిస్తూ వారిచేత పని చేయించేవారు. ఏటిలోని రాళ్ళన్నీ ఏరి తెచ్చి గుంతలు పూడ్చేవారు. ఇట్లా ఏరి తెచ్చే రాళ్ళు ఒకనాడు ఒక స్త్రీ తనకు కావలెనని కోరితే స్వామి నిరాకరించినారు. స్వామి "పాపిష్ఠివాడు నా స్థలంలోని మట్టంతా తీసుకపోయినాడు. అనుదినం నేనెంత కష్ట పడుతున్నానో ఎవరికీ తెలియదు. ఒక్క రాయి కూడను ఇవ్వను పో, అవ్వా పో" అన్నారు. స్వామివెంట ఉన్న భక్తులంతా రాళ్ళతో గుంతలు పూడ్చినారు. ఒకనాడు స్వామివారు ఆ స్థలంలో ఒక గులకరాయి ఏరి ముద్దుపెట్టుకొని కండ్ల కద్దుకున్నారు. ఆ స్థలం ఎదురుగా నిలబడి ఆ రాయిని ఒక చోటికి విసరినారు. అట్లా ఎందుకు చేసినారని భక్తులడిగితే "మన యిండ్ల మీద మనం రాళ్ళు వేసుకోవద్దా? కనుకనే మన యింటి మీద రాయి వేసుకున్నాము" అన్నారు. స్వామి రాయి విసిరివేసిన చోటులోనే స్వామివారి భౌతికకాయాన్ని సమాధి చేయటం అక్కడొక మందిరం వెలసి ఈ నాటివారికి పుణ్యధామం కావటం వింతల్లో వింత.

స్వామివారు **1902** ఆగస్టులో మద్రాసుకు చివరిసారి వచ్చినారు. ఒక్క వారం దినాలు మాత్రమే అక్కడున్నారు. తమవెంట ఉండి సేవ చేస్తున్న పురుషోత్తమ నాయుడుతో "పద పద! తొందరగా నారాయణవరం పోవాలె. ఒక్కక్షణమైనా ఇక్కడ నిలువవద్దు" అంటూ తొందర పెట్టినారు. పురుషోత్తమనాయుడు ఒక్కడే వెంట రాగా స్వామివారు రైలెక్కి నారాయణవరం బయలుదేరి పోయినారు. స్వామివెంట ఎప్పుడు చాలామంది భక్తులు నారాయణవరం పోతుండేవారు. కాని ఈసారి తమ వెంట ఎవరిని రావద్దని శాసించినారు. శిష్యులకు భక్తులకు ఇది చాలా వింతగా తోచింది. స్వామివారి ఆజ్ఞ మీరలేక ఎవ్వరు వెంట పోలేదు. భక్తులు శిష్యులు అభిమానులందరు స్టేషన్‌కు పోయి స్వామివారిని సాగనంపినారు.

స్వామివారు చివరిసారి మద్రాసు విడిచేముందు ఒక అద్భుతం చేసినారు. ఇది ప్రత్యక్షంగా చూచిన బి.వేణుగోపాలస్వామి నాయుడు తదితర భక్తులు ఈ విషయం

లోకవిదితం చేసినారు. ఆ దినాలలో మద్రాసునుండి బొంబాయి మెయిలు సాయంకాలం 6 గంటలకు బయలుదేరేది. స్వామివారు పురుషోత్తమనాయుడు ముందుగానే ఒక పెట్టెలో ఎక్కి కూర్చున్నారు. స్వామివారు ఎక్కడ కూర్చున్నా తమ చేతిలోని దుడ్డుకట్ట ప్రక్కనే క్రింద పెట్టుకునేవారు. కాని ఆనాడు మాత్రం స్వామివారు తమ చేతిలోని కట్టను అట్లాగే నిలువుగా పట్టుకొని ట్రేన్‌లో కూర్చున్నారు. గార్డు రైలు సాగిపోవటానికి సిగ్నలు ఇచ్చినాడు. కాని రైలుబండి కదలలేదు. ఇంజను లోపమేమో అని రైల్వే అధికారులు మరొక ఇంజను తగిలించినారు. ఐనా బండి కదలలేదు. అప్పటికి 6.15 గంటలైనది. ప్రయాణికులు రైల్వే అధికారులు లోపమేమిటో తెలియక ఆందోళన పడుతున్నారు. ప్లాటుఫారం మీదున్న బి. వేణుగోపాలస్వామి నాయుడు మరికొందరు భక్తులు మాత్రమే స్వామివారి చేతికట్ట నిలువుగా ఉండటం గమనించ గలిగినారు. స్వామివారు కట్టను ప్రక్కన క్రింద పడుకోబెట్టినారు. వెంటనే రైలుబండి కదలింది. స్వామివారు తమ శక్తిని ప్రదర్శించి పోతున్నారనుకున్న నాయుడు మనసులోని సత్యం ఆయన కన్నుల్లో తళుక్కుమన్నది. స్వామి తమ శక్తిని అట్లా ఎందుకు ప్రదర్శించినారో! ఇదే కడసారి మద్రాసు యాత్ర అని ప్రదర్శించినారా? రైలుబండి ఆగిపోయిన అసలు కారణం స్టేషను మాస్టరుకు ఇతర రైల్వే అధికారులకు తెలియగానే వారంతా సంభ్రమాశ్చర్యాలకు లోనైనారు. తమ తప్పిదానికి సిగ్గుతో తలలు వాల్చుకున్నారు. క్షమాపణ చెప్పుకున్నారు. స్వామివారు రైలెక్కేముందు వారి చింపిరి గుడ్డలు, బిచ్చపు వేషము వారిని వెంటాడే జనసందోహమును చూచి ఈ అధికారులు హేళన చేసినారు. ఆదిభిక్షుకుని అంశమైన స్వామివారు తమ శక్తిని ఈ విధంగా చూపినారు.

స్వామివారు పురుషోత్తమనాయుడు పుత్తూరులో రైలుబండి దిగినారు. ఆ రాత్రి పుత్తూరులోనే ఉన్నారు. తెల్లవారిన తరువాత ఒక భజనబృందంతో కలిసి నారాయణ వరం నడచిపోయినారు. భజనబృందంవారు భక్తిపారవశ్యంతో భగవన్నామం చేస్తూ సాగినారు. వారి మధురగానానికి ప్రకృతి కూడా పరవశించింది. నారాయణవరం చేరగానే స్వామివారు పురుషోత్తమనాయుడును, పాపయ్యచెట్టిని పిల్చుకొని "ఎల్లుండి మా దేశం పోతున్నాను" అన్నారు. వాళ్ళకీమాటలు అర్థం కాక అంతగా పట్టించుకోలేదు. ఆ రాత్రి స్వామి తమకు బాగా దాహంగా ఉన్నదంటూ పది పడుల నీళ్ళు త్రాగినారు. ఐనా వారికి మలమూత్రాలు రాలేదు. మరునాడు తమకు ఒంట్లో బాగుండలేదన్నారు. పురుషోత్తమనాయుడు వైద్యుని తీసుక వస్తానంటే వద్దన్నారు. తనను చన్నీళ్ళతో స్నానం చేయించుమన్నారు. 150 బిందెలు చన్నీళ్ళు స్వామివారిపై పోసినారు. రాత్రి 12 గంటల సమయాన స్వామివారు ఉత్తర ముఖంగా

కూర్చుండి పురుషోత్తమనాయుడును "టెంకాయ హారతికర్పూరం లేవా?" అని అడిగినారు. అప్పుడుగాని నాయుడు ఇదేదో ప్రమాదం అనుకున్నాడు. వెంటనే పాపయ్యచెట్టి వద్దకు పరుగెత్తి స్వామివారు దేహం చాలించేటట్లున్నారని చెప్పినాడు. పాపయ్యచెట్టి టెంకాయ హారతి కర్పూరం ఇచ్చినాడు. స్వామివారు మరునాడు పగలు 12 గంటలకు తనువు చాలిస్తామని సైగలద్వారా తెలిపినారు. పురుషోత్తమనాయుడు బిగ్గరగా ఏడ్చి తనకేమైన ఉపదేశం ఇస్తారా అని అడిగినాడు. స్వామివారు "సరియైన చోట హృదయాన్ని నిలపటం చాలా కష్టం. పరోపకారం చేయ్. మంచిపేరు సంపాదించుకోవటానికి చాలాకాలం పడుతుంది. చంచలంగా అటుఇటు పరుగెత్తకు. చంచలస్వభావునికి లభించేది ఏమీ లేదు. ధైర్యంగా ఒకేచోట నిలిస్తే నీకు నెలకు మూడు వరహాలు లభిస్తాయి" అని ఉపదేశించినారు. పాపయ్యచెట్టి తనకేమైనా ఉపదేశం చేయండని ప్రార్థిస్తే ఏమీ మాట్లాడక అభయహస్తం ఎత్తి దీవించి, కొబ్బరికాయ కొట్టి హారతి వెలిగించుమన్నారు. చెట్టి టెంకాయ కొట్టి హారతి వెలిగించినాడు. స్వామి మెల్లగా పురుషోత్తమ నాయుడు మీదికి ఒరిగినారు. ఆయన ప్రాణాలు విశ్వచైతన్యంలో కలిసిపోయినవి. రెండు శతాబ్దాలు దీనుల హీనుల దుఃఖార్తుల కష్టాలు తొలగించి అజ్ఞానులకు జ్ఞానోదయం కలిగించిన ఆ మహాత్ముడు 9-8-1902 నాడు తన జీర్ణశరీరాన్ని వదిలి పెట్టినారు.

ఈ వార్త వెంటనే తంతి ద్వారా మద్రాసు భక్తులకు తెలిపినారు. చెంగల్వరాయ మొదలియారు తదితర భక్తులు తత్‌క్షణమే సమాధి కవసరమయ్యే సామగ్రితో నారాయణ వరం బయలు దేరినారు. స్వామివారినెక్కడ సమాధి చేయవలెననే తర్జన భర్జనలు జరిగినవి. ఒక్కొక్క రొక్కొక్క స్థలం నిర్దేశించినారు. నారాయణవరం గ్రామీణులు అందుకంగీకరించ లేదు. పదేండ్లుగా శుభ్రపరిచి సమతలం చేసిన స్థలంలో, ఒకనాడు వారే రాయి విసరివేసిన చోటున సమాధి చేయటానికి అందరూ అంగీకరించినారు. కల్యాణ శ్రీనివాసాలయం, శివాలయం, ఆంజనేయాలయం- ఈ మూడు దేవాలయాలకు ఏటికీ మధ్యనున్న స్థలం ఇది. లోకపు పోకడ లెరిగిన స్వామివారు తమ సమాధి స్థలం తామే పదేండ్లకు పూర్వమే ఎంపిక చేసిన తీరు అందరికీ ఆశ్చర్యం కలిగించింది. స్వామి దేహాన్ని వారే ఎంపిక చేసిన స్థలంలో సమస్త లాంఛనాలతో శాస్త్రోక్తంగా సమాధి చేసినారు.

స్వామివారు పాంచభౌతికశరీరంతో ఆధ్యాత్మికసామ్రాజ్య పట్టభద్రులుగా ఉండినప్పుడు పదులు, నూర్లు, వేలు క్రమంగా లక్షలు భక్తులు శిష్యులు ఆర్తులు అర్థార్థులు జిజ్ఞాసువులు జ్ఞానులు వారిని సేవించి తమ కష్టాలు దుఃఖాలు పాపుకున్నారు, తరించినారు. తమ శిష్యుల భక్తుల కడగండ్లు బాపి కన్నీళ్ళు తుడిచిన గురువులు సద్గురువులు ఎందరో

ఉన్నారు కాని భక్తుల కోసం వలవల ఏడ్చి కన్నీరు కార్చిన కరుణామయుడైన సద్గురువు సొరకాయల స్వామివారొక్కరే. మానవులకే కాదు మూగజీవాలకు కష్టం కలిగినా స్వామివారు కరిగిపోయి కన్నీరు కార్చేవారు. ఆయన దయాపయోనిధి, కారుణ్యవారాన్నిధి కావుననే ఆయనను ఎంతోకాలం సేవించిన భక్తులు నారాయణవరం గ్రామప్రజలు, చుట్టుపట్టు గ్రామాలవారు ఆ మహాపురుషుడు కనుమరుగై పోయిననాడు గోడుగోడున అనాథలవలె విలపించినారు. సొరకాయల స్వామివారు నిజంగానే పోయినారా? ఔను, కాదు. వారి పాంచభౌతికకాయం మాత్రమే కనుమరుగైనది. కాని వారి దివ్యాత్మ అజరము అమరము నిత్యము. ఇప్పటికీ వారి సమాధి దుఃఖితులను భక్తులను దూరదూరాల నుండి ఆకర్షిస్తూనే ఉన్నది. రోగగ్రస్తులు, పిశాచపీడితులు, బాధితులు ఇప్పటికీ వారి సమాధి నాశ్రయించి సుఖసంతోషాలు పొందుతున్నారు. ప్రతి సంవత్సరం శ్రావణ శుద్ధ పంచమినాడు నేల నాలుగు చెరగుల నుండి భక్తులు వచ్చి స్వామివారి ఆరాధనోత్సవాలు వైభవంగా జరుపుకుంటున్నారు. పూజలు పురస్కారాలు అన్నదానములు తదీయారాధనలు చేస్తున్నారు. మన భౌతిక నేత్రాలకు వారి పార్థివశరీరం కనపడకున్నా నమ్మినవారికి విశ్వాసం గలవారికి తమ మనోదర్పణాల్లో నిడుపాటి గడ్డంతో తలనిండ రుమాలుతో తళతళలాడే ముఖంతో మిలమిల మెరసే కన్నులతో స్వామివారు సాక్షాత్కరిస్తూనే ఉన్నారు, తమ అద్భుతలీలలు ప్రకటిస్తునే ఉన్నారు. తూర్పున సూర్యనారాయణుడు, దక్షిణాన తిరువాలంగాడు ఈశ్వరుడు, తిరుత్తణిలో కుమారస్వామి, శోళింగర్‌లో యోగ నరసింహస్వామి ఈ నలుగురు దేవతల మధ్యన సొరకాయలస్వామి ఐదవ దేవుడై పూజలందుకుంటున్నారు. స్వామివారి సమాధి మందిర నిర్మాణానికి 29-7-1903 శుభకృత్ శ్రావణ-శుద్ధ పంచమి ఆడి నెల 14న తేది గరుడ పంచమి హస్తా నక్షత్రం బుధవారం నాడు శంకుస్థాపనం జరిగి, ఒక దశాబ్దంలోగా ఇప్పుడున్న మందిరం పూర్తి ఐనది.

స్వామివారు దేహం చాలించినది హూణ శకం ప్రకారం 9-8-1902 (వారిని సమాధి చేసినది 10-8-1902) తెలుగువారు పాటించే చాంద్రమానం ప్రకారం శాలివాహన శకం ౧౮౨౪ శుభకృత్ నామ సంవత్సర శ్రావణ శుద్ధ పంచమి శనివారం ఔతుంది. అది తమిళుల (కర్కట) ఆడినెల పంచమి తిథి హస్తా నక్షత్రం. దానినే నాగపంచమి లేదా గరుడపంచమి అంటారు. స్వామివారి ఆరాధనోత్సవాలు ఏటేటా తమిళమానం ప్రకారమే జరుగుతున్నాయి. ఇవి కాక ఏడాది పొడుగునా వచ్చే అన్ని పండుగులప్పుడు, ప్రతి పౌర్ణమినాడు విశేషపూజలు, సంతర్పణలు జరుగుతుంటాయి. ప్రతినిత్యం మూడుపూటలు స్వామివారికి పూజ హారతి జరుగుతుంది. స్వామివారు వెలిగించిన అగ్నిహోత్రం ఎడతెగకుండా ఈనాటికీ వెలుగుతూనే ఉంది. సర్వరోగనివారిణి సర్వాభీష్టప్రదాయిని విభూతి అందరికీ ప్రసాదంగా లభిస్తుంది.

# ద్వితీయ భాగం

# భక్తుల అనుభవాలు

## 1. సమకాలీనులు

### 1. రాయబహద్దురు ఎస్.రత్నసభాపతి పిళ్ళే , ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ పి.డబ్ల్యు.డి. మద్రాసు 14.10.1910

శ్రీ సొరకాయల స్వామివారిని నారాయణవరంలో 1875 సంవత్సరం ఏప్రిల్ మాసంలో మొదటిసారి దర్శించినాను. నా అధికారపరిధిలో చంద్రగిరి తాలూకా, కార్వేటి నగరం, కాళహస్తి జమీందారీలుండేవి. మొదట నా కార్యాలయస్థానం పుత్తూరు, అటు తరువాత నారాయణవరానికి మారింది.

స్వామివారొక బిచ్చగాని వలె కనపడేవారు. చినిగిన గుడ్డలు జటాజూటానికి చుట్టిన ముతక గుడ్డ పెద్ద తలపాగా, పేలికలతో అల్లిన తాడుకు కట్టిన కుక్క, కావడికి ఒకవైపు బిచ్చమెత్తిన గింజలు మరొకవైపు మలమూత్రాల కుండ, భుజానికి అటుఇటు వ్రేలాడే సొరకాయ బుఱ్ఱలతో అచ్చం గంగిరెద్దుల వేషాన్ని తలపించేవారు. స్వామివారు వామనావతారం, కొద్దిగా వంగి నడిచేవారు. నిడుపైన గడ్డం, కత్తిరించని పెద్ద గోళ్ళు, అధికభాగం నెరసిన వెంట్రుకలు, వజ్రాల వలె తళతళ మెరిసే నీలికన్నులు, చిక్కని కనుబొమలు స్వామివారి విశిష్టమూర్తి. ఆయన ధూమపాన ప్రియుడు. ఇతరులడిగితే పొగాకు ఇచ్చేవారు. చేతిలో పెద్ద కఱ్ఱ ఉండేది. అప్పటికే 50-60 ఏండ్లున్న పెద్దలు కొందరు తమ బాల్యంలో కూడ స్వామివారిట్లాగే ఉండేవారన్నారు. మరికొందరు ఈ మహాత్ముడు సిద్ధపురుషుడన్నారు, అనేకాద్భుతాలు చేసినాడన్నారు. రెండుమూడు దశాబ్దాలకు పూర్వం నారాయణవరం అడవుల్లో దిగంబరంగా అవధూతవలె తిరుగుతుండే వారన్నారు. సూర్తపల్లి ప్రాంతంలో ఈతని భార్య కొడుకు ఉన్నారన్నారు. కాని నాకెట్టి సాక్ష్యమూ లభించలేదు. వారు పూర్వాశ్రమంలో ఏం

చేసినారో ఏవిధంగా స్థితప్రజ్ఞులు సిద్ధపురుషులైనారో తెలియదు. ఉత్తరాన తిరుపతి శ్రీకాళహస్తి, దక్షిణాన తిరుత్తణి తిరువళ్ళూరు, పడమట నగరికొండలు, తూర్పున నాగలాపురం కొత్తకోటల మధ్యప్రదేశమంతా తిరుగుతుండే వారు. ఈ యెల్లలు దాటి కూడ అప్పుడపుడు పెరియపాలెం దాకాను మద్రాసు పరిసరరాల వరకున్ను పోయేవారంటారు. ఈ ప్రాంతమంతా వారొక అమాయిక భిక్షుకులనీ దయార్ద్ర హృదయులనీ కష్టాల్లో ఉన్న మనుష్యులనే కాదు పశువులను కూడ ఆదుకొనేవారనీ, ఇతరులను తమ చేతనైన సేవ చేయటానికి పురికొల్పేవారని ప్రసిద్ధి.

ఇట్టి దయాగుణం ఉండబట్టే ఆయనకందరూ భిక్షం పెట్టేవారు. జనులాయనను సొరకాయల బుఱ్ఱలవాడనీ రామస్వామి అనీ పిలిచేవారు. చిన్న పిల్లలను భయపెట్టటానికి తల్లి దండ్రులాయన పేరు (బూచివలె) ఎత్తేవారు. ధనికుడైనా దరిద్రుడైనా ఆయన అందరిని సమానంగా చూచేవారు. అందరు ఆయన యెడల ప్రేమాదరాలు కనబరచేవారు. స్వామివారు మర్యాదను అతిక్రమించే సందర్భం ఒక్కటే. విరిగిన చెట్టుకొమ్మలు గాని పాతకఱ్ఱలు గాని ఎక్కడ కనబడినా ఎవరిని అడుగకుండా తీసుకపోయి నెగడి వేసేవారు. చుట్టనిప్పుకోసం చలి కాచుకోవటానికి మంటకోసం రాత్రంతా నెగడి వేసేవారు. భిక్షించి తెచ్చిన గింజలు కోమటికి అమ్మి ఆతడెంత ఇస్తే అంత తీసుకొని గుడ్డలుతికే చాకలికిచ్చేవారు. లేదా కట్టెలు కొట్టే గొడ్డలి కోసం వాగుల్లో పూడికలు తవ్వే గడ్డపార కోసం వ్యయించేవారు.

ఆ మహితాత్ముని దర్శించిననాటినుండి నాకు దినదినం ఆయనపై భక్తి ప్రపత్తులు పెరిగినవి. ఆయన శుకుడో జనకుడో అనిపించేవారు. నాకు ఏ కష్టం వచ్చినా ఏ సమస్య వచ్చినా వారి చెంతకు పోయేవాడిని. 1875లో ఒకసారి ఆయనవద్దకు పోతే ఆ గ్రామంలో నేను ఉన్నంతకాలం ఎన్నడు కూడ తమ వద్దకు పగటిపూట రావద్దనీ అంత అవసరముంటే ఉదయం నాల్గు గంటలకు రావచ్చుననీ ఆదేశించినారు. మార్చి 1876లో నాకు ఉన్నతపదవిపై చిత్తూరుకు మార్పిడి జరిగేదాకా వారి ఆదేశం పాటించినాను. ప్రతిదానికి ఒక సమయం ఉంటుందనీ ఒక్కొక్కదానికి ఒక్కొక్క సమయం కేటాయించవలెననీ స్వామివారి ఆదేశంగా అర్థం చేసుకున్నాను. ఇటువంటి మహానుభావులకు భోజనాదిసౌకర్యాలు ఏర్పరచటం నాకెంతో ఇష్టం. అది గృహస్థుల ధర్మం కదా!

నేను చిత్తూరుకు మారిన తరువాత పూర్వంవలె తరచుగా వారిని దర్శించ వీలు కాలేదు. 1876-77 కరువుకాలంలో ఆ మహానుభావుడు ఎప్పుడు వచ్చినా భిక్ష చేయటానికి

నారాయణవరం మహాదేవ ముదలికి చెప్పి ఏర్పాటు చేసినాను. ఆ కరువుకాలంలో స్వామివారి చుట్టు 15-20 అనాథశిశువు లుండేవారు. వారికి తినిపించిన తరువాతనే స్వామి తినేవారు.

1880లో ఒకసారి నా ప్రామోషన్ ఆగిపోతే స్వామివారిని దర్శించ బోయినాను. నావెంట చెంగల్వరాయ మొదలియారు భార్య మురుగమ్మాళ్ (గర్భిణి) కూడ ఉండినది. మేము నారాయణ వరం చేరేవరకు స్వామివారు తమ కావడి జోలె సుందరచెట్టి అరుగుమీద విడిచి భిక్షకోసం పోయినారు. సాయంకాలం 7.30 గంటలకు వారు వచ్చేదాకా అక్కడే వేచి ఉన్నాము. స్వామి వచ్చి అరుగు ఎక్కగానే సాష్టాంగపడ్డాము. స్వామి నాతో "నీకెట్టి కొరత ఉండదు" అని ఆమెవైపు తిరిగి "అయ్యో పాపం ఏమి చేస్తాము! దేవుడింత పని చేసినాడా!" అన్నారు. ముఖం అటు తిప్పుకొని "ఇప్పటికింతే పొండి. విశ్రమించండి" అన్నారు. స్వామివారి మాటలు నాకు సరిగా అర్థం కాలేదు గాని మురుగమ్మాళ్‌కు ఏదో కీడు రానున్నదని శంకించినాను. ఆమెకు ఇదివరకే ఐదారుగురు పుట్టి వారం తిరుగకుండానే చనిపోయినారు. ఈసారి ఈమె పోతుందనిపించింది. నా శంక చెంగల్వరాయ మొదలియారుకు చెప్పినాను. మూడు మాసాలలోగా మురుగమ్మాళ్ చనిపోయింది. అనుకోని విధంగా నా పై అధికారి నా యెడ సుముఖుడై ప్రామోషన్ ఇచ్చినాడు. స్వామివారికి భూతభవిష్యద్వర్తమానాలు కరతలామలకమని ఈ సంఘటన విశదం చేస్తుంది.

స్వామివారు ఆర్తులకు ఉపశమనవాక్యాలు, కోరికలతో వచ్చినవారికి భూత భవిష్యత్తులు చెప్పే దృశ్యం చూడముచ్చటగా ఉండేది. సాధారణంగా భోజనానంతరం పొగపీల్చి ఎడమ మోకాలుపై కుడికాలు పిక్క మోపి అరుగుమీద కూర్చుండి నిడుపాటి గడ్డం అలవోకగా తట్టుతూ తలపాగను వెనుకకని, జోలె, కావడి బుఱ్ఱలు వెనుకకు జార్చి, పెదవులపై చిత్తాకర్షకమైన చిరునవ్వులు చిందుతూ, కన్నుల కాంతుల్లో గూఢార్థాలు గుప్పిస్తూ ఉద్దేశించిన వ్యక్తులవైపు చేయెత్తి మార్మికభాషలో మాట్లాడేవారు. అప్పుడాయన మహోన్నత మానవుడుగా విశ్వమానవభ్రాతృత్వ భావనాహృదయుడుగా దయాసాగరుడుగా భగవద్గుణపూర్ణుడుగా దివ్యకాంతులు వెదజల్లుతూ చూపరులకు మైమరపు కల్పించేవారు.

ఒకసారి నేను స్వామివారికోసం నారింజపండ్లు తీసుకపోయినాను. మిత్రుడు తోకె నారాయణస్వామి నాయుడు పొట్టుతీసి పండుముక్కలు స్వామివారి చేతికందిస్తుంటే స్వామివారేమో ఆ పండ్లన్నీ తమచుట్టు మూగిన పిల్లలకిచ్చినారు. ఒక్కపండు మాత్రం మిగిలింది. ఆ పండైనా స్వామివారు ఆరగించవలెనని నాయుడు దాచిపెట్టినాడు. ఒక పిల్లవాడు ఇంకా

కావలెనని చేయి చాచినాడు. నారాయణస్వామి నాయుడు లేదన్నాడు. స్వామి కల్పించుకొని "మనకు లేకున్నా ఫరవాలేదు, అది నాలిక దాటితే నరకమే కదా! వానికి కావలెనట, ఇవ్వు సంతోషిస్తాడు" అన్నారు. నాయుడు వెంటనే పిల్లవానికి పండు ఇచ్చినాడు. స్వామి సంతోషించినారు. స్వామి ముఖం సంతోషంతో వెలిగింది. "సెబాసు! మంచిపని చేసినావు" అన్నారు. స్వామి మనసు అటువంటిది.

### 2. సి. విజయరాఘవులునాయుడు, సొలిసిటర్, మద్రాసు హైకోర్టు, 28.9.1910.

సొరకాయల స్వామివారు అష్టసిద్ధులున్న యోగియేకాదు దేశ కాలావ గుంఠనముల నుత్తరించిన మహాపురుషులు. వారు పెక్కుసార్లు తమ శరీరాన్ని విడిచి మారురూపాలతో భక్తులకు సహాయం చేసి వచ్చినారు.

### 3. ఎన్. రాజునాయుడు, ప్రభుత్వ పెన్షనర్, ప్రధాన గణకుడు, హైదరాబాదు రెసిడెన్సీ.

నేను 1890లో మూడునెలల సెలవు తీసుకొని మద్రాసు చేరుకున్నాను. అక్కడ నారాయణవరం మహాత్ముని గురించి విని, నాభార్య, కొందరు బంధువులతో బయలుదేరి ఆ సాయంకాలమే నారాయణవరం చేరినాను. స్వామివారు ఒక యింటి అరుగుపై కూర్చుండి చుట్టు మూగిన భక్తులతో ఏదో మార్మికభాషలో మాట్లాడుతున్నారు. అది తమిళమే ఐనా నాకర్థం కాలేదు. మధ్యాహ్నం 2 గంటలప్పుడు స్వామివారు హఠాత్తుగా లేచి తనను నిరంతరం సేవిస్తుండే ఎమ్. పురుషోత్తమనాయుడుతో "పద ! ఇక్కడినుంచి వెళ్ళిపోదాం" అన్నారు. నాయుడుకు పోవటం ఇష్టంలేదు. స్వామి మరల కూర్చుండి "వాడు వస్తున్నాడు, వాడు వస్తున్నాడు" అంటూ పావుగంట గొణిగి నడుం వాల్చినారు. వెంటనే బలిష్ఠమైన రెండెడ్లబండి వచ్చి అరుగుకెదురుగా నిలబడింది. అందులోనుండి ఒక యువకుడు, ఇద్దరు స్త్రీలు దిగినారు. యువకుడు స్వామివారికి సాష్టాంగపడి లేచి పండ్లు పూలు సమర్పించబోతుండగా స్వామివారు కోపంతో "నీవు ఎవరి దర్శనం కోసం వచ్చినావో అక్కడికే పో, నేను భగవంతుడినా ? నాతో ఏం పని? పో" అన్నారు. అక్కడున్న మద్రాసు భక్తులా బిక్కపోయిన యువకునితో "మీరెవరు? మద్రాసునుండి నేరుగా స్వామి దర్శనానికే వచ్చినారా లేక ఇంకేమైనా పనిమీద వచ్చి ఇటు

వచ్చినారా ? నిజం చెప్పండి. ఇక్కడ అబద్ధాలాడరాదు. ఈ స్వామిని ఎవరూ మోసగించలేరు. నిజం చెప్పకపోతే అనర్థం జరుగుతుం"దని హెచ్చరించినారు. అతడు గడగడ వణకిపోతూ "అయ్యా! నేను మునిసిపల్ ఓవర్సీయర్‌ను. కడచిన సంవత్సరంనుండి విపరీతమైన శిరోవేదనతో బాధ పడుతున్నాను. తిరుత్తణి సుబ్రహ్మణ్య స్వామికి మొక్కు చెల్లించు కోవటానికి పోతే అక్కడ ఈ స్వామివారి మహిమలు తెలిసినవి. అందుకే ఇక్కడికి వచ్చినాను" అన్నాడు. నీకీ తలనొప్పి ఎందుకు వచ్చిందంటే "ఒక రాత్రి నిద్ర పోతుండగా రెండెలుకలు పోట్లాడుకుంటూ నా తలపైన పడి కరచినాయి. అప్పటినుండి నాకీ శిరోవేదన" అన్నాడు. ఈ మాటలు వింటూనే స్వామి ఉగ్రులై లేచి "వెళ్ళిపో ! మరికొందరు స్త్రీలతో పో" అని అరచినారు. అక్కడున్నవారికి అతనిపై అనుమానం కలిగి ఇకనైనా సత్యం చెప్పుమని కోపగించినారు. తప్పదనుకొని అతడు తానొక పాపినని, జారుడనని, సుఖరోగాలతో బాధపడుతున్నానని చెప్పినాడు.

వెంటనే స్వామివారు లేచి బాటపట్టి ఎటో పోసాగినారు. పురుషోత్తమ నాయుడును వెంట రమ్మని ఆదేశించినారు. స్వామి ఆజ్ఞానుసారం నాయుడు మరికొందరు అనుయాయులు వెన్నంటి పోయినారు. నేను వారివెంట నడచినాను. కొంతదూరం పోయిన తరువాత స్వామి వెనుదిరిగి చూచినారు. మావెనుక ఆ ఓవర్సీయర్ కూడ వస్తుండటం గమనించి స్వామివా రమితవేగంతో నడవసాగినారు. మేము వారిని అందుకోలేకపోయినాము. కొందరు మద్రాసు భక్తులా ఓవర్సీయర్‌తో "నీవు స్వామి వెంట రాకు. ఈ సారికి వెళ్ళిపో. మరొకసారి వచ్చి స్వామిని దర్శించుకో! పో. లేకపోతే అనర్థం జరుగుతుం"దన్నారు. అతడు భయపడి తిరిగిపోయినాడు. అతడు పోగానే స్వామివారు నడక ఆపి రోడ్డుపై నిల్చినారు. ఆనాడు స్వామి నిల్చిన చోటే ఈనాడు సమాధి మందిరం వెలిసింది.

స్వామి నిలిచిపోయిన చోటనే నేను వారికి సాష్టాంగ పడ్డాను. తమ దక్షిణహస్తంతో నా వీపు తడుతూ చిరునవ్వుతో "లే బాబూ, నీకేం కావాలె ?" అన్నారు. "స్వామీ ! నేను చిన్నవాణ్ణి. నామీద పెద్ద కుటుంబభారం పడింది. నాకు భయంగా ఉంది" అన్నాను. స్వామి "బిడ్డా! భయపడకు. నీకే ఆపద రాదు. నీవు ఎవరిమీద ఆధారపడవు, నీమీదే ఇతరులాధారపడుతారు" అన్నారు. నేను "స్వామీ ! తామెప్పుడూ నావెంట ఉండండి. నన్ను విడువకండి" అంటూ ప్రార్థించినాను. స్వామివారు తమ దక్షిణహస్తం నా శిరముపై ఉంచి దీవించినారు. నేను మాకుటుంబం నిలిచినచోటికి తిరిగిపోయినాము. స్వామి నన్నాశీర్వదించినవైనం తెల్పినాను. అప్పుడు సాయం 6 గంటల సమయం.

ఆ రాత్రి భోజనాల తరువాత నేను మా బంధువులు హాయిగా నిద్రించినాము. మరునా డుదయం 4 గంటలకే లేచి నేను స్వామివారి జాడలు వెదకటానికి బయలుదేరినాను. 'నీవీ ప్రదేశానికి క్రొత్త! ఎక్కడికని పోతా'వని మావాళ్ళన్నారు. మేమున్న ఇంటి అరుగుపైన పడుకొన్న ఒక ఆగంతుకుడు 'స్వామివారెక్కడెక్కడ నిలుస్తారో నాకు తెలుసు. నావెంట రండి పోదాం' అన్నాడు. మేమిద్దరం కలిసి బయలుదేరినాము. దాదాపు ఎనిమిది మైళ్ళు నడచినాము. సుబ్బానాయుడు కండ్రిగ గ్రామంలో స్వామివారున్నారు. ఇంతదూరం నేను ఎన్నడూ నడువలేదు. ఐనా నాకెట్టి ఆయాసము కలుగలేదు. నేను అక్కడికి చేరటానికి 15 నిమిషాల ముందు స్వామివారు "పాపం!బిడ్డడు చాలా దూరంనుండి నడచి వస్తున్నాడు" అన్నారట. నేను చేరిన తరువాత స్వామి అనుచరులు నాకీ విషయం చెప్పినారు. పోగానే నేను స్వామివారికి సాష్టాంగపడ్డాను. స్వామి తమ అనుచరునికి నన్ను చూపి "ఈ బిడ్డడు అమాయికుడు. చెరువుకు తీసుకపోయి ముఖం కాళ్ళు చేతులు కడిగించి తీసుకరండి. ఈతణ్ణి బాగా అరసికొండి" అన్నారు. నేను చెరువునుండి తిరిగి రాగానే స్వామివారు ఆ యింటి యజమానురాలైన 60 ఏండ్ల స్త్రీతో "నా బిడ్డలంతా ఆకలితో ఉన్నారు. తినటానికి ఏమైనా పెట్టవమ్మా!" అన్నారు. ఆయమ్మ పెద్దకుండెడు చద్దన్నం పెరుగు కలిపి తెచ్చి పెట్టింది. స్వామి ఆమెతో "ఇంట్లో ఆ మూలన మంచి గడ్డపెరుగు దాచి పెట్టినావే! ఎవరికోసం? నా పేగులు తెంపటానికా? తేపో! నా బిడ్డలు ఆరగిస్తారు" అన్నారు. ఆయమ్మ ఇంట్లోకి పోయి దాచిపెట్టిన పెరుగు తెచ్చి "నీవు సాక్షాత్తు శ్రీకృష్ణ పరమాత్మునివేనయ్యా!" అంటూ అప్పగించింది.

అందరు తిన్న తరువాత స్వామివారు లేచి "పిల్లలూ, ఇక పదండి పోదాం" అన్నారు. ఆ వృద్ధమహిళ స్వామికి తన దోసిలినిండా వక్కలు ఆకులు సమర్పించింది. స్వామి వాటిని తమ ఉత్తరీయం కొంగున కట్టుకున్నారు. మేము స్వామివెంట తోటలు, ఏరులు, అడవులు, కొండలు దాటుతూ ముండ్లబాటలలో నడచినాము. మావి వట్టికాళ్ళైనా ఒక్క ముల్లయినా కుచ్చుకోకపోవటం ఆశ్చర్యం. స్వామివెంట నడుస్తుంటే ముండ్లకంపలు గడ్డిపరుపులుగా మారిపోయినవి. ఒక గంట పయనించి మరొక గ్రామం చేరినాము. అక్కడ స్వామివారొక కుటీరం చొచ్చి "అమ్మా! అమ్మా! అంటూ పిల్చినారు. 70 ఏండ్ల ఒక వృద్ధమహిళ వచ్చి స్వామికి పాదాభివందనం చేసింది. స్వామి తమ కొంగున కట్టితెచ్చిన వక్కలాకులు ఆ ముసలమ్మకిచ్చినారు. ఐదు నిమిషాల తరువాత స్వామి "ఇక బయలుదేరండి. నారాయణ వరం పోదాం. అక్కడ నా బిడ్డలంతా ఎదురు చూస్తున్నారు" అన్నారు. అప్పుడు ఉదయం11

గంటలు. నారాయణవరం సమీపించే ముందు 'స్వామి వెంట కొందరు భక్తులు వస్తున్నారు. కనుక అందరికీ భోజనాలు సిద్ధం చేయం'డని మావాళ్ళకు వేగరిచేత వార్త పంపినాను. ఒక గంట తరువాత నారాయణవరం చేరినాము. స్వామి 10 నిమిషాలు తమ అరుగుమీద కూర్చుండి లేచి "అవ్వా! నాకు ఆకలౌతున్నది అన్నం పెట్టు" అన్నారు. నేను వార్త పంపి గంటసేపైనది. భోజనం సిద్ధమైనదో లేదో అని నా ఆశంక. లోనికిపోయి మావాళ్ళను విచారిస్తే "భోజనం సిద్ధ"మన్నారు. స్వామివారిని పెద్ద చెక్కబల్లపై కూర్చుండబెట్టి పూలమాలలతో అలంకరించి ఆచార్యపూజ చేసినాము. అటు తరువాత స్వామితో పాటు అందరం భోంచేసినాము. భోజనానంతరం స్వామి తమ కుడికాలు చాచి చిరునవ్వు ముఖంతో "మీరంతా చల్లగా వర్ధిల్లండి" అంటూ దీవించినారు. పురుషోత్తమ నాయుడు నా భార్యను పరిచయం చేస్తూ "ఈమె నలుగురిని కన్నది. కాని ఒక్కరు బ్రతుకలేదు. ఈమెను ఆశీర్వదించండి" అని ప్రార్థించినాడు. నాభార్య స్వామికి సాగిలపడినది. అట్లా చేయటానికి స్వామి తాను దేవుడు కాని దేవతకాని కాదంటూనే నా భార్యవైపు ప్రసన్నంగా చూసి "ఒక కూతురు, ఒక కొడుకు పుడుతా"రని దీవించినారు. ఆ యేడే మాకు ఒక అమ్మాయి, ఐదేండ్ల తరువాత ఒక అబ్బాయి కలిగినారు. స్వామి మా అబ్బాయికి అర్జునుడని (సొరకాయల స్వామికి అర్జుననామం అంటె మక్కువ యెక్కువ) నామకరణం చేసినారు. ఆ యిద్దరు పిల్లలు బాగున్నారు. కాని తరువాత పుట్టిన యిద్దరు బ్రతుకలేదు.

నేను హైద్రాబాదు రెసిడెన్సీలో ఉద్యోగం చేస్తుండగా 1900 సంవత్సరం ఒకనాడు మధ్యాహ్నం 2 గంటలప్పుడు భోజనాల తరువాత విశ్రాంతి కోసం తోటలోనికి పోయినాను. నేను విశ్రమించే స్థలానికి సమీపాన ఒక చిన్నగుట్ట దాని వెనుక గోడ ఎదురుగా పెద్ద చింతచెట్టు ఉన్నాయి. ఆ గుట్ట కెదురుగా విశాలమైన స్థలంలో అసిస్టెంటు రెసిడెంటు గారి బంగళా, హైదరాబాదు పట్టణంలోకి దారితీసే గేటు, గేటు వద్ద మిలటరీ సెంట్రీ ఉన్నాడు. ఆ మైదానంలో 10,12 ఆవులు మేస్తున్నాయి. అందులో తెల్లపొడలున్న ఒక పుల్లావు క్షణంలో వెలుగు దూకి నామీదికి వచ్చింది. మిలటరీ సెంట్రీ నేను చచ్చిపోయినానని అరచినాడు. స్తంభించిపోయి కండ్లు మూసుకొని నేను స్వామి నామం స్మరించినాను. 10 నిమిషాలకు తేరుకున్నాను. గజం దూరాన ఆవు రౌద్రంగా అట్లాగే నిలిచిపోయింది. ఐదు నిమిషాల తరువాత పులివంటి ఆవు మేకవలె తన దారిన తాను పోయింది. ఆ సెంట్రీ కూడ తేరుకొని "చచ్చిపోయినావనుకున్నాను. భగవదనుగ్రహంతో నీవు బ్రతికి బయట పడ్డావు" అన్నాడు. నా జీవితంలో స్వామివారు చూపిన అద్భుతములు ఇంకా చాలా వున్నవి. కష్టాలు నష్టాలు ఏమివచ్చినా స్వామినామం జపిస్తాను. సూర్యకిరణాలకు మంచుపొరలు కరిగిపోయినట్లు

కష్టాలు మటుమాయమైపోతాయి. ఈ మహాత్ముడొక భగవదవతారం అనటంలో ఇసుమంతైనా సందేహం లేదు.

### 4. బి. వేణుగోపాల నాయుడు, పాతశివరాం శ్రోత్రియందారు, చెంగల్పట్టు జిల్లా, మద్రాసు.

1901 సంత్సరం ఈస్టర్ సెలవుల్లో స్వామివారిని దర్శించటానికి నారాయణవరం వెళ్ళినాను. మూడవనాడు మద్రాసుకు తిరిగి పోవటానికై అనుమతికోసం స్వామివారి కెదురుగా అరగంట నిల్చున్నాను. స్వామి పలుకలేదు. రైలుబండి బయలుదేరే సమయం ఔతున్నందున నేను స్టేషనుకు పోయినాను. బండి ఎత్తిపోయినందున నారాయణ వరానికి తిరిగి వచ్చినాను. నేను తిరిగివచ్చే 15 నిమిషాలముందే స్వామి నవ్వుతూ "ట్రేన్‌కోసం పోయిన వాడు తిరిగి వస్తున్నాడు" అన్నారట. స్వామి అనుమతి లేకుండా పోయినందుకు నాకు తగిన శాస్తి జరిగింది.

1901 సంవత్సరం మద్రాసు ఐస్‌హౌస్ తోటలో స్వామివారు బసచేసి ఉండగా దయ్యాలు పట్టిన స్త్రీలు చాలామంది వచ్చి స్వామిని దర్శించి బాగైనారు. ఒక స్త్రీ అర్థం లేని మాటలరుస్తూ తోటంతా పరుగెత్తేది. 70 - 80 పౌండ్ల బరువున్న రాళ్లు నెత్తిన పెట్టుకుని పరుగెత్తేది. ఒకసారి మండుతున్న పెద్ద దుంగను మోసుకొని స్వామి ముందుకు పోయింది. స్వామివారు ఒకనాడు తాము తింటున్న అన్నంనుండి ఒక ముద్ద ఆమెకు పెట్టి తాము త్రాగే పాత్రనుండి నీళ్ళు పోసినారు. ఆమె ఆ ముద్ద తిని నీళ్ళు త్రాగి క్రింద పడిపోయింది. 15 నిమిషాల తరువాత ఆమెకు స్పృహ వచ్చింది. పూర్తిగా నయమైపోయింది. స్వామివారు మద్రాసులో ఉండగా ఇటువంటి పెక్కులీలలు చేసినారు.

1901లో నా సోదరుడు బి. రాజగోపాలనాయుడు L.R.C.P. &S (Edin) D.P.H. (Cantab) మేహవాతంతో మూడునెలలు బాధపడ్డాడు. ఏమాత్రం కదల మెదల లేకపోయినాడు. ఆ వారం అంతంలో అతని పరీక్షలుండినవి. డాక్టర్లు అతడు పరీక్షలు వ్రాయజాలడన్నారు. ఆ దినాలలో స్వామివారు మద్రాసులో ఉండడం చేత వారిని మా యింటికి రెండుసార్లు తీసుకపోయినాను. కాని మా యింటిలోపల అడుగుపెట్టకుండానే స్వామివారు తిరిగిపోయినారు. ఒకనాడు స్వామివారు 12 గంటలప్పుడు తామై ఒక శకటం అధిరోహించి మా యింటికి వచ్చి మా సోదరుడు విశ్రమిస్తున్న గదిలోనికి నేరుగా పోయి అతని కాళ్ళు

స్పృశించి వేపాకు నూరి కట్టుమన్నారు. ఇతర మందులన్నీ ఆపివేసి స్వామి చెప్పినట్లు చేసినాము. మూడవనాటికి నొప్పులు తగ్గిపోయి వారాంతాన మద్రాసు యూనివర్సిటీ పరీక్షలు వ్రాసినాడు. డాక్టర్లు ఆశ్చర్యపోయి ఏ మందులు వాడినారని అడిగితే స్వామివారిచ్చిన వేపాకు అన్నాము. డాక్టర్లు స్వామివారినుండి ఆ యోగం పొందటానికి ప్రయత్నించి విఫలులైనారు.

స్వామివారు మహాసమాధి చెందే కొలది దినాలముందు **1902** జూలై మాసాంతాన మద్రాసు నుండి నారాయణవరానికి తిరిగిపోతూ రైలెక్కి తమ చేతిలోని గుతుపను అలవాటుకు భిన్నంగా నిలువుగా పట్టుకున్నారు. అది మద్రాసు సెంట్రల్‌నుండి బయలుదేరే బొంబాయి మెయిల్. సాయం 6 గంటలైనది. గార్డు సిగ్నలిచ్చినా బండి కదలలేదు. రైల్వే అధికారులు ఇంజను మార్చి మరొక ఇంజను తగిలించినా బండి కదలలేదు. అప్పుడు 6.15 గంటలైనది. స్వామివారు తమ చేతిలోని గుతుపను ప్రక్కన పరుండబెట్టగానే బండి కదిలింది. స్వామివారిని సాగనంపటానికి ప్లాటుఫారం మీద నిలుచున్న నాకు మరొక యిద్దరికి మాత్రమే ఈ వింత సంఘటనకు కారణం తెలుసు. ఐతే స్వామివారు తమ శక్తిని ఎందుకు ప్రదర్శించినారో మాకు తెలియదు. ఇదే తమ చివరి మద్రాసు యాత్ర అని శిష్యులకు భక్తులకు శక్తి ప్రదర్శనం ద్వారా తెలియజేసినారేమో ! మద్రాసునుండి పోయిన తరువాత వారానికే స్వామివారు తమ దేహయాత్ర చాలించినారు. మేము స్టేషన్‌మాస్టరుకు బండి కదలకపోవటానికి కారణం చెప్పితే ఆయన ఆశ్చర్యపోయినాడు. ప్లాటుఫారంమీద మాసిన గుడ్డలతో స్వామివారిని ముందుగా చూచినప్పుడు బిచ్చగాడనుకున్నందుకు ఆయన పశ్చాత్తాప పడ్డాడు. స్వామివారిటువంటి అద్భుతశక్తులెన్నో ప్రదర్శించినారు. గ్రంథ విస్తరం ఔతుందని ముగిస్తున్నాను.



## 5. సి. ముత్తుస్వామి మొదలియారు, M&S M రైల్వే, మద్రాసు.

క్రీ.శ. **1899** మే మాసంనుండి నేను స్వామివారిని ఎరుగుదును. అదేమాసం కుటుంబ సభ్యులతో స్వామివారి దర్శనార్థం వెళ్ళినాను. స్వామివారు సాయంకాలం 5 గంటల సమయంలో మాంగాడునుండి నారాయణవరం గహనాటవీ మార్గంలో ప్రయాణిస్తున్నారు. చెట్లపైన దారిలోను కోతులు దండిగా ఉన్నవి. మనుష్య సంచారమే లేదు. స్వామివెంట మేము నడుస్తున్నాము. సమీపంలో ఎక్కడా పల్లె ఉన్న జాడ లేదు. స్వామివారికి పాలపొంగలి చేసి పెడితే బాగుండు ననిపించింది. కాని ఆయడవిలో పాలెక్కడ లభిస్తాయి ? ఇంతలో అనుకోకుండా ఒక వృద్ధుడు రెండు పడుల చిక్కని పాలు తెచ్చి స్వామికివ్వబోయినాడు.

స్వామి తనకవసరం లేదంటూ మావైపు చూపినారు. మేము అమృతం వంటి ఆ పాలతో పాలపాయసం వండి స్వామికి అర్పించినాము. మేముకూడ భోజనాలు ముగించి నెగడి వెలిగించి ఆ అడవిలోనే హాయిగా పడుకున్నాము. తెల్లవారిన తరువాత నిద్ర లేచినాము. నడి అడవిలో పాలు లభించటం, అన్ని కోతులున్నా మా జోలికి రాకపోవటం స్వామి వారి మహిమే.

**30.9.1898** శుక్రవారం నేను నా కుటుంబసభ్యు లందరం కలసి నారాయణ వరం వెళ్లి మరల స్వామిని దర్శించినాము. స్వామివారి ఛాయాచిత్రం వారి చేతికిచ్చి మరల తీసుకున్నాను. ఆనాడు స్వామివారు సాయం **4** గంటలప్పుడు నాకు రెండు పైసాలిచ్చినారు. తరువాత పక్షం దినాలలోనే నాకు ఉద్యోగం లభించింది.

**1.7.1899** ఆదివారంనాడు స్వామివారిని నిద్రాయి కోటలో సేవించినాను. స్వామివారు "ఎప్పుడూ అర్జునుని నామం వల్లించు"మన్నారు. (ఎన్. రాజునాయుడు కొడుకుకు స్వామి అర్జునుడని పేరు పెట్టినారు). స్వామి అనుగ్రహంతో ఆనాటినుండి మేమంతా బాగున్నాము.

## 6. శ్రీమతి కామాక్షి అమ్మాళ్ (టి. తంగవేలు ముదలియారు భార్య)

మద్రాసు.

నేను స్వామివారిని **20** ఏండ్లుగా ఎరుగుదును. అందరివలె నేనుకూడ వారిని సాధారణ రీతిలోనే ఆరాధించినాను. ఒకసారి **10** దినాల శిశువు మా మనుమడు అంగును తోడ్కొని నారాయణవరం వెళ్లినాము. వానికి బుడ్డ. వృషణాలు వాచినవి. దేశీ, ఇంగ్లీషు అన్ని తీరుల మందులు వాడినాము. కాని నయం కాలేదు. తీవ్రమనోవేదనతో మా కుటుంబం అందరం నారాయణవరం వెళ్ళి స్వామికి శరణార్థి చేసి శిశువును చూపించినాము. స్వామి దయతో మూడు వ్రేళ్ళు చూపి వేరుశనగ నూనె పూయుమన్నారు. స్వామి విభూతితో కలిపి వేరుశనగనూనె పూసే వాళ్ళం. అది క్రమంగా తగ్గుముఖం పట్టింది.

మా కుటుంబంలో మరొక అమ్మాయికి దగ్గుబాధ సహించరానిదిగా ఉంటే మరల స్వామిని ఆశ్రయించినాము. స్వామి ముసుముసుగ్గై (కూతురు బుడమ Bryonia Scabra) సూచించి తాము కొలనువైపు పోయినారు. స్వామివారి గృహంలో వెంటనే ఆమందు నూరి అమ్మాయి కిచ్చినాము. స్వామివారి వెంట పోయిన నా భర్తకు త్రోవలో కూతురు బుడమ

కనబడితే ఆయన తెంపుకుని కండువలో కట్టుకున్నారు. స్వామివారు చాలా ముందు సాగిపోతుండగా ఒక ముసలామె ఎదురు పడింది. నా భర్తను పిలిచి స్వామివారు కండువలో దాచినదేమంటే కూతురు బుడమ అన్నారు. స్వామి దానిని ఆ ముసలమ్మ కిమ్మన్నారు. మావారు అమ్మాయికోసం కొంచెం దాచి మిగతా ఇచ్చినారు. మేము ఇంట్లో అమ్మాయికి అదేమందు ఇచ్చినది వారెరుగరు. తమ నడుము రాచుకుంటూ "ఇంకా కొన్నిదినాలు" అన్నారు. అచ్చటున్నవారు నా భర్తను ఆ మందు ఎందుకు దాచుకున్నావని నిందించినారు. ఎరుగక చేసిన అపరాధానికి నాభర్త నొచ్చుకున్నాడు. అందువలన మా అమ్మాయికి దగ్గు తగ్గటానికి మరి కొన్ని దినాలు పట్టింది. ఎనిమిది మాసాలకు పూర్తిగా నయమైపోయింది. మా మనుమని బుడ్డ మూడేండ్లకు పోయింది. స్వామివారు అలనాడు మూడువ్రేళ్ళు చూపినదానికి అర్థం అప్పుడుగాని బోధపడలేదు.

మరొకసారి మేమంతా స్వామివారిని దర్శించినాము. అప్పుడు స్వామి మా అంగుకు కాలు రూపాయి ఇచ్చి "మార్కండేయ ఆయుష్యం" అని దీవించినారు.

నా భర్త చనిపోయిన మూడేండ్లకు నాకు ఆర్థికపరమైన ఇబ్బందులు వస్తే స్వామి ఇంక వారానికి దేహం చాలిస్తారనగా నారాయణవరం వెళ్ళి మొరపెట్టు కున్నాను. స్వామివారు దయతో నా చేతిలో కొంత పైకం పెట్టినారు. లెక్క పెడితే అవి సరిగా 5 రూపాయలు. అదే నెలలో అనుకోకుండా నా భర్త పని చేసిన Gordon Woodroffe కంపెనీ వారు నాకు నెలకు 5 రూపాయల పెన్షన్ మంజూరు చేసినారు. ఇది చాలా విచిత్రమైన సంఘటన.

## 7. బి.వి. రామానుజులు నాయుడు, శివరాం శ్రోత్రియందారు & మద్రాసు కార్పొరేషన్ కమీషనరు.

శ్రీ సొరకాయల స్వామివారిని గూర్చి నేను 1880లోనే తొకె నారాయణ స్వామి నాయుడు ద్వారా విన్నా 1886 లో మాత్రమే వారిని దర్శించగలిగినాను. వారెప్పుడూ దివ్య సమాధ్యవస్థలో ఉండేవారు. మనస్సు, ఇంద్రియాలు, చిత్తము, బుద్ధి మొదలైనవాటి నన్నింటినీ తమ అధీనంలో ఉంచుకున్న సత్పురుషులు వారు. ఆకలైనప్పుడు ఎక్కడైనా ఏమైనా తిని మరల ఆత్మానుసంధానంలోకి పోయేవారు. ఎప్పుడైనా వారి మనస్సు మనవంటి వ్యక్తులవైపు మరలితే మన గతజన్మల చరిత్ర ప్రస్తుత జన్మ చరిత్ర రాబోయే జన్మల చరిత్ర వారికి అద్దంలోవలె

కనబడేది. తమను ఆశ్రయించిన ప్రతి వ్యక్తికి సరియైన మార్గదర్శనం చేసిన సద్గురువాయన. ఆయన దగ్గరికి పోయినవారి తప్పొప్పులు మొగమోటం లేకుండా చెప్పేవారు. స్వామివారు కర్షకుల భాషలో నిగూఢంగా మాట్లాడేవారు. ఆ కాలపు మహాత్ముల్లో అందరికంటె గొప్పవాడైనా ఎవరి కంటబడకుండ మారుమూల అడవుల్లో తిరిగేవారు. నిజంగా అర్హులైన వారికి ఆయన సహాయం ఎప్పుడూ లభించేది. స్వామివారు 1902 ఆగస్టులో నిర్యాణం చెందినారు. వారి ఘనత గురించి చెప్పే అర్హత నాకు లేదు కాని నేనెరిగిన సంఘటనలు కొన్ని కాలక్రమానుసారంగా వివరిస్తాను. వాటిమూలంగా చదువరులే వారి శక్తి సామర్థ్యాల గురించి నిర్ణయించుకోవచ్చు.

1. స్వామివారిని గురించి 1880లోనే విన్నా 1886 జనవరిలో మాత్రమే వారిని దర్శించినాను. ఐతే నేను వారిని గురించి విన్నప్పటినుండి వారి స్వరూప స్వభావాలు నా మనసులో ఊహచిత్రం నిర్మించుకున్నాను. నేను మొదటిసారి వారిని దర్శించినప్పుడు నేను ఊహించిన మూర్తియే నా కనుల ముందు ప్రత్యక్షమైనారు.

2. నా వివాహం 24.5.1886 నాడు జరిగింది. వివాహానికి ముందు ఒకసారి స్వామివారిని దర్శించి వారి ఆశీస్సులు పొంది వద్దామనుకున్నాను కాని మా నాయన గారు వీలుపడనీయలేదు. అందువలన స్వామికి పండ్లు పూలు వక్కాకులు కుంకుమపువ్వు మొదలైన పూజాద్రవ్యాలు రైలు పార్సిల్ ద్వారా పంపి వారి ఆశీస్సు లభ్యర్థించినాను. అప్పుడు నారాయణవరంలో స్వామి సన్నిధిలో నా మద్రాసు మిత్రులు కొందరున్నారు. స్వామి వాళ్ళను తమ తమ యిండ్లకు పోవటానికి అనుమతించి తాము కూడ వారివెంట పుత్తూరు దాకా వచ్చినారు. దారిలో ఒకచోట హఠాత్తుగా "పెండ్లి కానుకలు వస్తున్నాయి" అంటూ వాళ్ళను ఆపినారు. 15 నిమిషాల్లో నేను పంపిన పార్సెల్ వారికెదురు పడింది. స్వామివారా పార్సిల్ విప్పించి అందులోనుండి కొద్దిగా తాంబూలాదులు తీసుకొని మిగతా నా మిత్రుడు తోకె నారాయణస్వామి నాయుడుకిచ్చి నాకందించుమనీ "నిర్భయంగా పెండ్లి చేసుకొమ్మను" మనీ ఆశీర్వదించి పంపినారు. ఈ విధంగా నాకు కావలసిన అభయం లభించింది.

3. నా మొదటి దర్శనంలో స్వామివారు వేసిన మొదటిప్రశ్న "నీవు పెండ్లి చేసుకున్నావా?" అని. "మీ ఆజ్ఞ ప్రకారం మీ ఆశీస్సులతో" అని నా సమాధానం. స్వామి నా భుజాలు తట్టినారు. కొలది నిమిషాల తరువాత నదికి స్నానానికై బయలుదేరినారు. నన్ను వెంట రమ్మన్నారు. త్రోవలో ఒక తోపులో భూమిలో పాతిన రాళ్ళను చూపినారు. మా ఇద్దరికి ఈ తీరుగా సంభాషణ జరిగింది

స్వామి - అబ్బాయీ ! ఆ రాళ్ళెందుకు పాతినారు ?

నేను - నాకు తెలియదు స్వామీ !

స్వామి - ఏనుగు కాళ్ళకుండే శృంఖలాలు కట్టటానికి పాతిన రాళ్ళివి.

నేను - కావచ్చు స్వామీ !

స్వామి - ఏనుగెక్కడ ?

నేను - అక్కడైతే లేదు స్వామీ!

స్వామి - ఎందుకు లేదు?

నేను - నాకు తెలియదు స్వామీ!

స్వామి - ఏనుగును సరిగా కట్టి వేయలేదు. గట్టిగా కట్టిన తరువాత గూడ అశ్రద్ధ చేయరాదు. గొలుసులు తెంపుకొని ఏ క్షణాన్నైనా అది పారిపోతుంది. సదా జాగ్రత్తగా ఉండాలె! అబ్బాయీ ఏనుగేది?

నేను - కనబడలేదని ఇదివరకే చెప్పినాను కదా! నదికి పోదాం పదండి స్వామీ!

నదికి పోయి స్నానం చేసిన తరువాత మరల స్వామి 'ఏనుగేది?' అని ప్రశ్నించినారు. "నేనిప్పటికే చాలాసార్లు కనపడటం లేదని చెప్పినాను గదండీ" అంటూ కుట్టుకారు సమాధానం చెప్పినాను. వారు మరల నిదానంగా దయతో "అబ్బాయీ! ఏనుగు ఎక్కడికి పోయి ఉంటుంది?" అని ప్రశ్నించినారు. "స్వామీ, ఇప్పటికే ఆలస్యమైంది. పోదాం పదండి" అన్నాను నేను. మా తిరుగు ప్రయాణం ఆ తోపులోనుండే. రాళ్ళు పాతిన ఆ స్థలానికి చేరగానే స్వామి "ఏనుగేది?" అంటే నేను అశ్రద్ధగా 'లేదు' అన్నాను. స్వామివారు నా కుడిచేయి పట్టుకొని మరల అదే ప్రశ్న వేసినారు. వెంటనే నా ఒడలంతా జల్లుమన్నది. నోట మాట రాక, స్తంభించిపోయి, కన్నీరు కారుస్తూ వారి యెదుట నిలిచిపోయినాను. ఆ స్పర్శతో వారి ప్రశ్నల అభిప్రాయం తెలుసుకున్నాను. సత్యాన్వేషణలో నేను పడిన కష్టాలకు, పొందిన వైఫల్యాలకు అవి సూచకాలు. గంటసేపు చేసే మహోపన్యాసం చెప్పలేనిదాన్ని ఆ స్పర్శ నాకు ఒక్క నిమిషంలో ప్రకటపరచింది.

4. ఒకసారి స్వామివారి యెదుట కూర్చుండి వారు నాకు ఉపదేశం ఎందుకు చేయలేదా అని ఆలోచిస్తున్నాను. వెంటనే స్వామి "అబ్బాయీ! నా ముఖం ఎందుకు చూస్తావు? నీ బిడ్డకు నీవే పాలు కుడుపాలె" అన్నారు. గీతాచార్యుడు చెప్పిన "ఉద్ధరేదాత్మనాత్మానం" (VI- 5) తలపించేదీ మాట.

5. ఒకసారి మిత్రులతో కలిసి స్వామి దర్శనానికి వెళ్ళినాను. సాగిలపడి లేచి (స్వామికి ఈ విధమైన పూజ నచ్చదు. నిశ్చల మానసిక పూజ వారికిష్టం) వారి యెదురుగా కూర్చుండి అప్పుడు నేను ధరించి ఉండిన టోపీలో పెట్టి వారికి కొన్ని నారింజపండ్లు సమర్పించినాను. స్వామివారు ఆ టోపీ పెట్టుకోవాలనుకున్నారు. నేను అందులోని పండ్లు తీసివేసి టోపీ వారికందించినాను. స్వామి టోపీని ఒక్క నిమిషం ధరించి తీసి దానిపైన ఏవో అక్షరాలున్నాయంటూ ఈవిధంగా చదివినారు. "రత్నసభాపతి తమ్ముడు చనిపోయినాడు. ఆతనికి పునర్జన్మ లేదు. ఓహో! రెండు గుఱ్ఱాల బగ్గీ" అంటూ చివరన నవ్వినారు. అప్పుడక్కడ చెంగల్వరాయ మొదలియారు, నారాయణస్వామి నాయుడు మరో యిద్దరుముగ్గురున్నారు. ఎవరికి గూడ స్వామి మాటలు అర్థం కాలేదు. కాని వారి నోటినుండి వెలువడ్డ ప్రతి పలుకు సత్యమని తేలింది. మరునాడు వచ్చిన అంచెలో రత్నసభాపతి పిళ్ళే (రెండవ)భార్య బెంగుళూరులో అదే సమయాన చనిపోయినట్లు వార్త వచ్చింది. భార్యకు మారుగా తమ్ముడని ఎందుకన్నారో నాకర్థం కాలేదు. భార్య తమ్ముని వంటిదని తాత్పర్యమా? ఏడాదిలోగానే రత్నసభాపతి తమ్ముడు కూడ చనిపోయినాడు. రెండు గుఱ్ఱాల బగ్గీ అనే మాటతో రెండో భార్యను సూచించినారో! చివరి నవ్వు అర్థం నాల్గు నెలల్లో రత్నసభాపతి మూడవ పెండ్లి చేసుకోవటానికి సూచకమనుకొంటాను. ఈవిధంగా స్వామి నోట వెలువడిన ప్రతిమాట జరిగి తీరేది. ఐతే ఆ సమయాన ఎవరికి అర్థమయ్యేది కాదు.



6. ఒకనాడుదయం స్వామి దర్శనం కోసం నారాయణవరం బయలు దేరినాను. కాని దారిలో ఆర్కోణం వద్ద ఒక మిత్రుడు బలవంతాన దింపినాడు. నాకు ఉపాహారం తినిపించినాడు. నా మనసంతా స్వామిపైనే ఉంది. మరొక ట్రేన్‌లో నారాయణవరం బయలు దేరినాను. అప్పుడు ఉదయం 9.30 గంటలు. ఆ సమయంలో సన్నిధిలో ఉన్న మిత్రులు స్వామిని ఉపాహారం సేవించటానికి పిలిస్తే వారు పలుకలేదట. మరొక గంట తరువాత పిలిస్తే "అబ్బాయి రానీయండి అందరం కలిసి తిందాం" అన్నారట. మరొక గంట తరువాత పిలిస్తే అదే సమాధానం చెప్పినారట. మరి కాసేపటికి "ఆ బాట చివరన ఒక చింపిరిజుట్టు ఎఱ్ఱవాడు వస్తున్నాడు తోడుకరండి. కలిసి తిందాం" అన్నారట. అప్పుడే నేను చేరుకున్నాను. అప్పుడు 12.30 గంటలైనది. స్వామి నాతో "వచ్చినావా? ఉపాహారం సిద్ధంగా ఉంది. లోనికి పద" అంటూ నడచినారు. వారికి నామీద ఇంత దయ కలగటానికి నేనేమి చేసినాను? వారిని ఒక్కసారి స్మరిస్తే చాలు ఎంత అనుగ్రహం వర్షిస్తారో కదా! తరచుగా స్వామివారు "మీరు నన్ను తలుచుకుంటే నేను మిమ్ముల తలుచుకుంటాను" అంటుంటారు.

శ్రీకృష్ణపరమాత్ముడు "అనన్యాః చింతయంతో మాం" (VIII- 7) భగవద్గీతలో చేసిన బాసలోని పరమార్థం ఇదే.

7. కొన్ని సంవత్సరాల క్రింద మా డాక్టరు నన్ను Vermouth అనే ద్రాక్షాసవం ఔషధంగా సేవించుమన్నాడు. మొదటి సీసా 8 దినాలు రెండో సీసా 4 దినాలు మూడోసీసా రెండు దినాలు నాలుగో సీసా ఒక్కనాడే త్రాగి వేసినాను. మద్యం త్రాగే అలవాటు పెరుగుతున్నదని జాగ్రత్తపడి ఇంకొక సీసా ఉండగానే మానివేసినాను. ఒక నెల తరువాత స్వామిని దర్శించటానికి పోయినపుడు వారు "అయ్యో! త్రాగుబోతువై పోయినావా బాబూ! మేలుకొన్నావులే! జాగ్రత్త" అన్నారు. నూరుమైళ్ళ దూరాన ఉన్న నా చేష్టలు గమనించిన ఆ మహానుభావుని శక్తికి, నాయందు వారికున్న అపారదయకు, ఎప్పుడూ నన్ను కాపాడుతున్న వారి వాత్సల్యానికి ముగ్ధుడనైపోయినాను.

8. స్వామివారు సమాధి చెందటానికి 6 ఏండ్లు పూర్వం ఒక సత్యాన్వేషి తన శంకలు తీర్చగల గురువును వెదుకుతూ కాశీనుండి బయలుదేరి తిరిగి తిరిగి తన అంతఃప్రబోధంతో నారాయణవరం చేరినాడు. స్వామి సన్నిధిలో మూడు వారాలుండి తన శంకలన్నీ తీర్చుకొని వెళ్ళిపోయినాడు. ఇందులోని చిత్రమేమిటంటే స్వామికి తమిళం తప్ప మరేభాష రాదు. కాశీ యోగికి హిందీ తప్ప మరేమీ తెలియదు. మీ శంకలు ఎట్లా తీరినవని నేనడిగితే అతడు "అదే పరమాద్భుత విషయం. నాకు కలిగిన శంకలూ సమస్యలూ ఒకదాని తరువాత ఒకటి ఆ మహాత్ముని సన్నిధిలో అన్నీ విడివడి పోయినవి. ఇంతటి మహానుభావుడీ ప్రాంతంలో ఉంటాడని నేనెన్నడు ఊహించలేదు" అన్నాడు. ఇది అచ్చం దక్షిణామూర్తి మహిమను తలపించే సన్నివేశం.

"చిత్రం వటతరోర్మూలే వృద్ధా శ్శిష్యాః గురుర్యువా
గురోస్తు మౌనం వ్యాఖ్యానం, శిష్యాస్తు చ్ఛిన్నసంశయాః"

9. ఒకనాడుదయం స్వామివారు ఒక ఇంటి అరుగుపై కూర్చుండి చుట్ట త్రాగుతున్నారు. సన్నిధిలో అరవముదు నాయుడు, కటిక పార్థసారథి నాయుడు, నేను ఉన్నాము. చెట్టుమీద ఉన్న రెండు పక్షులను చూపి స్వామి "చూడు! ఒకటి ఊరకే కూర్చుంది, మరొకటి తనకిష్టమైన పండ్లు తింటున్నది" అన్నారు. మాకేమీ అర్థం కాలేదు. కొలది నిమిషాలకు మరికొన్ని దమ్ములు పొగ పీల్చి "ఊరక కూర్చున్నదే పరమాత్మ" అన్నారు. ఐనా మాకర్థం

కాలేదు. ఇది ఋగ్వేదంలోని "ద్వా సుపర్ణా సయుజా సఖాయా" అనే మంత్రార్థమని తరువాత తెలుసుకున్నాను. మిల్టన్ మహాకవి తన 'పారడైజ్ లాస్ట్' కావ్యారంభంలో చెప్పిన పరమార్థం ఇదే. ఇటువంటి పరమపవిత్రమైన ఉపదేశాలు స్వామివారు ఎన్నో చేసినారు.

10. ఒకసారి స్వామి ఒక యింటికి వెళ్ళినారు. ఆ యింటి యజమాని సాగిలపడి ఆశీస్సు లభ్యర్థించినాడు. అతడు త్రాగుబోతు. కోపిష్ఠి . స్వామి ఆతనితో "నీవు చాలా మంచివాడవు. కాని త్రాగుబోతులు ఎదురైతే మానుకొమ్మని చెప్పు" అన్నారు. స్వామి అతనికి శాంతంగా అనునయంగా హితబోధ చేసినారు.

స్వామివారు ఎంతో దూరాన జరిగే సంగతులు కూడ తమ కండ్ల ఎదుట జరుగుతున్నట్లు చెప్పేవారు. ఒకనాడు మధ్యరాత్రి ఒంటిగంటకు స్వామి నన్ను నిద్ర లేపి చుట్ట త్రాగటానికి నిప్పు తెమ్మన్నారు. చుట్ట అంటించి రెండు దమ్ములు పీల్చి "అయ్యో పాపం, ఆమె చచ్చిపోతున్నది. సహాయకులెవ్వరు లేరు. చాలా మంచామె. భిక్షుకుల యెడ దయగల తల్లి! అయ్యో! చచ్చిపాయె" అన్నారు. వారి మాటలకు పూర్తిగా అర్థం తెలియకున్నా ఎవరో స్త్రీ చచ్చినదనుకున్నాను. తెల్లవారిన తరువాత స్వామి తనవెంట నన్ను రెండు మైళ్ళదూరం తీసుకపోయినారు. ఒక కొలనువద్ద ఒక స్త్రీ శవం ఉన్నది. ఆ శవాన్ని చూపుతూ "ఈమె గురించే నేను చెప్పింది" అన్నారు.

ఒకసారి స్పెన్సర్ అండ్ కో డిండిగల్లులో తయారైన 'సీసా' అనే సిగార్ స్వామికి సమర్పించినాను. దానిపై ఒక మహిళ వాలుకుర్చీలో పగటి కునుకు తీస్తున్న ట్రేడుమార్కు బొమ్మ ఉంది. స్వామి అది గమనించి "ఇది నాకు వద్దు, ఇది కాలుపై కాలు వేసుకొని తాగే గొప్పోళ్ళ సిగార్" అన్నారు. స్వామివారు సాధారణుల్లో సాధారణుడు. బజారులో లభించే పొగాకు చుట్టే ఆయనకిష్టం.

స్వామి కరుణాసముద్రు లనటానికి నేను చూచిన రెండు సంఘటనలు చెప్పుతాను. ఒకసారి కాలు విరిగి దీనంగా ఓండ్ర పెడుతున్న గాడిద స్వామికి కనబడింది. స్వామి దాని వెంటబడి ఏదో మందు ఆకు తెచ్చి కాలుకు కట్టు కట్టినారు. నెలదినాలకు పైగా దానికి తిండి తీర్థాలు పెడుతూ కాలు బాగయ్యేదాక సంరక్షించినారు. స్వామి తప్ప మరెవరా జంతువుకు సేవ చేస్తారు? అట్టిది వారి దయాగుణం.

బాగా ముదిరిన కుష్ఠరోగంతో ఒక స్త్రీ చీము నెత్తురులు కారుతుండగా దుర్వాసన కొడుతూ ఒక శిథిల మంటపం మూలన ఉండేది. ఆమెను అందరు ఛీత్కరించే వారు. కనుక ఊళ్ళోకి బిచ్చానికి కూడ పోకపోయేది. స్వామివారు ఆమె పుండ్లు కడిగి, యాచించి తెచ్చిన నువ్వుల నూనె రాసేవారు. మందులు పూసేవారు. తాము భిక్షించి తెచ్చిన మంచి మంచి పదార్థాలు ఆమెకు తినిపించి తాము రాగి సంకటి తినేవారు. అందరూ ఏవగించుకునే ఆ స్త్రీని స్వామివారు ప్రేమతో వాత్సల్యంతో ఆదరించినారంటే వారి దయాగుణం ఎంత దొడ్డదో మనం ఊహించలేము.

స్వామివారు మద్రాసుకు మొదటిసారి **1893** మార్చిలో ఎన్.రత్నసభాపతి పిళ్ళే అమ్మాయి పెండ్లికి వచ్చినారు. తరువాత తోకె వెంకటపతి నాయుడు (చింతాద్రి పేటలో స్వామినాయుడు వీధి) ఇంటికి వెళ్ళినారు. అక్కడినుండి బయలుదేరి మా యింటి ముందునుండి పోతుండగా మిత్రుల ఒత్తిడిపై స్వామివారు మా యింటికి రావలెనని కోరిక కలిగి మనసులోనే ప్రార్థించినాను. మేము ఆహ్వానించగానే స్వామి మా యింట్లో ప్రవేశించి మేడమీదికి పోయి పడకగదిలో ఒకచోటు చూపి తమకు మంచం అక్కడ వేయుమన్నారు. ఆ విధంగా మా యింట్లో ఒకనాడున్నారు. మా యింట్లో స్వామివారు నన్ను అడిగిన మొదటి ప్రశ్న "అబ్బాయీ ! ఇంతకు ముందు ఒకసారి నేనిక్కడికి వచ్చింది నీకు గుర్తు లేదా?" అని, "స్వామీ ! మీరు మద్రాసుకు రావటమే ఇది మొదటిసారి. మా యింటికి దయచేయటం కూడ మొదటిసారి. ఇంతకుముందు మీరిక్కడికి వచ్చినారంటే ఆ మాటలు నాకర్థం కావటం లేదు" అన్నాను. స్వామివారు ఆనాడు పగలు ఇదే ప్రశ్న నేను ఒంటరిగా ఉన్నపుడు రెండుసార్లు వేసినారు. నేను ఇంతకు పూర్వం చెప్పిన సమాధానమే మరల మరల చెప్పినాను. ఆనాడు మధ్యరాత్రి స్వామి చుట్ట కాలుస్తూ మరల అదే ప్రశ్న వేస్తే ఎప్పటి సమాధానమే చెప్పినాను. అప్పుడు స్వామి నాముఖంలోకి చూస్తూ "అబ్బాయీ ! నేనిక్కడ ఉండినాను. దున్నపోతులు కాసేవాడు మంచివాటిని అన్నింటినీ కాస్తాడు. అతనికి చిక్కేవాటినే కాస్తాడు. ఏమి చేయగలడు? పాపం ! జీవుడు" అన్నారు. వివరించకపోతే ఇది ఎవరూ అర్థం చేసుకోలేరు. ఇది కేవలం నా వ్యక్తిగత విషయం. స్వామి ఎంత కారుణ్యమూర్తులో తన బిడ్డలను ఎట్లా రక్షిస్తారో ఏవిధంగా ఆదుకుంటారో తెలిపే సంఘటనమిది. స్వామికి మంచం వేసిన చోటనే **31.1.1893** నాడు మా తండ్రిగారు కన్ను మూసినారు. చివరి క్షణాన నేను వారి నోటిలో తులసి తీర్థం పోసి చెవిలో అష్టాక్షరీమంత్రం చెప్పి సొరకాయల స్వామివారిని తదేకంగా ధ్యానించినాను. ఆ

క్షణాన స్వామి నా యెదుట ప్రత్యక్షమైనారు. ఆ విధంగా నేను మా తండ్రి మరణదుఃఖం అధిగమించినాను. స్వామి అన్నమాటలతో నాటి సంఘటనలన్నీ నాకు గుర్తుకు వచ్చి "ఔను స్వామీ ! ఆనాడు మీ దర్శనమైనది. ఐతే అది నిజమని ఎట్లా అనుకోను?" అన్నాను. స్వామి "అది కాదయ్యా ! నీకు సహాయ పడటానికి ఆ సమయాన నేను ఇక్కడే ఉన్నానయ్యా" అన్నారు. తన ఈ బిడ్డమీద స్వామికి ఎంత దయో! వారి సహాయం లేకపోతే నేను ఆ దుఃఖవార్ధి తరించగలిగేవాడినా?

స్వామి దయకు పాత్రులైనది కేవలం మానవులే కాదు, పశుపక్షి మృగ కీటకాదులు కూడ. సమస్త ప్రాణికోటిపై వారు దయావృష్టి కురిపించినారు. సమానంగా ఆదరించినారు. తమను ఆశ్రయించిన రోగులందరికీ మందులిచ్చినారు. వారిచ్చే మందులు సాధారణమైనవి, చవకైనవి, సులభసాధ్యములు కూడ. నువ్వులనూనె, చింతపండు, కుంకుమపువ్వు, పత్తిగింజలు, వేపాకు, ఉప్పు, క్వాచిత్కంగా ఏదో ఓషధి, అదికూడా ఎక్కడబడితే అక్కడ లభించే మొక్క. ఒక్కొక్కప్పుడు వీధిలోని మట్టి, ఏటినీళ్ళు వారి చేతితో ఇస్తే ఎట్టి రోగాలనైనా నయం చేసేవి. మా సోదరుడు స్వయంగా ఇంగ్లీషు డిగ్రీలున్న డాక్టరు. అతని కాళ్ళు చేతులు పడిపోయినవి. ఎందరో ఇంగ్లీషు డాక్టర్లు మందులిచ్చినా నయం కాలేదు. నెల దినాలు మంచాన ఉన్నాడు. స్వామివారేదో సాధారణమైన ఆకు పేరు చెప్పితే అతని కాళ్ళకు చేతులకు పూసినాము. వెంటనే బాగైనాడు. పరమాద్భుతం.

వారి దయాగుణం, జీవకారుణ్యం, శిష్యుల యెడ, తమను నమ్మినవారి యెడ వారు చూపిన శ్రద్ధ, వాత్సల్యం, వారి అద్భుతశక్తులు, వారి హితోపదేశాలు, మందలింపులు వర్ణనాతీతములు. వారు హఠాత్తుగా దేహం చాలించటం మన దురదృష్టం. వారు లేని లోపం ఎవరూ తీర్చలేరు. వారి ఉపదేశాలు వెలుగు బాటలై మనల సన్మార్గంలో నడిపించుగాక ! వారి రూపం అదృశ్యమైనా వారి దివ్యాత్మ మనల రక్షించుగాక !

## 8. ఎమ్. ఆదికేశవులు నాయుడు.

ఇరవై ఏండ్లకు పూర్వం నారాయణవరంనుండి మాయింటికి తరచుగా వచ్చే బట్టలునేసే పద్మశాలిని సొరకాయలస్వామివారి గురించి అడిగినాను. తనకు 70 ఏండ్ల వయస్సని తన తండ్రి 80 ఏండ్లు బ్రతికినాడని, ఆయనే తన చిన్నతనంనుండి స్వామి వారిని ఎరుగుదు నన్నాడు కనుక ఈ లెక్కన స్వామి వయస్సు 200 ఏండ్లు ఆనాటికే ఉండవచ్చు నన్నాడు.

14 ఏండ్ల క్రింద స్వామి మద్రాసులో తిమ్మప్పనాయుడు ఇంటికి వచ్చినపుడు శివరాజయోగి రాజమ్మాళ్ అనే యోగిని వెంట నేను స్వామిని దర్శించటానికి రాత్రి 8.30 గంటలప్పుడు వెళ్ళినాను. రాత్రి 11.30 దాకా స్వామిని సేవించినాము. ఇక పోవలసిందని అక్కడివారు మాకు సైగ చేసినారు. అది గమనించి స్వామి మావైపు తిరిగి మూడు సైగలు చేసినారు. 1. కండ్లు మూసుకొని మూడువ్రేళ్ళు ఒకటిగా చేసి చూపినారు. 2. తరువాత అన్ని వ్రేళ్లు ముడుచుకున్నారు. 3. తరువాత చేయి విప్పి వ్రేళ్ళను నిలువుగా సాచినారు. వారి భావం గ్రహించి మేము బయటికి నడచినాము. స్వామి చేసిన సైగలకు రాజమ్మాళ్ చెప్పిన అర్థం -

1. చిత్తు అచిత్తు ఈశ్వర -(పతి-పశు-పాశం) మూడింటిని వర్జించటం.
2. ఆ స్థితిలోనే దృఢంగా ఉండటం.
3. పైవాటి మూలంగా శాంతిని మోక్షమును పొందటం.

తొమ్మిదేండ్ల క్రింద చిట్టిబాబునాయుడు (బండ్ల వెంకటపతి నాయుడు Parry & Co దుబాసి) కృష్ణప్పనాయుడు నేను ముగ్గురం కలసి నారాయణవరం వెళ్ళినాము. స్వామికి భిక్షచేసి పూజించినాము. ఒకరి తరువాత ఒకరం స్వామికి సాగిలపడినాము. నేను సాష్టాంగ పడగానే స్వామి నాతో "అమ్మను బొందపెట్టి వచ్చినావు కదూ !" అన్నారు. మేము చెప్పకున్నా రాజమ్మాళ్ దేహం చాలించిన విషయం తమ ఆధ్యాత్మికశక్తి చేత స్వామికి తెలిసిపోయిందని గ్రహించినాను.

## 9. ఓదూరు గంగారెడ్డి, మిరాశిదారు. సుబ్బారెడ్డి కండ్రిగ.

ప్రారబ్ధం అనే ఉదరశూలతో చాలా బాధపడ్డాను. దేశీవైద్యము, ఇంగ్లీషు వైద్యము, దేవతారాధనము, తీర్థసేవనము, దానధర్మాలు చేసినా ప్రారబ్ధం తీరలేదు. నాలుగేండ్లు కొలదిగా పాలుమాత్రమే త్రాగి బ్రతికినాను. సత్సాంగత్యం చేత స్వామివారి మాహాత్మ్యం విని నారాయణవరం వెళ్ళినాను. అప్పుడు స్వామి నారాయణస్వామినాయుడు ఇంటి అరుగుపై పడుకొని ఉన్నారు. అది దత్తాత్రేయాశ్రమం వలె కనపడింది. నేను స్వామికి సాగిలపడి గంటసేపు కూర్చున్నా స్వామి పల్కరించలేదు. స్వామి సేవకుడు కృష్ణపిళ్ళే నన్ను తిట్టినాడు. చిరునవ్వుతో స్వామి నా సంగతి కృష్ణపిళ్ళే నడిగినారు. కడుపునొప్పితో వచ్చినాడని కృష్ణపిళ్ళే స్వామికి నివేదించినాడు. స్వామివారు "ఏటికి పోయి చల్లని నీళ్ళు త్రాగి పొమ్మను" అన్నారు. నేను వెంటనే స్వామి ఆజ్ఞ పాలించినాను. కాని నా కడుపుశూల అధికమైనది. ఐనా నేను స్వామివారినే నమ్మి అక్కడే ఉండి వారిని సేవించినాను. ఒకనాడు స్వామి కనికరించి

ప్రత్తి ఆకురసం త్రాగుమన్నారు. త్రాగిన తరువాత నా శూల క్రమంగా తగ్గుముఖం పట్టింది. మూడవసారి స్వామి "మునగాకు కషాయం వడగట్టి త్రాగు"మన్నారు. నేనట్లేచేసి ఇచ్ఛాపథ్యంగా తింటూ ఏడాది అక్కడే ఉన్నాను. నా మనసు ఇంటిమీదకు పోవటంచేత స్వామివారి సెలవు కోరినాను. స్వామి పోవద్దన్నారు. స్వామిమాట లక్ష్యపెట్టక ఇంటికి పోయి భోజనం చేసిన తరువాత అర్ధరాత్రి మరల ఉదరశూల ఉద్ధృతంగా వచ్చింది. వెంటనే పశ్చాత్తాపంతో స్వామి సన్నిధికి పరుగెత్తి సాష్టాంగపడ్డాను. స్వామి చిరునవ్వుతో "వర్షం బాగా కురిసిందా?" అన్నారు. నేను మాట్లాడలేదు. ఇట్లా 12 దినాలు బాధపడ్డాను. నా బాధ గమనించి ఒకనాడు స్వామి "నల్లేరు పచ్చడి, మిరియాల చారు తీసుకో" అన్నారు. వారి ఆజ్ఞ పాలించినాను. నాటినుండి ఇప్పటికి పదహారేండ్లయినా కడుపునొప్పి జాడలేదు. నేను వేరే మందేమీ తినలేదు. వారు శరీరధారులై ఉండగాను, అశరీరులైన తరువాతను వారు ప్రదర్శించిన అద్భుతాలు వర్ణించటం నా తరం గాదు.

## 10. ములికినాటి లోకశెట్టి ముత్యాలు నాయుడు.

నారాయణవరంలో వేంచేసి ఉన్న శ్రీమాన్ సొరకాయల రామస్వాములవారిని నేను ఆశ్రయించినది కామ్యార్థాలకు. పురుషార్థాలకు, మోక్షార్థానికి కాదు. సుమారు 15 సంవత్సరాలకు పూర్వం స్వాములవారు చెన్నపట్నంలో తిమ్మప్పనాయని ఇంటికి వేంచేసినపుడు ఒకరాత్రి రెండు గంటలదాకా వారి పాదసంవాహనం చేసినాను. అప్పుడు నా మనస్సులో ఈ ప్రపంచానికంతా భగవంతుడొక్కడే కదా! ఇన్ని మతాలెందుకు? ఒక మతానికి మరొక మతానికి వైరుధ్యాలు ఎందుకు ? ఇందులో పరమసత్యమేది ? అసలు దేవుడెవరు? నాకు చెప్పవలసిందిగా స్వామిని మనసులో ప్రార్థించినాను. అప్పుడు నేను పడమటి ముఖంగా కూర్చుండి స్వామి పాదాలు పిసుకుతున్నాను. స్వామి తటాలున లేచి తూర్పుముఖంగా కూర్చుండి ఇట్లా సెలవిచ్చినారు -

1. తాటి చెట్టెక్కే వాడొకడైతే వాని తలదన్నేవాడింకొకడు.

2. నన్ను పాడెలో పెట్టు.

3. తెలిసినవానికి విప్పి చెప్పటమెందుకు ?

4. నగరిలో చింతమానులో దాక్కొని తిండితీర్థాలు లక్ష్యం చేయకుండా ఉన్నవాని కవితావైభవం అధ్యయనం చేయలేదా?

5. మూడు పేర్లు ఉచ్చరించి అందులో ఒక్కరిని చూపుతూ "నా ప్రభువు నా ప్రభువు నా ప్రభువు" అంటూ తమ రొమ్ము మూడుసార్లు తట్టినారు. తరువాత "అదే అంతం"

అంటూ శయనించినారు. నేను మరల స్వామి పాదాలు తట్టితే "చాలురా ! పో!" అన్నారు. స్వామివారు చేసిన ప్రబోధం శ్రీమాన్ పరాంకుశమునులు, పరకాల యతీంద్రులు సాయించిన "ఒక రూపంలో స్వర్ణం వలె, మరొక రూపంలో అగ్నివలె, ఇంకొక రూపంలో సముద్రంవలె, ఈ మూడు ఒకచో కనిపిస్తే మేఘంలోని విద్యుత్‌జ్యోతివలె కనపడేది నా ప్రభురూపమే" పాశురం సారమని గ్రహించి సొరకాయలస్వాములవారిని కారణగురువులుగా సంభావించి వారి తిరువడిఘళ్ళకు భక్తి సలుపుతున్నాను.

## 11. వి. నాదముని మొదలియారు, నల్లివన్ పేట, వెల్లూరు

శ్రీమాన్ సొరకాయల స్వామి సమాజం అధ్యక్షులు ఎన్.రత్నసభాపతి పిళ్ళే కోరిక మేరకు స్వామివారి శిష్యుడుగా నా అనుభవాలు కాలక్రమాన్ని అనుసరించి వ్రాస్తున్నాను.

స్వామివారు చెంగల్పట్టు జిల్లా తిరువళ్ళూరు తాలూకా వెందలూరు గ్రామంలో గొల్లకులంలో పుట్టినట్లు విన్నాను. ఇప్పటికీ వారి బంధువులు అక్కడ ఉన్నారట. స్వామి అసలు పేరు రామస్వామి. ఆయన గొఱ్ఱెలు కాసేవాడు. ఐతే ఏవిధంగా ఎప్పుడు సన్న్యాసిగా మారినాడో తెలియదు. ఆయన వయస్సెంతో సరిగా తెలియదు. 90 ఏండ్లున్నట్లు కనబడతాడు. మద్రాసు కోమలేశ్వరం పేట వాస్తవ్యులు, మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులు ఐన శ్రీనివాస పిళ్ళేగారు 140 ఏండ్ల క్రింద పుత్తూరులో సత్రం కట్టించిన వ్యయం లెక్కల్లో మొదటి అంశం సొరకాయల స్వామివారిని సంప్రదించటానికైన ఖర్చుగా పేర్కొనబడింది. కనుక వారి వయస్సు ఇన్నూరేండ్లకు పైగానే ఉంటుందనుకోవచ్చు. వారు కార్వేటి నగరం జమీందారీలోని నారాయణవరం తమ నివాసంగా చేసుకున్నారు. ఆ ప్రాంతపు 60 ఏండ్ల వృద్ధులు స్వామిని తాము చిన్ననాడు చూచినప్పుడెట్లా ఉన్నారో ఇప్పుడు అట్లాగే ఉన్నారంటారు. సొరకాయ బుఱ్ఱలు భిక్షాపాత్రలుగా ధరించటం చేత వారికా పేరు వచ్చింది. స్వామివారు చింపిరి గుడ్డలు సొరకాయల బుఱ్ఱలు భిక్షాపాత్రలుగా ధరించి జీవన్ముక్తులైన బిచ్చగాని వలె కనిపించేవారు. అవధూతలు బాలోన్మత్త పిశాచవత్‌గా ఉంటారంటారు. స్వామివారిది బాలస్వభావం.

నేను స్వామివారిని 30-8-1880 నుండి వారు దేహం చాలించేదాకా అనగా 9-8-1902 వరకు బాగా గమనించినాను. తిండి విషయమై వారికి ఇష్టానిష్టములు లేవు. నేను చిత్తూరు హైస్కూలులో ఉపాధ్యాయుడుగా ఉండగా 1880 జూలై ప్రాంతంలో ఎన్.రత్న సభాపతి పిళ్ళే తోకె నారాయణస్వామి నాయుడుగార్లద్వారా వారిని గురించి మొదటిసారి విన్నాను. ఆనాటినుండి నేను స్వామివారిని దర్శించినప్పటి విశేషాలు కొన్ని కాలక్రమాన్ని అనుసరించి మనవి చేస్తాను.

1. 30-8-1880 :- మరొక ముగ్గురు మిత్రులతో 29-8-80 నాడు బయలుదేరి పోయి 30-8-80 సాయంకాలం పలంపాకంలో స్వామిని దర్శించినాము. స్వామి ఒక యింటి ఇరుకైన అరుగుపై పడుకొని ఉన్నారు. ఆ రాత్రి వారికెదురుగా నేలపై మేము పడుకున్నాము. మధ్యరాత్రి బాగా వర్షం కురిస్తే ప్రక్కయింట్లో వరండాలో తల దాచుకున్నాము. బయట నా కొత్తబూట్లు తడిసిపోతున్నాయని నా మనసంతా వాటిపైకి పోయింది. వెంటనే స్వామి "అంత కష్టపడి ఇంతదూరం మీరంతా ఎందుకు వచ్చినారు?" అన్నారు. తెల్లవారి స్వామి ప్రక్కవీథిలోని పెద్ద అరుగున్న యింటికి మారినారు. మేము వారిని వెన్నంటి పోయినాము. స్వామి మమ్ముల నుద్దేశించి 1. ఒకనికి ముప్పై 2. రెండోవానికి అరవై 3. మూడోవాడు గొల్ల 4. నాల్గోవాడు గణకుడు అన్నారు. మొదటి ఇద్దరం మొదలియార్లం. అందులో నేను రెండోవాణ్ణి. మొదటివాని జీతం రూ.30/-, నా జీతం అప్పుడు 50/- ఐనా 16 సెప్టెంబర్ నుండి రూ.60/- ఐనది. మూడవవాడు గొల్ల. నాల్గవవాడు కరణం. స్వామి సర్వజ్ఞులనటానికి ఇది మాకు లభించిన మొదటి నిదర్శనం. నా మనసులో రెండు విషయాలనుకున్నాను. అందులో ఒకటి నా ఆధ్యాత్మికప్రగతి గురించి. స్వామి నావైపు చూస్తూ రెండు వ్రేళ్ళు (రెండవది మూడవది) ఊపినారు. దాని భావం నాకు తెలియలేదు. వారి సెలవు పొంది చిత్తూరు చేరినాము.

2. 1880 డిసెంబరు :- ఈసారి నేను, మొదటి తేప నావెంట ఉన్న ఎ.గోపాల కృష్ణ పిళ్ళైతో కలిసి స్వామివారిని నింద్రలో దర్శించినాను. మేము 27-12-80 సాయంకాలం అక్కడికి చేరినాము. ఆ రాత్రి మా వెంట తీసుకపోయిన బ్రెడ్ తిన్నాము. మరునాడుదయం అటుకులు బెల్లం తిన్నాము. పగలు మా మిత్రుడు, స్వామివారు నిరక్షరాస్యులు కనుక పరీక్షించే ఉద్దేశంతో ప్రాణాయామం గురించి ప్రశ్నించినాడు. స్వామి అతని మనసెరిగి నవ్వులాట సమాధానాలే చెప్పినారు. నేను స్వామిని కొన్ని ప్రశ్న లడుగదలచి మా మిత్రుణ్ణి బయటికి పొమ్మన్నాను. అతడు పోయిన తరువాత పోయినసారి స్వామి చేసిన సైగ గురించి అడిగినాను. స్వామివారు నేలపై కొన్ని గీతలు గీసి నాకు Winfred అనే సన్న్యాసి చేసిన బోధలు కొన్ని సవరణలు చేసి చివరి గీతపై తమ వ్రేలుంచి కోటిసూర్యప్రభాభాసురంగా వెలిగే చిత్కళల గురించి వివరించి కుడిచేత తమ నోరు మూసుకొని ఆ స్థితికి చేరిన తరువాత అంతా నిశ్శబ్దమే అన్నట్లు సైగ చేసినారు. మరునాడుదయం వేకువజామున నాల్గుగంటలకు మేము సెలవు కోరితే, "చెరువు వద్ద ఇద్దరున్నారు. వారికి నమస్కరించి పొండి" అన్నారు. అన్నట్టుగానే మాకు రత్నసభాపతి పిళ్ళై తోకె నారాయణస్వామి నాయుడు ఎదురుపడ్డారు. స్వామివారి అద్భుతశక్తులపై నా విశ్వాసం బలపడింది.

1881 మార్చి :- ఈస్టర్ సెలవుల్లో నేను, ఎ. గోపాలకృష్ణ పిళ్ళై చిత్తూరు నుండి బయలుదేరి నారాయణవరం నదికి అటువైపున్న కీలగరం గ్రామంలో స్వామిని దర్శించినాము. ఆరణినుండి రత్నసభాపతి పిళ్ళై, నారాయణస్వామి నాయుడు అదివరకే వచ్చినారు. స్వామి తమ మాసిన గుడ్డలు ఉతకటానికి వేస్తే చాకలి వాటిని పేలికలు చేసి తెచ్చినాడు. స్వామి కోపం నటిస్తూ "ఇక్కడ చాకలితో పోట్లాట. అక్కడ కూడా అంతేనా?" అని నాతో అన్నారు. కొలది దినాలకు పూర్వమే నేను నా చాకలిని తొలగించినాను. స్వామివారిని సేవించటానికి ఆనాడు చాలామంది ఆ గ్రామంవాళ్ళు వచ్చినారు.తమ సొరకాయ బుఱ్ఱలో నుండి స్వామి కొందరికి మాత్రమే ఏవో తినే గింజలిచ్చినారు. నాకు ఇచ్చినారు. మిగతావాళ్ళు పులుకు పులుకున చూస్తుంటే స్వామి "మీ కివ్వలేదని కోపం చెందకండి. ఆ గింజలు చవిటి నేలలో మొలకెత్తవు. సారవంతమైన భూమిలో వేస్తేనే చెట్లు మొలచి ఫలిస్తా"యని గూఢంగా అన్నారు.

1881 మే :- ఈసారి నేనొక్కడినే బయలుదేరి మరునాడు స్వామివారిని ఒక గ్రామంలో దర్శించినాను. స్వామి వెంట ఉండే వృద్ధుడు ఒక బ్రాహ్మణాగ్రహారానికి పోదామన్నాడు. కడచిన రాత్రి నేనేమీ తినలేదు కనుక అందరం సొరంబాకం వెళ్ళినాము. అక్కడ ఒక బ్రాహ్మల ఇంట్లో నా భోజనానికి ఏర్పాటు చేసుకున్నాను. అక్కడుండగా స్వామి నన్ను "కాకి చెట్టెక్కుతుందా?" అని ప్రశ్నించినారు. మీరు అంతపని చేయించగలరనే విశ్వాసంతోనే మిమ్ముల ఆశ్రయించినానన్నాను. ఆధ్యాత్మికప్రగతిలో మహాత్ముడైన సద్గురువు తన శిష్యుని కోసం ఏదైనా చేయగలడని అప్పటి నా విశ్వాసం. కాని మరొకసారి స్వామి సన్నిధికి పోయినప్పుడు నా అభిప్రాయం సరికాదని తేలింది. స్వామి "చెట్టెక్కేవాణ్ణి ఎంతవరకు ఎక్కించగలం? ప్రతివాడు తానై కృషి చేసి తన పాటుకు తగిన ఫలం అనుభవించాలె" అన్నారు.

డిసెంబరు 1881 :- నేను నా మిత్రుడు ఎ.గోపాలకృష్ణ పిళ్ళై ఒక అపరాహ్ణం పుత్తూరునుండి బయలుదేరి ఆ రాత్రి ఒక గ్రామంలో నిద్రించి తెల్లవారి మెత్తకండ్రిగ చేరినాము. స్వామి అక్కడ లేరు. ప్రక్క ఊరిలో ఉన్నారని, ఆ పూట అక్కడే నిలిచిపోయి మేము వస్తున్నట్లు స్వామి సేవకునికి తెలియపరచవలసిందిగా మాతో ఉన్న వెట్టివాణ్ణి ముందుగా పంపినాము. వంట చేసుకొని భోజనాలు ముగించి నీలిమందు గిడ్డంగి సమీపంలో విశ్రాంతులమై ఉండగా అల్లంత దూరాన ఎవరో వస్తున్నట్లు కనపడింది. ముందుగా మా స్నేహితులు అటు తరువాత స్వామివారు వచ్చినారు. మరునాడు అక్కడే ఉండి మూడవనాడు

స్వామితో కూడ అందరం రామగిరి చేరినాము. అక్కడికి అరమైలు దూరాన కొండ చరియ క్రింద శివాలయం ఉన్నది. కొండనీరు నందీశ్వరుని ముఖోద్గతమై చెరువులోకి పోతుంది. ఆలయ మంటపంలో స్వామివారు వారిచుట్టు మేము అర్ధచంద్రాకృతిలో కూర్చున్నాము. నన్ను చూస్తూ 21-10-80 నాడు చనిపోయిన నా కొడుకు నుద్దేశించి "పోయినవాడు వస్తాడా? నేనేం చేయగలను? వాని ప్రారబ్ధం అంతే" అంటూ కంట తడి పెట్టుకొని లేచి పోయినారు. అక్కడ స్వామివారికి పూలు కర్పూరహారతి సమర్పించి కొప్పేడు మీదుగా మా స్థలాలకు తిరిగి పోయినాము.

మే 1882 :- నాకు చిత్తూరునుండి మార్పు జరిగినందున వాలాజపేటలో ఉంటున్నాను. నేను దివాన్ బహద్దరు రామస్వామి నాయుడు, మా అమ్మ, పిన్నమ్మ పుత్తూరు మీదుగా నారాయణవరం పోతే స్వామి అక్కడ లేరు. అక్కడ నుండి కొప్పేడుకు వెళ్ళినాము. కొలది దినాలముందే స్వామి అక్కడినుండి వెళ్ళిపోయినారట. ఆనాడు మేము కొప్పేడులో చెంగల్వరాయ నాయుడింట్లో ఆగినాము. స్వామి ఆ వూరు విడిచే ముందు తన బావి చుట్టు తిరుగుతూ లబలబ మొత్తుకున్నారనీ, స్వామి వెళ్ళిపోయిన తరువాత ఎదిగిన తమ కూతురు ఆ బావిలో పడి చనిపోయినదనీ నాయుడు చెప్పినాడు. మేము నారాయణవరం తిరిగి వచ్చినాము. కాళహస్తిలో ఉన్నారని తెలిసి అక్కడికి పోతే అక్కడ కూడ లేరు. స్వామిని దర్శించకుండా పోయింది ఈ ఒక్కసారే.

మార్చి 1883 :- ఈస్టర్ సెలవుల్లో కాళహస్తి తిరుపతి క్షేత్రాలు దర్శించి నారాయణ వరం దాటి కొప్పేడులో చెంగల్వరాయ నాయుడింట్లో స్వామిని దర్శించినాను. స్వామి "కొందరు దొంగతనంగా నా జడలు తీసుకపోతున్నారు. నీకు కావలసినన్ని నీవు తీసుకో కాని నీళ్ళల్లో వేయకు" అన్నారు. లాల్‌పేట దొరస్వామి నాయుడు స్వామికి తెలియకుండా వారి జడలు తెచ్చుకున్నానని నాతో చెప్పినాడు. స్వామి అనుమతితో నేను తెచ్చుకున్న జడలు సిల్కుగుడ్డలో భద్రపరచినాను.

అక్టోబరు 1883 :- ఈసారి రామగిరిలో అదే మందిరంలో స్వామిని దర్శించినాను. స్వామి నాతో "నీవెక్కడున్నా నిరంతరం నీ వెంటే ఉంటాను" అన్నారు. ఈ పర్యటనలో నేను ఒక అధ్యాపకుడిచ్చిన రెండు వంటచెఱకు మోపులు కూరగాయలు తీసుకున్నాను. అది గమనించి స్వామి "నీవు ఇవన్నీ కొన్నావు. నేనేమో భోంచేసినాను" అన్నారు. ఎంత చిన్నవైనా ఎవరినుండీ కానుకలు తీసుకోరాదని గుణపాఠం. నా జీవితంలో ఎవరినుండీ ఎన్నడు కూడ పూచికపుల్లయినా తీసుకోలేదు.

డిసెంబరు 1887 :- నేను సేలంలో ఉంటున్న దినాలవి. నేను ఒక సేలం మిత్రుడు స్వామిని నాగలాపురంలో దర్శించి రామగిరి మందిరానికి తోడ్కొని పోయినాము. స్వామివారికి స్నానం చేయించి నేను తీసుకపోయిన కొత్తబట్టలు కట్టించినాము. వారి పాతగుడ్డలు, కౌపీనము కొలనులో ఉతుకుతూ స్వామివలె నేనెపుడు కాగలనా అని మనసులో అనుకున్నాను. కొలనుగట్టున నిల్చిన స్వామి నా మనసెరిగి "తొందరపడకు ! కామక్రోధాలకు వశులైనవారు వల్లకాటికి అధిపతులైనారు. శాంతులు దాంతులు రాజ్యాధిపతులైనారు" అన్నారు. ఇది కౌరవ పాండవుల కథ.

సెప్టెంబరు 1888 :- ఈ సమయంలో నన్ను వాలాజపేటకు మార్చినారు. నారాయణవరం నా పరిధిలోనిదే. స్వామిని నింద్రలో దర్శించినాను. నా మిత్రుడు హెచ్.ఎమ్.విన్‌ఫ్రెడ్ తిరుచునాపల్లిలో రోగగ్రస్తుడై ఉండి తనకెవరో ప్రయోగం చేసినారని స్వామివారి నడుగుమని నాకు జాబు వ్రాసినాడు. నేను స్వామి యెదుట నిలువగానే స్వామి కన్నీరు కార్చినారు. నేనా విషయం ఎత్తనేలేదు. నేను తిరుత్తణి చేరేవరకే మిత్రుని మరణవార్త తెలిపే జాబు వచ్చింది.

మార్చి 1889 :- కొప్పేడులో స్వామిని దర్శించి ఒకనాడు వారి సన్నిధిలో ఉన్నాను. స్వామి నన్ను చూసి "ఓ యెముకలేని కీటకమా!" అన్నారు. స్వామికి మాంసాహారం కావలెనేమో అని అడిగినాను. తమకోసం కాదన్నారు. స్వామి వెంట ఉన్న ఒక నల్ల మొద్దు వంటి మనిషి స్వామి మాంసాహారం ఇష్టపడుతున్నారన్నాడు. నేనాతనికే రెండు మూడు రూపాయలిచ్చి మాంసాహారం తెప్పించి పెట్టుమని చెప్పి వెళ్ళిపోయినాను. కొన్ని దినాల తరువాత వాలాజ చేరినాను. అక్కడ నిష్కారణంగా బలహీనుడనై పోయినాను. నేనెప్పుడు శాకాహారినే కాని ఆ సమయాన మా తల్లి, మిత్రులు, డాక్టర్లు బలవంతాన మాంసాహారం తినిపించినారు. ఆనాడు స్వామి నా విషయమే సూచించినారు కాబోలు. స్వామి మాంసాహారి కాదు గదా!

మార్చి 1890 :- కొప్పేడు సమీప గ్రామంలో స్వామిని దర్శించినాను. అప్పుడు వెల్లూరులో మా తాతగారు అస్వస్థులుగా ఉండిరి. నేనా విషయమే ఎత్తలేదు. స్వామి నాతో "అక్కడ పెండ్లి జరిగి పోయింది" అన్నారు. నారాయణవరం చేరేసరికి మా తాతగారు చనిపోయిన వార్త వచ్చింది. స్వామివారి వింతభాష ఇది.

**1891** :- ఒకసారి స్వామిని దర్శించినపుడు నా పెద్దకూతురును మా మేనమామ కొడుక్కు ఇచ్చి పెండ్లి చేయవచ్చునా అని అడిగితే స్వామి పలుకలేదు. రెండు మూడు సార్లు అడిగినాను. సోదరీపుత్రుడైతే ఇవ్వవచ్చునన్నారు. పరిస్థితుల ప్రాబల్యం వల్ల అమ్మాయిని మా బావమరిదికే ఇవ్వవలసి వచ్చింది. తత్ఫలితంగా నానా అగచాట్లు పడుతున్నాను.

**6-11-1892** :- చంద్రగ్రహణం నాడు స్వామివారిని నారాయణవరంలో దర్శించినాను. ఎప్పటివలె ఆ రాత్రి స్వామి చెంత పడుకోవలెననుకున్నాను. కాని స్వామి అనుమతించలేదు. ఎదురింటి అరుగుపై పడుకోమన్నారు. నేను పోకపోతే "పో, అది నీ అత్తవారింటి అరుగు" అన్నారు. ఐనా నేను పోలేదు. స్వామి కోపంతో తమ ఆజ్ఞ వెంటనే పాటించవలె నన్నారు. తమ మీసాలు గడ్డం చూపుతూ " నా వెంట్రుకలన్నీ నెరసినాయి కాని నీవి నల్లగా ఉన్నా" యన్నారు. నన్ను వెల్లూరుకు బదిలీ చేస్తూ **27-4-93** ఉత్తరువులు వచ్చినవి. వెల్లూరు మా అత్తవారూరు.

**1895** :- ఒకసారి స్వామి వెంట నేనున్నాను. స్వామి కుడిపిడికిలితో తమ కడుపు రెండు వైపుల మెల్లగా గుద్దుకుంటూ దయనీయంగా ముఖం పెట్టినారు. నాకు అర్థం కాలేదు. అదే సమయాన వెల్లూరులో మా అమ్మాయి దినాలు తక్కువ శిశువును సునాయాసంగా కన్నట్లు ఇంటికి పోయిన తరువాత తెలిసింది.

డి.పి.ఐ.గారి పి.ఎ. తనను స్వామి సన్నిధికి తోడ్కొని పోవలసిందిగా కోరినాడు. ఆ సమయాన స్వామి మద్రాసుకు వచ్చి చింతాద్రిపేటలో ఉన్నారు. స్వామివారి దర్శనానికి చాలామంది గుమిగూడినారు. భోజనానికి ముందు కాళ్ళు చేతులు కడుక్కోవటానికి స్వామి పెరటిలోనికి పోయి మా మిత్రుని చూచి దగ్గరికి పిల్చుకున్నారు. స్వామి అక్కడున్న తులసిచెట్టును చూపి ఇది నీకు తెలుసునా అంటే అతడు తెలుసునన్నాడు. "మీ యింట్లో ఈ చెట్లు వరుసగా ఉన్నాయి కదూ!" అన్నారు. స్వామివారి సర్వజ్ఞత్వానికి ఆతడు ఆశ్చర్యపోయినాడు. అతడు స్వామివారిని ఆశ్రయించటానికి గొప్ప కారణం ఉంది. అతని భార్యను కలల్లో పాములు కరుస్తుంటాయి. ఆమెకు నిద్ర పట్టదు. భయంతో అజీర్తితో చిక్కిపోతున్నది. దీనికేమైనా నిరవారణోపాయం చెప్పుతారేమో అని అతడు స్వామి దర్శనానికి వచ్చినాడు. అతడు తన మనసులోని మాట చెప్పకుండానే స్వామి "తులసి ఆకులు చక్కెరలో కలిపి నీ భార్యకు తినిపించు. ఇక పాములు కరువవు" అన్నారు. అతనికి స్వామివారి మాటల్లో విశ్వాసం కలిగి అట్లాగే చేసినాడు. భార్యకు ఆరోగ్యం కలిగింది.

## 12. వి.యతిరాజులు నాయుడు, బెంచిక్లార్కు, స్మాల్‌కాజ్ కోర్టు, మద్రాసు

1871లో మా మేనమామ వీరాస్వామి నాయుడు కార్వేటి నగరం తహసీల్దారుగా ఉన్నపుడు కడప జిల్లా సిద్ధకోన నుండి అప్పుడప్పుడు కార్వేటి నగరం జమీందారీ ప్రాంతాలకు వచ్చే సొరకాయల స్వామివారి గురించి విన్నాను. ఈ సిద్ధకోనకు శివరాత్రులప్పుడు మాత్రమే జనులు పోతుంటారు. అక్కడ నవసిద్ధుల మందిరం ఉంది. ఆ ప్రాంతం దట్టపుటడవులతో, కొండ కోనలతో సుందరంగా ఉంటుంది. మా తండ్రిగారు ఇటువంటి మహాత్ములు ఎక్కడున్నా దర్శించేవారు. వారి వెంట పోతున్న నాకు మహాత్ములంటే భక్తి ధ్యానము అలవడ్డాయి. మా మేనమామ ఎప్పుడూ పొగడుతుండిన సొరకాయల స్వామిపై నాకు భక్తి కుదిరింది. వారిని సదా ధ్యానించేవాడను. 1889లో రాత్రి 12 గంటలకు మా తోటలో నన్ను కుడికాలుపై నాగుపాము కరిచింది. నేను వెంటనే సొరకాయల స్వామిని ధ్యానించినాను. స్వామి ప్రత్యక్షమై నావీపు తట్టినారు. ఆ రాత్రి ఈ విధంగా రెండుసార్లు స్వామి ప్రత్యక్షమైనారు. స్వామిని నేను ప్రత్యక్షంగా దర్శించకముందే జరిగిన సంఘటన ఇది. పాము విషం విరిగిందని వేరే చెప్పనక్కరలేదు కదా! ఆనాటినుండి స్వామివారియందు నా భక్తివిశ్వాసములు ఇనుమడించినాయి. మా ద్వితీయ సోదరి ఎం.కనకమ్మ కలలో ఎవరో మహాత్ముడు నన్ను దీవిస్తున్నట్లు దర్శనమిచ్చినారట. స్వామివారు మా యింటికి వచ్చిననాడు వారిని ప్రథమంగా చూచిన మా సోదరి తాను కలలో దర్శించినది ఈ మహాత్మున్నే అన్నది. 1896 సంవత్సరంలో ఒకనాడు నేను స్నానాల గదిలో ఉండగా ఎం.రామయ్య నాయుడు వచ్చి పుత్తూరు స్వామివారు మద్రాసుకు వచ్చి కె.పార్థసారథి నాయుడు గారింట్లో ఉన్నారనీ నన్ను తోడ్కొని రమ్మన్నారనీ చెప్పినాడు. నేను ఇంతకు పూర్వమే డి.అరవముదు నాయుడును స్వామివారితో నాకు పరిచయం చేయించవలసిందిగా ప్రార్థించి ఉంటిని. ఇప్పుడు అరవముదు నాయుడు స్వామి సన్నిధిలో ఉండి నన్ను జ్ఞాపకం చేసుకోగానే స్వామి "పో నీకిష్టమైతే తీసుకరా పో"! అన్నారట. రామయ్యానాయుడు ఈ మాటలు నవ్వులాట కంటున్నాడనుకొని 15 నిమిషాలు వాదించి ఆయనవెంట పార్థసారథి నాయుడింటికి పోతే నిజంగానే స్వామి ఉన్నారు. ఇదే వారి ప్రథమ దర్శనం కనుక వారికి ప్రదక్షిణించి పాదాలవద్ద నిలిచి ధ్యానంలోకి వెళ్ళిపోయినాను. కనులు మూసుకొని నిద్రపోతున్న స్వామి ఒక్కుమ్మడిగా లేచి "నీకు నేనిచ్చే ఉద్యోగం ఇదే" అన్నారు. నేను స్వామిని అదేవిధంగా ధ్యానించటమే నా సేవ అని అర్థం చేసుకున్నాను.

ఆనాటినుండి నేను తరచుగా నారాయణవరంలో లేదా స్వామి ఎక్కడుంటే అక్కడ దర్శించేవాడిని. ఒకనాడు 1900 సంవత్సరంలో నారాయణవరం పోతే స్వామి అక్కడ

లేరు. అక్కడికి 12 మైళ్ళ దూరాన నింద్రలో ఉన్నారు. స్వామిని దర్శించే ప్రగాఢ వాంఛతో సాయం నాలుగు గంటలకు అక్కడినుండి బయలుదేరినాను. ఒక మైలు నడవగానే స్వామిని దర్శించి తిరిగివస్తున్న బి.నమ్మయ్యనాయుడు, కె.పార్థసారథి నాయుడు డి.అరవముదు నాయుడు ఎదురుపడి చీకటివేళ అడవి ప్రయాణం చేయవద్దని నన్ను నారాయణవరం తీసుక వచ్చినారు. నాకేమో స్వామిని ఎట్లాగైనా ఈ రాత్రి దర్శించవలెనని ప్రబలమైన కోరిక కలిగింది. సాయంకాలం 5 గంటలకు మళ్ళీ బయలుదేరినాను. రాత్రి 9 గంటల వేళ అడవిబాట, అందులో వర్షం పడుతుండటం చేత నేను త్రోవ తప్పినాను. ఎటూ తోచక స్వామిని తలచు కున్నాను. హఠాత్తుగా గొప్ప వెలుతురు వచ్చి 15 నిమిషాలున్నది. నేను సరియైన త్రోవలో పడ్డాను. ఒక మైలు నడచినాను. ఇట్లా నా ప్రయాణంలో రెండుసార్లు వెలుతురు వచ్చి నా దారి సుగమం చేసింది. రాత్రి 11 గంటలకు స్వామి సన్నిధికి చేరుకున్నాను. స్వామి చుట్టున్నవాళ్ళంతా నన్ను చూచి ఆశ్చర్యపోయినారు. స్వామికి సాష్టాంగపడి ఎదుట నిలిచినాను. స్వామి సంతోషించినారు. స్వామి తమ సేవకుడు ఎం.పురుషోత్తమ నాయుడుతో నాకు కాళ్ళుచేతులు కడుక్కోవటానికి నీళ్ళిమ్మన్నారు. నా కాళ్ళు రక్తం కారుతున్నాయి. భోజనానంతరం స్వామి సన్నిధిలో పడుకున్నాను. తెల్లవారి 5 గంటలకే స్వామి నన్ను ఒక కొలనుకు తోడ్కొనిపోయి స్నానం చేయించినారు. నా బడలికంతా చేతితో తీసివేసినట్లు పోయింది. ఆనాటినుండి స్వామిని అవతార పురుషులుగా శ్రీకృష్ణ పరమాత్ముని అవతారంగా కొలుస్తున్నాను.

1902 సంవత్సరం ప్రారంభంలో స్వామి తిరువళ్ళిక్కేణి బారి తిమ్మప్ప నాయుడు తోటలో ఉండగా ఒకరాత్రి నేను డి.వి.రామానుజులు నాయుడు, కె. పార్థసారథినాయుడు, సి.వెంకటస్వామి నాయుడు, బి.నమ్మయ్యనాయుడు మరికొందరు స్వామి సన్నిధిలో కూర్చున్నాము. స్వామి ఎవరితోనో మాట్లాడుతూ, తాము కొంతకాలం వటవృక్షం తొఱ్ఱలో ఉంటూ అడవుల్లో తిరుగుతున్నప్పుడే తిరుత్తణి కొండపైనా, తిరువళ్ళూరులోనూ మందిరాల నిర్మాణం జరిగిందన్నారు. మద్రాసులో 1896లో నేను స్వామిని ప్రథమంగా దర్శించిన కొలది మాసాలకే స్వామివారిని జార్జిటౌన్, గోవిందప్ప నాయుడు వీథిలో ఉన్న మా యింటికి రమ్మని ప్రార్థించినాను. స్వామి మా ఇంట్లో రెండు దినాలున్నారు. మొదటిరాత్రి మా అక్క, సుబ్బరావమ్మ (సి.విజయరాఘవులు నాయుడు, మద్రాసు హైకోర్టు సాలిసిటర్ తల్లి) స్వామివారి వయస్సు తెలుసుకోగోరి ప్రక్కనున్నవాళ్ళ నడిగింది. వెంటనే "ఇప్పుడు నా వయస్సు 500 ఏండ్లు. నేనిక్కడే ఉండిపోతే ఇతర చోట్లకు ఎట్లా పోగలను?" అన్నారు. దీని అర్థం ఏమిటో? తాము చాలాకాలం జీవించినామని ఇక ఈ తనువును

చాలించవలెననే అర్థమా! (అన్నట్లే కొలది మాసాలకే స్వామివారు పరమపదించినారు) లేదా - మా అక్క కోరికను తీర్చటానికి నిజమైన సమాధానం చెప్పినారా?

## 13. ఎన్.దేవశిఖామణి మొదలియార్, కడలూరు

నేను క్రీ.శ. 1891-1896 సంవత్సరాల మధ్య ఉత్తర ఆర్కాడు జిల్లా పాఠశాలల అసిస్టెంట్ ఇన్స్పెక్టర్‌గా ఉన్నపుడు పుత్తూరువైపు పోయినప్పుడల్లా సొరకాయల స్వామివారిని దర్శించేవాణ్ణి. ఆయన సర్వజ్ఞులు. ఎంతో దూరంలో జరిగే విషయాలు కూడ వారికి తెలుసు. నేనెరిగిన ఒక సంఘటన మనవి చేస్తాను. నా మిత్రుడు బి. కృష్ణయ్యరు నిమోనియాతో వెల్లూరు ఆస్పత్రిలో పడిఉండగా ఒకసారి నేను వి.నాదముని మొదలియారు నారాయణవరం అపరాహ్ణం చేరినాము. స్వామిని దర్శించి ఆ రాత్రి మా బసకు భోజనానికి ఆహ్వానించినాము. కృష్ణయ్యరు ఆరోగ్యంకోసమని స్వామికి భిక్ష చేద్దామనుకున్నాము కాని స్వామి మేమేమి చెప్పకుండానే "చావుకూడు నేను తినను" అన్నారు. మేమిద్దరం నదివైపు వాహ్యాళికి పోతుండగా ఆ ఉదయమే కృష్ణయ్యరు మరణించినట్లు టెలిగ్రామ్ అందింది. మేము తిరిగి స్వామి వద్దకు పోగానే వారు "ఆ బ్రాహ్మణుడు మరణించినాడు. చింతించి ప్రయోజనం లేదు" అన్నారు.

1894 ఈస్టర్ సెలవుల్లో సొరకాయల స్వామివారు చింతాద్రి పేటలో ఉన్నట్లు విని వారిని మా గురువులు కీ.శే.భగవంతుల సమాధి మందిరానికి తీసుకపోవలె ననుకున్నాను. ఆ సాయంకాలం వారున్నచోటుకు పోయి శ్రీమంతులైన భక్తులు మహా వైభవంగా స్వామివారిని సేవించటం చూచి నావంటి పేదవాని ఆహ్వానం అంగీకరిస్తారో లేదో అని ఊరుకున్నాను. మరునాడు ధనికులు పెద్దలు తమ తమ ఇండ్లకు స్వామిని రమ్మని కోరుతుండగా నా పేదకోరిక కూడ ప్రకటించినాను. వెంటనే స్వామి తమ మూటముల్లె కుక్కను తీసుకొని మా నివాసానికి బయలు దేరవలసిందిగా తమ అనుచరులను ఆదేశించినారు. గుఱ్ఱపు కోచీలో బయలుదేరి త్రోవలో దివాన్ బహద్దర్ రాజరత్నం మొదలియారు ఇంట్లో పానీయం త్రాగి స్వామివారు మా ఇంటికి వచ్చినారు. స్వామికి స్వామివెంట ఉన్నవారికి ఇతర భక్తులకు నేను రెండు విందులు చేసినాను. స్వామి మా యింట మూడు దినాలున్నారు. శ్రీమంతులైన భక్తులు విలువైన ఖాద్య పదార్థాలు తెచ్చేవారు. పూటకు తొంబదిమంది భోజనం చేసేవారు. పగటిపూట మాత్రమే ఇతర భక్తులు స్వామితో తింటారు. రాత్రి స్వామి భోజనం మా ఇంటనే. స్వామిని కడలూరులో మా ఇంటికి రమ్మని కోరినాను. స్వామి పలుకలేదు. కడలూరులో మా అమ్మాయి మూర్ఛ రోగంతో

బాధపడుతున్నది. స్వామివారు ఆ అమ్మాయిని చూస్తే బాగుండునని నా కోరిక. ఆనాడు సాయంకాలం కడలూరు పోదామని స్వామిని మరల కోరినాను. స్వామి వెంటనే అంగీకరించినారు. ఒక ప్రత్యేక రైలుబోగీలో ప్రయాణం చేసి అందరం రాత్రి 11 గంటలకు మా గురుదేవులు శ్రీ భగవంతుల మఠం చేరినాము. మా గురువు భగవంతులు నూరేండ్లకు పైన బ్రతికిన త్రికాలజ్ఞులు. స్వామివారు మా గురువుల సమాధి చూడగానే "ఓ ప్రియసఖా! ఓ దేవదూతా! నీ జీవితంలో ఎన్ని పర్వతాలు చుట్టినావు! ఎన్ని అడవులు తిరిగినావు! ఎన్ని గుహల్లో నివసించినావు! ఇన్ని చుట్టివచ్చి చివరకు ఇక్కడ నిలిచి పోయినావా? నీవీచోటు విడిచిపోయినావని కొందరనుకుంటున్నారు. ఇంతకుపూర్వం ఆడుతూ రంకెలు వేస్తూ పరుగెత్తుతూ, తిరుగుతూ, మేస్తుండే నందీశ్వరుడు ఇపుడు పడుకొని చూస్తున్నాడు. నీ సమాధి ఏడుకొండలవాని గుడికంటే ప్రఖ్యాతం ఔగాక!" అన్నారు. స్వామివారు మా భగవంతదేవులు సూక్ష్మశరీరంలో ఇంకా తిరుగుతున్నారని అన్నారు. మరునాడు మా అమ్మాయిని చూపించినాను. స్వామిని చూడగానే అమ్మాయికి మూర్ఛలు వచ్చినాయి. స్వామి అమ్మాయి నోటిలో పదే పదే విభూతి వేసినారు. స్వామి కడలూరులో ఉన్న వారం దినాలు మా అమ్మాయి పట్ల ఎంతో శ్రద్ధ చూపినారు. ఆనాటినుండి జబ్బు తగ్గుముఖం పట్టి నెలదినాల్లో పూర్తిగా నయమైపోయింది. చివరినాడు ఊరంతా తిరిగి నేను దారి చూపకుండానే స్వామి మా యింటికి వచ్చినారు.

## 14. డా॥ సి. వీరరాఘవరావు, మద్రాసు

నేను 1895లో సొరకాయల స్వామిని నారాయణవరంలో దర్శించి నాలుగు మాసాలు వారి సన్నిధిలో ఉన్నాను. ఈ కాలంలో ఎందరో స్వామిని దర్శించవచ్చి వారి భక్త్యనుసారం, శ్రద్ధానుసారం స్వామినుండి భవిష్యద్వార్తలు ఆశీస్సులు పొందినారు. 1901 దాకా చాలాసార్లు నాకు శంకలు కలిగినప్పుడల్లా స్వామివారి ఆదేశాలు పొందినాను. స్వామి 70 ఏండ్ల వృద్ధుల వలె కనబడేవారు. కాని తొంభై ఏండ్ల వృద్ధులు తాము చిన్ననాడు చూచినట్లే స్వామి ఇప్పటికీ అట్లాగే ఉన్నారన్నారు. కనుక స్వామి వయసెంతో తెలియదు.

నేను స్వామి సన్నిధిలో ఉండగా ఒకనాడు మా ఇంటినుండి జాబు వచ్చింది. పోస్టాఫీసులోనే ఆ జాబు తెరచి చూచినాను. మా చిన్నబ్బాయి తీవ్రంగా జబ్బు పడ్డాడని అందులోని వార్త. చిన్నబోయిన ముఖంతో స్వామి సన్నిధికి వెళ్ళినాను. విశ్రాంతులుగా కూర్చున్న స్వామి వెంటనే లేచి తమ కాళ్ళు చాచిన ఊతకఱ్ఱకు కట్టిఉన్న నీలిదారం విప్పి "ఇది శిశువు చేతికి కడితే బాగవుతాడు" అన్నారు. నాలుగు దినాల తరువాత మా అబ్బాయికి నయమైనట్లు వార్త

వచ్చింది. స్వామివారు నాకు రాబోయే మంచిచెడుగులు కలలో కనబడి చెప్పేవారు. ఒకసారి స్వామి ఆజ్ఞ ప్రకారం పచ్చి మంచినీళ్ళు ఇస్తే మా అబ్బాయికి తీవ్రజ్వరం తగ్గిపోయింది. స్వామివారు నిత్యాగ్నిహోత్రి. వారిచ్చే విభూతితో దయ్యాలు భూతాలు సోకినవారికి నయమయ్యేది.

నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకా రామాయపట్నంలో నాకు లావా దేవీలు ఉన్న దినాల్లో నేను తారకయోగం సాధన చేస్తుండగా ఒక సాయంకాలం ఏడున్నర గంటలకు నాభివద్ద కుండలి మండుతున్నట్లనిపించింది. నేను వెంటనే భోంచేసి పడుకున్నాను. అపుడు రాత్రి ఎనిమిది గంటల సమయం. నేను నిద్రలోకి జారేముందు గాలిలో తేలుతూ నారాయణవరం పోతున్నట్లనిపించింది. స్వామివారు ప్రత్యక్షమైతే నేను సాష్టాంగపడ్డాను. వారు నన్ను కౌగిలించుకొని ఒక విశ్రాంతి స్థలానికి తీసుకపోయినారు. అక్కడికి చేరిన తరువాత స్వామి నాతో "నేనింకెంతకాలం పరుల పంచల్లో పడి ఉండను? నా విశ్రాంతికి ఒక ఇల్లు చూడు" అన్నారు. అట్లాగే చేస్తానన్నాను. నిద్ర లేచేవరకు రాత్రి 9 గంటల సమయం. అంటే ఒక్కగంట వ్యవధి అన్నమాట. పక్షం రోజుల్లో నేను నెల్లూరుకు పోగా నాకు కల పడినపుడే స్వామి నిర్యాణం చెందినట్లు వార్త తెలిసింది.[1] అంటే స్వామివారి మరణం కలలో నాకు ముందుగానే తెలిసింది.

## 15. పి. పార్థసారథి నాయుడు, పెరవల్లూరు, మద్రాసు

సొరకాయల స్వామివారు భగవద్గీతలో చెప్పినట్లు (V.18) సమదర్శి, (IV.18) అవతారపురుషులు. వారిని మొదటిసారి ఎగ్మూరులో మా పితృవ్యులు డి. అరవముదు నాయుడుగారింట్లో దర్శించినాను. చూడగానే ఏదో విద్యుత్ప్రవాహం నాలో ప్రవహించింది. నాకు వారి దివ్యత్వంలో ప్రగాఢవిశ్వాసం కుదిరింది. స్వామివారు సాధారణంగా తెల్లవారు జామున 4,5 గంటల మధ్యన పిట్టకథల రూపంలో ఉపదేశం చేసేవారు. స్వామివారి కంఠధ్వని అస్పష్టంగాను బొంగురుగాను ఉండేది. ఒకసారి నేను మోక్షం ఎట్లా లభిస్తుంది అంటే "తినే తిండి, తట్టలోకి అంత సులభంగా రాదు. ముందుగా భూమిని రాళ్ళు రప్పలు, ముండ్ల పొదలు లేకుండా శుభ్రం చేయాలె. తరువాత భూమిని బాగా దున్ని చదును చేయాలె. అటు తరువాత రాగులు చల్లితే మంచి పంట చేతికి వస్తుంది" అన్నారు. స్వామివారు తరుచుగా చెప్పే పిట్టకథ మరొకటి. "గట్టి తాడుతో కోతిని (మనస్సును) బంధించు, నీకు క్షేమం కలుగుతుంది". స్వామివారు ఒకసారి నవ్వుతూ, ఒకసారి ఏడుస్తూ, ఒకసారి గంభీర ముద్రలో,

1. స్వామి నిర్యాణం చెందినది పగలు పన్నెండు గంటలకు.

మరొకసారి మౌనంతో, మరొకసారి ఏదో ఆలోచిస్తూ వింతగా కనపడేవారు. తమ చుట్టున్నవారితో ఏ సంబంధమూ లేనట్టు ప్రవర్తించేవారు. ఎవరైనా పశువులను జంతువులను కొడుతుంటే బిగ్గరగా అరచి తమ దగ్గరున్న వారిని బతిమాలి పోయి ఆపుమని చెప్పేవారు. ఆ జంతువుల పూర్వజన్మ కథలు చెప్పేవారు. ఒక కుక్కను గూర్చి చెపుతూ "ఇతడు గొల్లవాడు. నాతోబాటు పశువులను మేపేవాడు. మేమిద్దరం తోడి పసులకాపరులం. అతడిట్లా ఐపోయి నాడు. పాపం, అయ్యో!" అన్నారు. భగవద్గీత 5వ అధ్యాయంలో వర్ణించిన జ్ఞాని లక్షణాలన్నీ స్వామివారిలో ఉన్నాయి.

నా భార్యకు రెండుసార్లు రాచకురుపు లేస్తే వేరుశనగ నూనె, చింతపండుతో మాన్పినారు. మూడవసారి ఆమె ఆసన్నమరణ ఐనపుడు వారు సహాయం చేయటానికి నిరాకరించినారు. ఆమె విషయం చెప్పటానికోసమని నేను పుత్తూరునుండి కొప్పేడు నిరాహారంగా నడిచిపోతుంటే స్వామి అక్కడ "అయ్యో, అబ్బాయి పాపం వస్తున్నాడు. తిండి తిప్పలు లేకుండా" అన్నారట. నేను వారి సన్నిధికి పోగానే నన్ను గంజి తాగుమన్నారు కాని ఆమెను బ్రతికించటానికి ఇష్టపడలేదు. మరొకసారి స్వామివారు పెరవల్లూరు మా యింట్లో ఉండగా తీవ్రంగా జబ్బుపడి ఉన్న మా మేనల్లుని గురించి తెలుసుకోగోరి వారి చేతికి అతని జాతకం ఇచ్చినాను. స్వామి ఆ జాతకం విప్పి వెంటనే మూసి "వానికి పూలదండ వేసి వాని దారిన వానిని పంపండి" అన్నారు. స్వామి అన్నట్లే అతడు చనిపోయాడు.

ఒకసారి కొప్పేడులో నేను మరికొందరం స్వామి వెంట ఉన్నాము. స్వామి "గోవిందప్ప నాయుడు కండ్రిగకు పోదాం" అంటూ మూటముల్లె సర్దుమన్నారు. ఇది కొప్పేడుకు నారాయణవరానికి మధ్యనున్న గ్రామం. మేము బండ్లలో సామాను సర్ది స్వామిని ఎక్కుమన్నాము. కాని స్వామి 'రాను' అన్నారు. ఎన్నిసార్లడిగినా వారు రానంటే రావన్నారు. కాని మమ్ములను మాత్రం పొమ్మన్నారు. స్వామిమాట జవదాటరాదు కనుక మేము బయలుదేరినాము. ఐతే కండ్రిగలో ఆగకుండా రాత్రికి నారాయణవరం చేరుకున్నాము. స్వామి బస చేసే ఇంటికి పోతే మమ్ముల ఆ ఇంటివారక్కడ ఉండ వద్దన్నారు. కారణం ఆ ఇంట్లో ఒక రోగి అపస్మారస్థితిలో ఉన్నాడు. మేము మరొక ఇంట్లో తల దాచుకున్నాము. తెల్లవారేవరకు ఆ రోగి చనిపోయినాడు. అందుకొరకే స్వామి అప్పుడు మా వెంట రాలేదని గ్రహించినాము.

నేనొకసారి స్వామిని దర్శించటానికి నారాయణవరం వెళ్ళినాను. స్వామి చుట్టు మిత్రులు మరికొందరు భక్తులు ఉన్నారు. నేను క్రొత్తగా ఇల్లు కట్టుకోవాలను కుంటున్నాను.

నాకు మూడు ఇండ్ల స్థలాలున్నాయి. ఐతే ఏ స్థలంలో ఇల్లు కట్టుకోవాలో నిశ్చయించుకోలేక కొట్టుమిట్టాడుతున్నాను. ఈ విషయం స్వామికి చెప్పుదామని మనసులో అనుకున్నాను. నేను చెప్పకుండానే స్వామి ఒక స్థలం వివరాలు నాక్కూడా తెలియని ఆనవాళ్ళు చెప్పి అందులో ఇల్లు కట్టుకొమ్మన్నారు. చాలాకాలంగా నేను బాధపడుతున్న ఈ సమస్యను స్వామివారు ఒక్క నిమిషంలో తేల్చివేసినారు.

## 16. ఎం.కుప్పుస్వామి చెట్టి, ఎం.ఏ., తహసీల్దారు, గూడూరు

నేను 2-10-1882నాడు పి.డబ్ల్యు.ఎస్.లో క్లార్కుగా చేరినాను. ఆనాటినుండి అరవముదు నాయుడుతో నా పరిచయం. ఆయన స్నేహితులు చెంగల్వరాయ మొదలియారు, తోకె నారాయణస్వామి నాయుడు ద్వారా స్వామిని గూర్చి వారి మహిమల గూర్చి వారి కాలజ్ఞానాల గురించి విన్నాను. రాయబహద్దరు యన్.రత్నసభాపతి పిళ్ళే గురించి చెప్పిన కాలజ్ఞానం సత్యం కావటంతో నాకు స్వామిపై భక్తి పెరిగింది. ఒకనాడు పైన పేర్కొన్న స్నేహితులు, పెరంబూరులోని రైల్వే ఉద్యోగి రామయ్య, నేను కలిసి 5-8-1882నాడు బయలుదేరి రాత్రి 9-45 కి పుత్తూరు చేరి ఆ రాత్రి అక్కడే విశ్రమించినాము. మరునా డుదయం నారాయణవరం పోతే స్వామి అక్కడ లేరు. నారాయణవరంనుండి నింద్రకు పోయినాము. అక్కడ లేరు. అక్కడనుండి నిర్వాయల్ అనే గ్రామానికి మధ్యాహ్నం 2 గంటలకు చేరినాము. అక్కడ స్వామి ఒక కానుగు చెట్టు నీడన పడుకొని ఉన్నారు. ముఖంపై సూర్యకిరణాలు పడుతున్నాయి. మేము పదినిమిషాలు కాచుకొని ఉన్నాము. స్వామి లేచిన తరువాత వారికి మేమంతా సాష్టాంగపడ్డాము. స్వామి కండ్లు వజ్రాలవలె మెరుస్తున్నాయి. ఆ గ్రామానికి ఫర్లాంగు దూరంలో ఒక తోపులోనికి సూర్యాస్తమయ సమయానికి స్వామి మమ్మల్ని తోడ్కొని పోయినారు. అది వెన్నెల రేయి. మేమంతా స్వామితో పాటు ఆ తోపులోనే పడుకున్నాము. స్వామి నిద్రలేచినది మొదలు మరల పడుకునేదాక ఏదో గొణుగుతూ దృష్టాంతాల రూపంగా మాట్లాడినారు. నాకు వారి మాటలేమీ అర్థం కాలేదు. ఉదయం లేచిన తరువాత మా స్నేహితులు తమ తమ శంకలు తీరినాయని, తాము కాలకృత్యాలు తీర్చుకొని వచ్చేలోగా నేను స్వామివారిని అడుగవలసిందేమైనా ఉంటే అడిగి తెలుసు కొమ్మన్నారు. ఇటీవలే నా భార్య చనిపోయింది. మరల పెండ్లి చేసుకోవటమా లేదా అని నా ఆలోచన. స్వామికి ఈ విషయం చెప్పకుండానే నా మొదటి భార్య గురించి ఆమె శీలము గురించి ఆమె యెడ నాకున్న ప్రేమగురించి ఇప్పటి నా దుఃఖజీవితము గురించి స్వామి వివరంగా చెప్పి, మళ్ళా పెండ్లి చేసుకొమ్మని, వచ్చిన నాల్గు సంబంధాల్లో ఏది మంచిదో

చెప్పినారు. పెండ్లి ఖర్చులు అవే వస్తాయని, గార్హస్థ్యజీవితం ఇహపరసాధకమని స్వామి చెప్పగానే నాకు మతిపోయినంత పనైంది. వారి కాళ్ళమీద పడ్డాను. స్వామి తండ్రివలె నన్ను ఆదరించి ఆశీర్వదించి నాపైన అవ్యాజానురాగం కురిపించినారు. ఇంతలో చాలామంది ఆర్తులు స్వామివారి సన్నిధికి వచ్చి తమ రోగాలకు సమస్యలకు పరిష్కారాలు పొందినారు. ఒక మధ్యవయస్కుడైన బ్రాహ్మణుని స్వామి ఉపేక్షించినారు. అతడు తన విషయమై నన్ను కల్పించుకొమ్మన్నాడు. ఆతణ్ణి కాసేపు ఓపిక పట్టవలసిందిగా సలహా ఇచ్చినాను. అది గమనించి స్వామి నన్ను నిందిస్తూ "ఎన్నో కుటుంబాలు నాశనం చేసినాడు. ఇప్పుడతనికి నన్నేం చెప్పమంటావు?" అన్నారు. అతడు నిరాశతో వెళ్ళిపోయినాడు.

కాసేపటి తరువాత ఊరివాడొకడు స్వామికి మేము ఏమౌతామని అడిగినాడు. స్వామి "నా పుట్టింటివారు" అన్నారు. అపుడు మరొకడు "మీ పుట్టింటివారైతే ఒకనికి నిలువునామం, ఒకరికి అడ్డబొట్టు, ఒకరిద్దరికి జంధ్యాలు ఎందుకున్నాయి? అందరూ ఒకే విధంగా లేరే!" అంటే స్వామి "కుండలు చేసేవాడు కుమ్మరి, బట్టలుతికేవాడు చాకలి, బట్టలు నేసేవాడు సాలె, కాని అందురూ మా అమ్మ బిడ్డలే" అంటూ కులమత వివక్షలు, సమస్యలు, వాటి పరిష్కారం చెప్పినారు. సర్వమానవులు సోదరులని అందరికి తండ్రి భగవంతుడొక్కడే అని వివరించినారు. చీమలు, పశు పక్షి కీటకాలు, మనుష్యులు సమస్త ప్రాణికోటి యెడ తమ కారుణ్యభావం వెల్లడించినారు. ప్రకృతినియమాల ననుసరించి తాము ఎవరి కష్ట సుఖాల్లోనైనా కల్పించుకుంటామన్నారు.

నాటినుండి నేను తరుచుగా స్వామిని సేవించి వస్తుండేవాడిని. నా ఐదవ ప్రయాణంలో మా పక్కింటి చుట్టం మంగతాయమ్మ దగ్గుతో బాధ పడుతూ స్వామివారిని నివారణోపాయం అడిగి రమ్మన్నది. నేను స్వామివద్ద రెండు దినాలుండి ఆమెను గురించి అడగటం మరచి బయలుదేరుతుండగా స్వామి ఆమె ఆనవాళ్ళు ఇంటి గుర్తులు చివరకు ఆమె పేరు చెప్పి "ఇంకా దగ్గు ప్రమాదకారిగా మారుతుంది, నేనేం చేసేది?" అన్నారు. స్వామి చెప్పినట్లే ఆ దగ్గు ఎక్కువై ఆమె చనిపోయింది.

ఇంకొకసారి మా అమ్మ అక్క మనుమరాలు జబ్బు గురించీ, మరొక మనుమరాలి పెండ్లి గురించి అడగటానికి నారాయణవరం శనివారం రాత్రి చేరి విష్ణుమందిరంలో మంటపంలో పడుకున్నాను. నిద్ర లేచేసరికి ఎదురింటి అరుగుమీద స్వామివారున్నారు. వారికి నమస్కరించి చెరువుకు పోయి ముఖమార్జనం చేసి వచ్చేవరకు

స్వామి ఆవుల నారాయణస్వామి ఇంటి అరుగుపై ఉన్నారు. స్వామివెంట ఆనాడు చాలామంది ఉన్నారు. నా మనసులోని మాట నేను అడుగకున్నా స్వామి నా జేబునుండి గడియారం తీసి చూస్తున్నారు. ఒకాయన చమత్కారం కోసం ఆ గడియారం ఏమని పలుకుతున్నది అంటే స్వామి పెండ్లీడు పిల్లపేరు చెప్పినారు. జబ్బుపడినామె గురించి చెప్పి కన్నీరు విడిచి "చిక్కి శల్యమైపోయింది పాపం, లాభం లేదు" అన్నారు. ఆ పిల్ల పెండ్లి నన్నే చేయుమని ఆదేశించినారు. మంచి సంబంధం వస్తుందని, తరువాత ఆ యమ్మే చాలా మందికి ఆశ్రయం ఇస్తుందని నే నడుగకుండానే సవివరంగా చెప్పినారు.

మరొకసారి నావెంట పి.అయ్యస్వామి మొదలియారు, స్వామిని పరీక్షించే ఉద్దేశంతో వచ్చినాడు. స్వామికి మందు మొక్కల గురించి తెలుసునేమో పరీక్షిద్దామని అతని కోరిక. అతడు స్వామికి నమస్కరించగానే "నన్ను పరీక్షించటానికి వచ్చినావా?" అంటూ మేమిరువురము స్వామి వెంట కండ్రిగ నుండి నారాయణవరం వరకు నడుస్తుండగా దారివెంట కనబడిన రెండువందల మొక్కలు వాటి పేర్లు వాటి గుణాలు చెప్పినారు. అయ్యస్వామి ఆ మొక్కలన్నీ తన కోటుజేబులో నింపుకున్నాడు. అటు తరువాత ఏ మొక్కకు ఏ గుణమున్నదో మరిచిపోయి తికమకపడ్డాడు.

స్వామి మొదటిసారి మద్రాసుకు రత్నసభాపతి పిళ్ళే కూతురు వివాహం సందర్భంగా వచ్చినప్పుడు స్వామివారున్ను మరొకస్వామి కన్నుకుట్టి స్వామి ఇద్దరూ చాలా మందికి రోగాలు నయం చేసినారు. ఈ యిరువురు స్వాముల్లో సొరకాయల స్వామి ఆ రోగుల పేర్లు వారి రహస్యవిషయాలు చెప్పి ఆశ్చర్యచకితులను చేసినారు. దానితో నాస్తికుడు, ఇట్టి మాహాత్మ్యాలు నమ్మనివాడు ఐన వి.చెంగల్వపతి నాయుడు ముగ్ధుడై, స్వామికి వశుడైపోయినాడు. అతడు వృక్షజాతుల లైంగిక విజ్ఞానం గురించి అడిగిన ప్రశ్నలకు స్వామివారు ఆధునిక వృక్షశాస్త్ర గ్రంథాలలో లభ్యమయ్యే సమాధానాలు చెప్పి అక్కడున్న వారిని దిగ్భ్రాంతులను చేసినారు.

మరొకసారి 1891 లేదా 1892 ప్రాంతంలో నేను స్వామి సన్నిధిలో ఉండగా 23 ఏండ్ల యువతి తన వెంట ఒక వృద్ధురాలిని, ఒక పురుషుని, కొడుకును తోడ్కొని వచ్చింది. కొడుకు నాలుగైదేండ్ల బాలుడు. ఆమె స్వామికి పండ్లు అర్పిస్తే స్వామి తీసుకోలేదు. ఆమెను కసిరినారు. వాళ్ళు దుఃఖితులై తిరిగి పోతుండగా, స్వామి వాళ్ళను పిలిచి "నీ భర్త వద్దంటుండగా ఎందుకు వచ్చినావు? అతడు అవినీతిపరుడు, లంచగొండి" అని దూషించి

నారు. ఆమె తన కొడుకు తల నొసలు దినదినం పెరిగిపోతుండటం స్వామికి నివేదించి నివారణోపాయం అడిగింది. స్వామి వేపాకు మెత్తగా నూరి తలకు కట్టుమన్నారు. అటు తరువాత ఆమె నాకు ఆ బాలుని పరిస్థితి వివరంగా చెప్పింది. ఇంగ్లీషు డాక్టర్లు కూడ తమ అసహాయతను వ్యక్తం చేసినారు. అటువంటి రోగాన్ని స్వామి వేపాకుతో నయం చేసినారు.

స్వామి సజీవులై ఉన్నంతకాలం వీలైనప్పుడల్లా నేను వెళ్ళి వారిని దర్శించినాను. ఎడ్వర్డ్ పట్టాభిషేకం నాడే స్వామివారిని సమాధి చేసినారు.[1] అంతకు ఒకరోజు ముందె స్వామివారు దేహత్యాగం చేసినారు. స్వామివారు ఈలోకంలో ఎట్లా నడుచుకోవలెనో మాకు బోధించేవారు. యోగం గురించి, తాత్త్విక విషయాల గురించి ముచ్చటించేవారు. చదువురాని వారికి సామాన్య భాషలో సాధారణమైన ఉదాహరణలతో బోధించేవారు. చదువుకున్న వారికి పండితులకు రామాయణ, భారత, భాగవత, భగవద్గీత, ఉపనిషత్తుల నుండి ఉదాహరించి వివరించేవారు. స్వామి చదువుకోకున్నా వారు చెప్పే విషయాలు శాస్త్రీయంగా ఉండేవి.

స్వామికి ప్రకృతిపై గల అధికారానికి, రోగాలు నయం చేసే అద్భుతశక్తికి అవిశ్వాసులకు కూడా స్వామివారి మాహాత్మ్యంపైన నమ్మకం పెరిగేది. రోగాలు నయమైన వాళ్ళు ఇదంతా స్వామి మహిమ అంటే స్వామి తాము కేవలం ఉపకరణ మాత్రుడనని వినయం చాటేవారు. ఒక కడుపునొప్పి రోగి వస్తే స్వామి ఎదురుగా ఉన్న ఒక చెట్టుపుల్ల తీసి చేతిలో పట్టుకున్నారు. పిడికిలి విప్పేసరికి అది పొడిగా మారింది. స్వామి ఆ పొడి రోగికిచ్చి కొద్దిగా మాత్రం చెవిలో వేసుకొని దానిపై నీటిచుక్కలు వేయుమన్నారు. కొన్ని క్షణాల్లోనే అతని కడుపునొప్పి మాయమైపోయింది. స్వామివారు ప్రతిదినం తమ సన్నిధికి ఎవరెవరు రాబోతున్నారో ముందుగానే చెప్పేవారు. స్వామి రెండవసారి మద్రాసుకు వచ్చినప్పుడు మా యింట్లో ఒకరోజున్నారు.

## స్వామి ఆచరణలు - ప్రబోధలు

స్వామి తమ ఆచరణల ద్వారా, బోధల ద్వారా తమ సన్నిధికి వచ్చే వారికి రెండు విషయాలు చెప్పేవారు. 1. సమస్త ప్రాణికోటి యెడ అవ్యాజప్రేమ లేదా భక్తి. 2. సంపూర్ణ వైరాగ్యం. మొదటిది చక్కెర అని రెండవది ఉప్పు అని వర్ణించేవారు. చావు అనేది తెర దించటంతో గాని, తెరమరుగై పోవటంతో గాని పోల్చేవారు. చావు శరీరానికే గాని ఆత్మకు కాదనేవారు.

1. ఎడ్వర్డ్ పట్టాభిషేకం జరిగింది 22-1-1901 నాడు, స్వామివారు దేహం చాలించింది 9-8-1902 నాడు, సమాధి జరిగింది 10-8-1902 నాడు.

స్వామి పూజలు, జపాలు, యాంత్రికమైన హఠయోగ సాధనలను ప్రోత్సహించేవారు కాదు. హఠయోగం వల్ల శరీరానికి హాని జరుగుతుందనేవారు. కోడిని కట్టివేస్తే దాని పిల్లలన్నీ దాని చుట్టే ఉంటాయి. దృష్టిని నిల్పి బలవంతాన ఊపిరిని బంధించనక్కరలేదు. మనసును బంధించాలె. ఇంద్రియాలను అదుపులో పెట్టుకుంటే చాలు. స్వార్థము సంకుచితత్వము విడిచి విశాలభావన పెంచుకుంటే మానవునికి అదే ప్రగతి మార్గం అనేవారు. స్వామి మనస్సును భూమితో పోల్చేవారు. వ్యవసాయానికి అనువుగా భూమిని సాగు చేసినట్లే మనస్సును సంస్కరించాలెనని ప్రబోధించేవారు. స్వామివారి మనస్సు స్వచ్ఛమైన అద్దం వంటిది. తమ సన్నిధికి వచ్చేవారి మనస్సుల్లోని వక్రతలన్నీ వారికి సుస్పష్టంగా గోచరించేవి. కనుకనే అటువంటివారిని సరియైన మార్గంలోకి తిప్పేవారు. సాగుచేసే భూమిలో ముండ్ల పొదలు, కలుపు, రాళ్లు రప్పలు తీసివేసి పంటకు యోగ్యం చేసినట్లు, మనసులోని మాలిన్యాలు తుడిచివేయాలెనని బోధించేవారు. దయ, క్షమ, కరుణ - గుణాలు బాగా పెంచుకొని ఇతర ప్రాణికోటికి సహాయం చేయాలెననేవారు. ఒకసారి మిత్రులం నలుగురం చేరి నమ్మాళ్వారు మొదలైన యోగుల గురించి ముచ్చటిస్తుండగా స్వామి వచ్చి మా చెంత కూర్చుండి ఆళ్వార్ల ప్రేమ నిస్పృహ పావిత్ర్యం సేవాభావం వంటి గుణాలను విపులీకరిస్తూ ఉపన్యసించినారు.

సొరకాయల స్వామి అందరు గురువుల వలె ఉపదేశాలిచ్చేవారు కారు. హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు, శైవులు, వైష్ణవులు ఎవరు వచ్చినా వారు మంచి వారైతే ప్రోత్సహించి వారి మతంలోనే వారికి సద్గతి చూపేవారు.

## 17. టి.సి. సుబ్బఅయ్యర్ - కార్వేటినగరం మామలదారు, తిరువాలంగాడు.

సొరకాయలస్వామిని నేను 1866 నుండి ఎరుగుదును. కార్వేటినగరం సంస్థానం మామలదారుగా జమీందారీలోని దేవాలయాలన్నీ నా పర్యవేక్షణలో ఉండేవి. ఒకసారి దివ్యజ్ఞానసమాజ స్థాపకులైన హెచ్. సి. బ్లావట్స్కీ, కర్నల్ హెచ్. ఎస్. ఆల్‌కాట్ 1885లో నగరికి వచ్చినారు. శ్రీమాన్ మహామండలేశ్వర కఠారి సాళువ మాకరాజ మహారాజులవారు, కుమార వేంకట పెరుమాళ్‌రాజు బహద్దరుగారు నన్ను ఈ అతిథులకు కావలసిన ఏర్పాట్ల గురించి నియోగించి సంస్థానంలోని దర్శనీయస్థలాలన్నీ వారి వెంట ఉండి చూపించుమని ఆదేశించినారు. ఈ పనులన్నీ ముగిసిన తరువాత అతిథులు సొరకాయలస్వామిని దర్శించటానికి వచ్చి స్వామివారికి పూలు పండ్లు సమర్పించి, నమస్కరించి సందేశ మడిగినారు. స్వామి "ధార్మికరంగంలో ఇంతవరకు నల్లకాకులే సేవ చేస్తుండేవి. కాని ఇప్పుడు

తెల్లకాకులు కూడ వచ్చి వాటికి సహకరిస్తున్నాయి" అన్నారు. అప్పుడే స్వామి ఉన్న ఎదురింటిలో నేను వేరే పనికిపోతే ఒక పెద్ద తేలు నా వేలును కుట్టింది. దుర్భరమైన నొప్పితో పిల్లవానివలె నాకున్న చనువుతో స్వామివారి గడ్డం పట్టుకుని "దుర్భరం దుర్భరం" అని ఏడ్చినాను. స్వామి "అయ్యో, నేనేం చేయగలను? ఆవుపేడ రాయి" అన్నారు. ఆవుపేడ రాయగనే చేతితో తీసివేసినట్లు నొప్పి మంట ఒక్కక్షణంలో పోయినవి. ఈ సంఘటన బ్లావట్స్కీ, ఆల్‌కాట్‌ల సమక్షంలో జరిగింది.

మరొకసారి నేను తీవ్రంగా జబ్బుపడి నానా వైద్యాలు చేయించుకొన్నా ఏ మందులూ పనిచేయక జీవితంపై నిరాశ కలిగింది. స్వామి మహిమలపై అపారవిశ్వాసం ఉన్న కార్వేటినగరం మహారాజుగారు నన్ను స్వామిని ఆశ్రయించవలసిందిగా ఆదేశించినారు. నేను బయలుదేరి నారాయణవరం చేరి సాష్టాంగపడి శరణాగతి చేసినాను. నాకు నయమయ్యేదాకా విడువనని స్వామిని బిగ్గరగా కౌగిలించుకున్నాను. స్వామి 'గంజి తాగు' అని వెంటనే ఏడుమైళ్ళ దూరాన ఉన్న కొప్పేడుకు పోయినారు. ఏమిగంజి, ఎటువంటిగంజి అని నేను అడుగకముందే స్వామి వెళ్ళిపోయినారు. నేను కూడ పట్టు విడువకుండా కొప్పేడు చేరి "ఏమి తాతా ! నన్ను మోసగించి ఇక్కడికి వచ్చినావా ! నన్ను బాగు చేయక నిన్ను విడువను" అన్నాను. అప్పుడే ఒకశిష్యుడు స్వామికి వక్కాకు ఇస్తున్నాడు. అందులోనుండి కొంచెం తీసి స్వామి నాకిచ్చినారు. వెంటనే నేను తిన్నాను. నాటి సాయంకాలంవరకే నాకు సంపూర్ణస్వాస్థ్యం కలిగింది.

మద్రాసు ముల్లాసాహెబు వీధిలో ఉండే మాణికమ్మాళ్ ఏండ్ల తరబడి భయంకర కుష్ఠవ్యాధితో బాధపడుతుండేది. చీము నెత్తురు ఓడుతూ అసహ్యంగా కనిపించేది. ఏ మందులూ పని చేయలేదు. ఆమె నారాయణవరం పోయి స్వామి సన్నిధిలో కొన్ని దినాలున్నది. ఒకనాడు ఉన్నట్లుండి స్వామి ఆమెకు పిడికెడన్నం పెట్టినారు. అది తిన్నప్పటినుండి వ్యాధి తగ్గుముఖం పట్టి వారందినాలలో నిశ్శేషంగా పోయింది. కడప జిల్లా తహసీల్దార్ నరసింగరావు కుష్ఠవ్యాధి కూడ స్వామివారు ఇట్లాగే తగ్గించినారు. నేనెరిగినంతవరకు స్వామి అరడజను కుష్ఠరోగులను వ్యాధివిముక్తులను చేసినారు. ఆయన నాశ్రయించిన అందరు రోగులు స్వాస్థ్యం పొందలేదన్న మాట నిజమే. భగవంతుని లీలల వలె మహాత్ముల లీలలు కూడ అగమ్యగోచరాలు. భయంకర కుష్ఠరోగాలు కొందరికి నయం చేసిన సంఘటనలతో పాటు మామూలు జ్వరాలు కూడ కుదుర్చని సంఘటనలు ఉన్నవి. మా బావ టి.రామచంద్ర జోషి, ఆయన సోదరుడు సుబ్బాశాస్త్రి ఇద్దరు గాస్ట్రిక్ అల్సర్స్‌తో బాధపడుతూ స్వామి సన్నిధికి మిఠాయి పట్టుక పోయినారు. తాము సమర్పించే

మిఠాయి స్వీకరిస్తే తమపై స్వామికి అనుగ్రహం కలిగినట్లు సూచనగా భావించినారు. కాని స్వామివారు వారి మిఠాయి తాకలేదు సరికదా వారిపైపు కన్నెత్తి ఐనా చూడలేదు. వాళ్ళు నిరాశతో తిరగిపోయి ఆ రోగంతోనే చనిపోయినారు.

## 18. ఎ. అప్పలరావు - ఎమ్ అండ్ ఎస్.ఎమ్.రైల్వేస్, మద్రాసు.

సొరకాయల స్వామిని గురించి తొలిదినాలలో నాకేమి విశ్వాసం కలుగలేదు. ఆయనకు పూజలు పురస్కారాలు చేసి హారతులిచ్చి ఎందుకు బ్రహ్మరథం పడుతున్నారో పిచ్చి మనుషులు! ఇట్లా చేసి అలగా జనాన్ని మోసం చేసి డబ్బు గడిస్తున్నారేమో! ఒకవేళ ఆయన నిజంగానే మహాత్ముడైతే భగవంతునివలె, భగవంతుని అర్చామూర్తుల వలె పూజలందుకోవాలనే కోరిక ఈయనకెందుకో అనుకునేవాణ్ణి. నాకిటువంటి ఆడంబరాలంటే నచ్చవు. నా స్నేహితుడు నమ్మయ్యనాయుడు ఎన్నిసార్లు రమ్మన్నా ఏదో వంక చెప్పి నేను స్వామివద్దకు పోలేదు. 1901లో స్వామి మద్రాసుకు వచ్చి తిరువళ్ళిక్కేణిలో బేరి తిమ్మప్పనాయుడు తోటలో దిగినారని నా మిత్రులంటే సరే అని ఒక శనివారం ఆయన దర్శనానికి వెళ్ళినాను. శని ఆదివారాలు రెండు దినాలుండి, ఆయన గొప్పతనం పరీక్షించి, వీలైతే ఆయన భక్తుల దృష్టిలో నా గొప్పతనం ప్రదర్శిద్దామనుకున్నాను. శనివారం రాత్రి అందరూ తొందరగా నిద్రపోయినారు. నేను ఒక అరుగు మీద నిరాచ్ఛాదంగా పడుకున్నాను. విపరీతమైన దోమల బెడదతో నాకు నిద్ర పట్టలేదు. రాత్రి 11 గంటల సమయాన స్వామి లేచి దేహబాధ తీర్చుకున్నారు. వారు వస్తుంటే గౌరవసూచకంగా లేచి నిల్చున్నాను. చుట్టూ పరికించి చూస్తే ఎక్కడ పడితే అక్కడ పిన్నలూ పెద్దలూ అందరూ చుట్టలు చుట్టుకొని పడుకున్నారు. ఇంతమందికి ఈ వెఱ్ఱి ఏమిటి అనుకుంటూ ఆయన ఉన్న గది వాకిలిపై నుండి చూస్తూ ఈ వెఱ్ఱి జనం ఈయనను దేవుడని భావిస్తున్నారు. ఈయనలో భగవంతుని లక్షణాలెక్కడున్నాయి? అని మనసులో అనుకున్నాను. స్వామి నావైపు చూచి నా మనసులోని భావాలు తాము గ్రహించినట్లు సైగ చేసినారు. నేను ఒక్కసారి స్తంభించిపోయినాను. నా శరీరమంతా విద్యుచ్ఛక్తి పాకినట్లయినది. నేను గడగడ వణకి పోయినాను. నా తల తిరిగిపోయింది. అయోమయపు ఆలోచనతో చేతులు కాళ్ళు వణకజొచ్చినవి. ఇట్లా ఐదు నిమిషాలు గడిచిపోయినవి. అందరూ పడుకున్నారు. నా పరిస్థితి ఎవరూ చూడలేదు. స్వామి వెనుదిరిగి "ఇక వణుకకు" అన్నారు. అంతే! దానితో నా వణుకు పోయింది. ఆయన మహిమోపేతులని గ్రహించగలిగినాను. ఆయన దివ్యపురుషుడని లేదా అవతార పురుషుడని నిస్సందేహంగా

చెప్పగలను. ఆనాటినుండి నేనూ సొరకాయల స్వామికి భక్తుడనైనాను.

మాది విశాఖపట్నం. మావాళ్ళంతా విశాఖపట్నం రమ్మని ఒత్తిడి చేసినారు. నాకెటూ తోచక మద్రాసులో ఉండటమా విశాఖపట్నం పోవటమా తేల్చుకుందామని స్వామిని దర్శించబోయినాను. స్వామికి దండం పెట్టి నిల్చున్నాను. నేనేమి చెప్పకుండానే స్వామి "నిరాశపడకు. తొందరలోనే మద్రాసులో మంచి స్థితి లభిస్తుంది. నీవు అక్కడే శాశ్వతంగా ఉండిపోతావు" అన్నారు. స్వామి అన్నట్లే జరిగింది.

**19. డా॥ జె.వి.రామస్వామి నాయుడు**, ముంగవిలాసం -148, గోవిందప్ప నాయక వీధి - మద్రాసు.

సొరకాయల స్వామివారి గురించి నాకు చెప్పినవారు పి.రాజగోపాల మొదలియారు. వారి ఇంట్లోనే నా డిస్పెన్సరీ గది. స్వామి మద్రాసుకు వచ్చినప్పుడల్లా రెండుమూడు సార్లు దర్శించినాను. ఒక పున్నమరేయి స్వామి చెంత ఉన్నాను. వారు నాతో పదేపదే "కాలువల్లోని పూడిక తీసివేయాలె" అన్నారు. దీని అర్థం బాహ్యవిషయవాసనలచేత మలీమసమైన చిత్తవృత్తులను శుభ్రం చేసుకొమ్మన్నారనుకున్నాను. నా మూడవ కొడుకు పుట్టేదీ, తాము దేహం చాలించేదీ, మూడునెలల ముందుగానే స్వామి చెప్పినారు.

**20. సి.వి.స్వామినాథ అయ్యరు**, వివేక చింతామణి పత్రికా సంపాదకుడు, మద్రాసు.

## నారాయణవరం గ్రామ్యఋషి ప్రశస్తి

మా గురువుగారు చాలాసార్లు నారాయణవరం గ్రామ్యఋషి మాహాత్మ్యం గురించి చెప్పగా విని వారిని చూడాలనే తీవ్రకాంక్ష కలిగింది. మొదటిసారి వారిని చింతాద్రి పేటలో దర్శించినాను. 1901లో వారు తిరువళ్ళిక్కేణిలో ఉండగా వారితో ప్రత్యక్ష పరిచయమైనది. వారిని దర్శించటానికి నేనెక్కిపోయిన సైకిల్ టైర్లు చక్రం చువ్వలు ఆసక్తిగా చూసి "తెల్లవాని పనితనం" అన్నారు. నేను "ఏమన్నారు? మళ్ళీ ఒకసారి అనండి" అని కోరగా ప్రక్కనున్న ఒకాయన స్వామివారన్న మాటలుచ్చరించి, నా చెవుడును పోగొట్ట వలసిందిగా స్వామిని కోరినాడు. స్వామి "తెల్లవాని దగ్గరకు పో"మ్మన్నారు. నేను రోగ విమోచనం కోసం వారిని ఆశ్రయించలేదనీ చెవుడు నాకొక వరమే అనీ సమాధానం చెప్పినాను.

నేను తీసుకపోయిన పండ్లు కలకండ స్వామికి సమర్పించినాను. స్వామి తమ చుట్టున్నవారికి వాటిని పంచినారు. వారి గొంతు పుండైనందున కూతురు బుడమ పసరు రాసుకుంటున్నారు. నేను కూడ వారి గొంతుకు పసరు రాసినాను. స్వామి యెదుట ఎవరో కట్టెలు కొడుతున్నారు. అలవాటు ప్రకారం స్వామి ఆ కట్టెలు కొట్టేపని తదేకంగా కుతూహలంగా గమనిస్తున్నారు. వారి ప్రక్కనే కూర్చున్న నావైపు తిరిగి "నీవు అక్కడున్న కట్టె మొద్దు ముడిని పగలగొట్టగలవా?" అన్నారు. అది నాకొక పరీక్షగా భావించినాను. వెంటనే ఆ పనికి పూనుకొన్నాను. గొడ్డలి చేత పట్టటం నాకు ఇదే ప్రథమం. ఆ మొద్దును చీల్చటం నా చేతకాకపోయినా నా ప్రయత్నం విరమించుకోలేదు. కొట్టి కొట్టి డీలు పడిపోయిన నన్ను స్వామి చేరబిల్చి "అది నీ వల్ల కాలేదు" అన్నారు. "అరమర లేకుండా ప్రయత్నించినాను. ఫలితం శూన్యమైతే నాకే చింత లేదు. అంతా మీదే" అన్నాను. ఈ సమాధానంతో నా అంతస్సత్వం గ్రహించిన స్వామి వెంటనే నాపట్ల సౌముఖ్యం కనబరచినారు.

మా యిరువురికీ పరస్పరావగాహన ఏర్పడగానే నేనొక సాధకుడనని స్వామివారు గ్రహించినారు. నా ఆధ్యాత్మిక ప్రగతి కోసం తగిన సూచనలు చేసినారు. కావలసినంత భూమి సాగు చేయటానికి ఉన్నది కాని కృషికులే లేరని స్వామి అంటే, నేను " ఆ భూమి ఎక్కడుంది? నాకింత ఇప్పించండి దున్నుకుంటాను" అన్నాను. స్వామి వెంటనే "నారాయణవరం రా! కావలసినంత భూమి ఇస్తాను" అన్నారు. నారాయణవరమంటే ఏమిటో అప్పటికి నాకు తెలియదు కనుక లక్ష్యార్థం మాత్రమే గ్రహించి నేను "భూమి నారాయణవరంలో ఉంటే ఇప్పుడే ఇక్కడే ఎందుకు చూపించరు?" అన్నాను. ప్రక్కనున్నవారు నారాయణవరం స్వామి నివసించే గ్రామం అన్నారు. నా మాటలే గ్రహించి స్వామి "బీడులో దేశద్రిమ్మరి గుడిసె వేసి చూడు" అన్నారు. స్వామివారన్న మాటలకు నేను ముందుగా తికమకపడ్డాను. కాని ప్రక్కనున్నవారు స్వామివారు మాట్లాడే తీరు చెప్పగానే అందులోని రహస్యార్థం నాకు అవగతమైనది. స్వామి దృష్టాంత పరిభాషలో మాట్లాడుతున్నారని తెలుసుకున్నాను. భగవత్ప్రవక్తలందరు తాము దర్శించిన పవిత్ర రహస్యాలు ఇట్లాగే బోధిస్తారు. స్వామి సూచించిన దృష్టాంతపు నా అనుభవం వివేక చింతామణి XIV ఆరుద్ర దర్శనం సంచికలో (పుటలు 271-275,1906 జనవరి) ప్రకటించినాను.

కొంతకాలం తరువాత తిరుచ్చి వాస్తవ్యులైన సిద్ధ సంప్రదాయపు యోగిని నేను కలుసుకున్నపుడు సొరకాయలస్వామి గొప్ప మంత్రసిద్ధులని ఆయన పొగడినారు. నేను సొరకాయల స్వామిని దర్శించినప్పటి మరొక ముఖ్యసంఘటన చెప్పుతాను. కల్లుగీసే

వాడొకడు కొబ్బరిచెట్టు ఎక్కుతున్నాడు. స్వామి ఆశ్చర్యంగా ఆతణ్ణి చూస్తూ స్వగతంగా "ఎంత పిచ్చి ప్రపంచమిది! చెట్టును ఫలించనీయరు కదా! దాన్ని గీచి సారమంతా లాగేస్తారు. కాయను పండనిచ్చినపుడే కొబ్బరి కురిడి లభిస్తుంది. అప్పుడే రుచిగా తినగలము" అన్నారు. ఇందులో ఇమిడి ఉన్న అనుభవపూర్వకమైన సత్యం నాకు దశాబ్దం తరువాత (9-4-1911) ఈనాడే తెలిసి వచ్చింది.

**ఏమీ విన్నపేక్షింతువా? శ్రీ సాయిబాబా చరిత్రము భక్తుల వృత్తాంతములు** (ద్వితీయభాగము పుటలు 230-231) లో కీ.శే. బాపట్ల హనుమంతరావుగారు ఈవిధంగా వ్రాసినారు.

బి.వి. నరసింహస్వామి (1874-1956 షిర్డీసాయిబాబా గురించి అమూల్యమైన గ్రంథాలు వ్రాసి మద్రాసు మైలాపురంలో సాయిబాబా మందిరం నిర్మించి, అఖిల భారతీయ సాయి సమాజం స్థాపించిన పుణ్య పురుషులు) "ఆంగ్ల భాషయందు పట్టభద్రులై న్యాయవిద్య నభ్యసించు సమయమున పుత్తూరు సమీపమున వసించిన ప్రసిద్ధయోగి పుంగవులైన సారకాయ స్వామివారిని గూర్చి వీరు వినియుండిరి. బాల్యమునుండి సాధుసత్పురుష సందర్శన సేవాసక్తులగుటచే వీరు సారకాయ స్వామివారిని సందర్శించిరి. ప్రథమ సందర్శనముననే స్వామివారి కటాక్షవీక్షణము వీరిపై ప్రసరింపబడినది. అన్యోన్య ప్రేమాదరణలు వర్ధిల్లినవి. ఆధ్యాత్మిక ప్రబోధయు కలిగినది. తరువాత అవకాశము కలిగినపుడెల్ల నరసింహ అయ్యర్‌గారు స్వామివారిని సందర్శించుచుండిరి. తత్ప్రభావమున అయ్యర్‌గారికి గల ఆధ్యాత్మికపిపాస ఉపశమించి మహోన్నతాశయము లెంతయేని దోహదము గాంచినవి . . . . . హోంరూల్ ఉద్యమము సందర్భమున ఈ ఉద్యమమునందు ముఖ్యులైనవారితో శ్రీ నరసింహయ్యర్‌గారిని సంప్రదింపుల నిమిత్తము బ్రిటిష్ ప్రభుత్వమువారు ఇంగ్లాండునకు ఆహ్వానించి మార్గమధ్యమున మొదటి ప్రపంచసంగ్రామ వ్యాజమున వారినందరను జిబ్రాల్టరు నందు నిర్బంధమునందుంచిరి. ఆయెడ వీరు తమ విడుదలకై సారకాయ స్వామివారిని మానసికముగ ధ్యానించిరి. తుదకు వారందరు భారతదేశమునకు మరలింపబడిరి.

# 2. మహాసమాధి తరువాత

శ్రీరామ శ్రీకృష్ణాద్యవతారాలు వారి అర్చామూర్తుల వలె, దైవాంశ సంభూతులైన మహాపురుషులు, యోగులు సిద్ధులు తమ తమ దేహయాత్రలు చాలించిన తరువాత కూడ కొలచినవారి కోరికలు, తలచినవారి బాధలు తీరుస్తునే ఉంటారు. సారకాయల స్వామి

సమాధిగతులైన తరువాత నాటిభక్తులు, స్వామిని దర్శించని నేటి భక్తులు తమ తమ భక్తి విశ్వాసాలకు అనుగుణమైన సత్ఫలితాలు పొందుతునే ఉన్నారు. దృఢమైన భక్తి విశ్వాసాలతో ధ్యానించేవారికి స్వామి ప్రత్యక్ష దర్శనం ప్రసాదిస్తున్నారు. తమను నిరంతరం స్మరించేవారిని ఎల్లప్పుడు కంటికి రెప్పవలె కాపాడుతామని స్వామివారు వాగ్దానం చేసినారు. ఆ వాగ్దానం తొంభైయేండ్లు గడచిన తరువాత కూడ పాలిస్తున్నారు. సమాధిగతులైన తరువాత సొరకాయల స్వామి ప్రదర్శించిన కొన్ని మహిమలు తెలుసుకుందాము.

వేలూరులో రఘునాథరావు అనే ఆంజనేయోపాసకుడు ఉండేవాడు. ఆతని ఉపాసనలో ఏమి పొరపాటు దొరలిందో కాని ఆతని మతి చెడిపోయి కోతివలె వికార చేష్టలు చేయసాగినాడు. బంధువులు ఆతణ్ణి కుమారకుప్పంస్వామి సన్నిధికి తీసుక పోయినారు. స్వామిని చూడగానే రఘునాథరావు "మీరు సొరకాయల స్వామివారి ముఖ్య శిష్యుల్లో ఒకరు కదా! మీ ఆజ్ఞ ప్రకారమే నడుచుకుంటాను" అన్నాడు. నాటినుండి రఘునాథరావు బుద్ధి కుదుటపడసాగింది. క్రమంగా ఆరోగ్యవంతుడైనాడు. కొంతకాలం తరువాత రఘునాథరావు శరీరమంతట బొబ్బలు లేచి, ఏ మందులకూ తగ్గలేదు. అతడు నారాయణవరం వెళ్ళి సొరకాయల స్వామివారి అభిషేక తీర్థం ఒడలంతా పూసుకున్నాడు. బొబ్బలు తగ్గిపోయినవి.

సొరకాయల స్వామి నిత్యాగ్నిహోత్రి. వారు ఎక్కడుంటే అక్కడ అగ్ని వెలిగిస్తుండేవారు. ఆ ధునిలోని విభూతి రోగులకు పిశాచగ్రస్తులకు మనోవైకల్యం పొందినవారికి ప్రసాదంగా ఇచ్చి నొసట బొట్టు పెట్టేవారు. స్వామి విభూతిని సేవించిన వారికి సమస్తపీడలు తొలగిపోయి శుభం జరిగేది. స్వామివారు కనుమరుగైన నాటినుండి ఇప్పటికీ నారాయణ వరంలో అగ్నిగుండం మండుతునే ఉన్నది. అందులోని విభూతిని భక్తులు ప్రసాదంగా సేవిస్తున్నారు. నారాయణవరంనుండి తిరిగి వచ్చేటప్పుడు భక్తులు చాలినంత విభూతి తెచ్చుకుంటారు. తాము వాడుకుంటారు, ఆపదలో ఉన్నవారికి ప్రసాదంగా ఇస్తారు. తంతితపాల శాఖలో పనిచేసే ఆత్మనాథ అయ్యర్ మద్రాసు మైలాపురంలో ఉంటాడు. ఆయన సొరకాయలస్వామివారికి, కుమారకుప్పంస్వామికి భక్తుడు. ఆయనవద్ద సొరకాయల స్వామి విభూతి ఎప్పుడూ ఉంటుంది. ఆర్తులెవరైనా అడిగితే విభూతి ప్రసాదం ఇస్తుంటాడు. వారి పరిచితులైన ఒక మొదలియారు కుటుంబిని ప్రసవించి బిడ్డను కన్నది. కాని పుట్టిన మూడు దినాలదాక ఆ బిడ్డ ఏడ్వలేదు. మూగబిడ్డ ఏమో అనే బాధతో ఆ యింటివారు అయ్యరు తల్లికి ఈవిషయం చెప్పితే ఆమె సొరకాయలస్వామి విభూతి ప్రసాదం ఇచ్చి శిశువు నోటిలో వేయుమన్నది. విభూతి నోటిలో వేసిన వెంటనే శిశువు ఏడ్వటం ప్రారంభిం చింది. పిల్లలకు వాంతులు విరేచనాలు జ్వరం

కురుపులు వస్తే స్వామివారి విభూతిని భక్తులు పరమౌషధంగా వాడుతుంటారు. తేలుకాటుతో బాధపడేవారికి స్వామి విభూతి సద్యఃఫలితాన్ని ఇస్తుంది.

మద్రాసు పురశవాక్కంలో టి.ఆర్.ఎమ్. కృష్ణస్వామినాయుడు ఆర్.ఎమ్.ఎస్. శాఖలో ఉద్యోగం చేస్తాడు. ఆయన ప్రతి సంవత్సరం గురుపూజా మహోత్సవానికి నారాయణ వరం వెళ్తుంటాడు. ఒక సంవత్సరం గురుపూజా కార్యక్రమానికి మద్రాసునుండి బొంబాయి మెయిలులో బయలుదేరినాడు. ఆ బండి పుత్తూరులో ఆగదు. తోడి ప్రయాణికులకు సొరకాయలస్వామి మహిమలు చెప్పుతూ ఆయన ప్రయాణం చేస్తున్నాడు. ఎదుటినుండి మరొక బండి వస్తున్నందున మద్రాసు మెయిలు వేపగుంట స్టేషనులో ఆగింది. పుత్తూరులో కూడ ఇట్లాగే ఆగితే అక్కడ దిగి సుఖంగా నారాయణవరం చేరుకోవచ్చు గదా అని మనసులో అనుకున్నాడు. అనుకున్నట్లే ఆవిరి ఐపోయినందున పుత్తూరు స్టేషనులో రైలుబండిని నీళ్ళకోసం ఆపవలసి వచ్చింది. నాయుడు పుత్తూరులోనే దిగి, స్వామి తన కోరిక ఫలింపజేసి శ్రమ తప్పించినందుకు కృతజ్ఞతలు తెలుపుతూ నారాయణవరం చేరినాడు.

1960 వ సంవత్సరం ఆగస్టు మాసంలో 58 వ గురుపూజా మహోత్సవానికి పళని పంచామృతం చేయించటానికి మద్రాసునుండి కావలసిన సంభారాలన్నీ ఒకనాడు ముందుగానే తెప్పించినారు. ఐతే ఆ పంచామృతం చేయగలవారెవ్వరూ ఆ సమయాన నారాయణ వరంలో లేరు. కైంకర్య సమాజంవారు, భక్తులు విచారంతో స్వామిపైనే భారం వేసి స్వామివారి అనుగ్రహం కోసం ఎదురు చూస్తున్నారు. ఉన్నట్లుండి రాత్రి 11 గంటల సమయాన ఒక వృద్ధ బ్రాహ్మణుడు వచ్చి, తాను పళనినుండి వచ్చినాననీ పళని పంచామృతం తనకు చేయ వచ్చునని చెప్పినాడు. స్వామివారు ఆపత్కాల బాంధవులై తమను ఆదుకున్నారని భక్తులు సంతోషించినారు. తెల్లవారి ఆ బ్రాహ్మణుడు స్నానసంధ్యలు ముగించి అభిషేకానికి కావలసి నంత పళని పంచామృతం చేసి ఇచ్చినాడు. అభిషేకం జరిగిన తరువాత పళని బ్రాహ్మణుని కోసం అందరూ వెదకినారు కాని అతని జాడ లేదు. అంతదూరం నుండి వచ్చి ఇంత గొప్ప సహాయం చేసినవాడు ఎవరికీ చెప్పక చేయక ప్రసాదమైనా తీసుకోకుండా వెళ్ళిపోతాడా? ఆ వచ్చినవాడు నిజంగా పళని వాస్తవ్యుడా ? లేక పారుని వేషంలో వచ్చి, తన భక్తులను ఆదుకొన్న సొరకాయల స్వామివారా ?

1960వ సంవత్సరం గురుపూజా కార్యక్రమాలు ముగిసిన మూడు వారాలకు దేవాలయపు బావి నీటిలో దుర్వాసన వచ్చింది. ఆ జలం స్వామివారి నిత్యకైంకర్యానికి

పనికిరాకుండా పోయింది. కైంకర్యసమాజం వారు ఆ నీరంతా తోడించి పూడిక తీయించ టానికి తీర్మానించుకున్నారు. ఇంతలో బాగా వర్షాలు కురిసినవి. అరుణానదీ ప్రవాహం వెల్లువలతో బావి నీరు పైకి వచ్చింది. అంత నీరు తోడటం పూడిక తీయటం సాధ్యం కాదని ప్రయత్నం విరమించుకున్నారు. రెండు వారాల తరువాత నీళ్ళు తోడటానికి కూలీలు వచ్చినారు. స్వామిని పూజించి కొబ్బరికాయ కొట్టి కర్పూరహారతి వెలిగించి కార్యసాఫల్యం కోసం వేడుకొని బావిలో చేద వేసి మొదటి బొక్కెన నీరు తోడిచూస్తే నీళ్ళలో దుర్వాసన మటుమాయమై పోయింది. అక్కడ కూడిన వారందరూ ఆశ్చర్యానందాలలో తేలిపోయి, స్వామివారి మహిమను వేనోళ్ళ పొగడినారు.

ఇంతవరకు పేర్కొన్నవి పాతభక్తుల అనుభవాలు. సొరకాయల స్వామి వారిని కొలుస్తున్న ఆధునిక భక్తుల అనుభవాలు కూడ ఇక్కడ పేర్కొనటం సముచితంగా ఉంటుంది.

**1. డా॥ వి.ఎ.దేవసేనాపతి, ఎం.ఏ., పిహెచ్.డి, 40-1, ముత్యాలచెట్టి వీథి, వేపేరి, మద్రాసు-7, 1-7-1992**

(శ్రీ దేవసేనాపతి గారు సొరకాయల స్వామి కైంకర్య సమాజం ప్రస్తుతాధ్యక్షులు. శ్రీ స్వామివారి చరిత్రను లోకానికి చాటిన రత్నసభాపతి గారికి వీరు మునిమనుమలు. స్వామివారి చరిత్రను ఇంగ్లీషులో రచించిన భక్తవత్సలంగారి దౌహిత్రులు. కృపాభక్తవత్సలం, ఆర్ముగం పిళ్ళేల తనయులు)

శ్రీ రత్నసభాపతిగారి పుత్రపుత్రీ సంతతి వాళ్ళమంతా శ్రీ సొరకాయల స్వామిని కులగురువుగా గృహదేవతగా తరతరాలనుండి ఆరాధిస్తున్నాము. మా కుటుంబాలలో కాలు నొచ్చినా, కడుపు నొచ్చినా, సిరులు పొంగినా, శిరములు క్రుంగినా సొరకాయల స్వామి అనుగ్రహంగానే భావిస్తాము. మా పూర్వుల వలె నేను, నా పరివారము స్వామివారి విశేషాను గ్రహానికి పాత్రులమైనాము. మా చిన్నమ్మాయి నిరంజని 11-7-1946నాడు పుట్టింది. పుట్టుకతోనే ఆమె కుడి అరచేయి వెనుకభాగాన పెద్ద వ్రణం ఉంది. వ్రణం బాధ మూలంగా శిశువు నిరంతరం ఏడుస్తూనే ఉండింది. డాక్టర్లు మణికట్టు వరకు నరికి వేయకపోతే పూర్తి చేతికంతా ముప్పు కలుగుతుందన్నారు. ఆ పిల్లకు జీవితాంతం ఈ లోపం ఉండిపోతుందని మా అత్తగారు చాలా దుఃఖించినారు. తల్లికూతుళ్ళు ఇద్దరూ శిశువును ఒడిలో పెట్టుకొని రేయింబవళ్ళు సొరకాయల స్వామిని ప్రార్థించినారు. ఒకరాత్రి సొరకాయల స్వామి గదిలోనికి

వచ్చి శిశువు చేతిని నిమిరినట్లు నా భార్యకు అనుభూతి కలిగింది. వెంటనే శిశువు రోదనం ఆగిపోయింది. వ్రణం పగిలి శీఘ్రంగా నయమైనది. ఆనాటినుండి (జూలై 1946) ప్రతి పౌర్ణమినాడు మేము సొరకాయల స్వామికి విశేషారాధనం చేస్తున్నాము. ఆ శిశువు పెరిగి పెద్దదై ఆ చేతితోనే పరీక్షలు వ్రాసి 1966లో ప్రథమశ్రేణి పట్టభద్రురాలై యూనివర్సిటీ బహుమతి గెల్చుకొని మద్రాసు మెడికల్ కాలేజి రేడియాలజిస్టును పాణిగ్రహణం చేసి సంతాన సంతోష సౌభాగ్యాలతో వర్ధిల్లుతున్నది.

నా పెద్ద కొడుకు రామనాథన్ సొరకాయల స్వామి ఆరాధనోత్సవం నాడే 18-8-1950 జన్మించినాడు. మద్రాసు విశ్వవిద్యాలయం ఎం.బి.బి.ఎస్., లండన్ విశ్వ విద్యాలయం పిహెచ్.డి డిగ్రీలు పొందినాడు. ఆతని విశేషాధ్యయనం రోగనిరోధక విజ్ఞానం, అందులోను కుష్ఠరోగ నిరోధక విజ్ఞానం. సొరకాయల స్వామి ఎందరో కుష్ఠరోగులకు ఆరోగ్యం ప్రసాదించటం మనకు తెలుసు. స్వామికి ఇష్టమైనట్టి ఆ సేవాకార్యంలోనే మావాడు పేదసాదలకు ఉచితసేవ చేస్తున్నాడు.

1957లో నా భార్య చూలాలుగా ఉండినప్పుడొకనాడు గర్భస్రావమయ్యే లక్షణాలు కనపడినవి. అప్పుడే మా మామగారు ఆమెను తమ ఇంటికి తోడ్కొని పోవటానికి వచ్చినారు. ఆనాడు వారింటికి శ్రీలశ్రీ పన్రిమలై స్వామివారు రానున్నారు. తండ్రికి తన బాధ చెప్పుకోలేక సొరకాయల స్వామి చరిత్రం పారాయణం చేస్తున్నది. సొరకాయల స్వామి మా అమ్మమ్మ జ్ఞానాంబళ్ పెండ్లినాడు వివాహ మంటపంలో ఉన్నట్లుండి " మా తమ్ముడు వస్తున్నాడు, మా తమ్ముడు వస్తున్నాడు" అంటూ కన్నుకుట్టిస్వామి ఆగమనాన్ని సూచించే ఘట్టం చదువుతున్నది. అప్పుడామె మనస్సులో ఆ వచ్చేది సొరకాయలస్వామికి ఆధ్యాత్మికంగా తమ్ముడైన పన్రిమలై స్వామివారా లేక తన పెద్దకొడుక్కు (పుట్టబోయే) తమ్ముడా అనే భావం తళుక్కుమన్నది. అదొక శుభసూచన. డాక్టర్లంతా దినాలు తక్కువ బిడ్డ పుడుతాడని భయపడ్డారు. కాని సుఖప్రసవం జరిగింది. ఆ శిశువే స్వామినాథన్‌గా పెరిగి పెద్దవాడై సైకాలజీలో అత్యుత్తమ డిగ్రీలు సంపాదించి మద్రాసు విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడుగా ఉన్నాడు. ఇది సొరకాయల స్వామి అనుగ్రహం కాక మరేమిటి?

మా పెద్దమ్మాయి ఉష సొరకాయలస్వామివారి సంపూర్ణానుగ్రహానికి పాత్రురాలు. ఆమె గృహవిజ్ఞానంలో పట్టభద్రురాలు. భర్త బెంగుళూరు లయన్స్‌క్లబ్బు పక్షాన నేత్రచికిత్సాశిబిరాలు నిర్వహిస్తుంటే ఆమె ఉచితసేవలు చేస్తుంటుంది. మా అల్లుడు జాలహళ్ళి

కేంద్రీయ విద్యాలయం బెంగుళూరులో ఉత్తమోపాధ్యాయుడుగా జాతీయ బహుమతిని అందుకున్నాడు. ఈవిధంగా స్వామి మా పరివారాన్ని కంటికి రెప్పగా కాపాడుతున్నారు.

## 2. ఎమ్.యతిరాజులు నాయుడు, 26 వి.వి.కోయిల్‌వీధి, కోసపేట, మద్రాసు - 600012 (విశ్రాంత రైల్వే అధికారి) , 1-7-1992.

నేను 1944 నుండి 1982 దాక దక్షిణరైల్వేలో ఉద్యోగం చేసినాను. మొదటిసారి 1974లో నారాయణవరం సొరకాయల స్వామి సమాధిని దర్శించినాను. ప్రథమ దర్శనంలోనే స్వామి నన్ను ఆకట్టుకున్నారు. ఆనాటినుండి నేను ఏ పని చేస్తున్నా స్వామి నామం ఎల్లప్పుడూ స్మరిస్తుంటాను. నేను సైదాపేట రైల్వేస్టేషన్ చీఫ్ బుకింగ్ క్లార్కుగా ఉన్నప్పుడొక వింత జరిగింది. టిక్కెట్లు డబ్బు మొదలైనవన్నీ భద్రంగా ఉంచటం నా బాధ్యత. 1977 సంవత్సరంలో ఒకనాడు మా బుకింగ్ క్లార్కు, కౌంటరులో నూరు టికట్లే ఉన్నందున క్రోంపేట స్టేషనుకు పోయే టికెట్లు ఇంకా కావాలెనని కోరినాడు. నేను స్టాక్‌రూం లోనికి పోయి క్రోంపేట టికెట్లన్నీ తీసినాను. కౌంటర్‌లోని క్లోజింగ్ నంబరునుండి వెయ్యి టికెట్లు కనబడలేదు. అటు తరువాత నెంబర్ల టికెట్లన్నీ ఉన్నాయి. నాకు భయం వేసింది. ఎవడో కుతంత్రం చేసి ఉంటాడని ఆందోళన పడ్డాను. ఆ వెయ్యి టికెట్ల విలువ 450/- రూపాయలే ఐనా పై అధికారుల ఆగ్రహానికి, పోలీసువారి జోక్యానికి గురి ఔతానని వ్యాకులపడ్డాను. 1944 నుండి ఒక్క మచ్చ లేకుండా ఉద్యోగ విధులు నీతి నిజాయితీలతో నిర్వహిస్తున్న నాకు ఇదొక సవాలుగా తోచింది. సొరకాయలస్వామి చరణాలే భయహరణాలు కష్టతరణాలుగా నమ్మినాను. ఆ రాత్రి నా కంటికి నిద్దుర రాలేదు. స్వామినామం జపిస్తూ రాత్రంతా గడిపినాను. తెల్లవారు జామున మగత నిద్రలో మేఘగర్జనం ధ్వనితో తమిళభాషలో "బిడ్డా! ఎందుకేడుస్తున్నావురా! దిగులెందుకు? లే! నీ స్టేషనుకు పో! పోయినవి మూడవదాంట్లో ఉన్నాయి" అనే ఆదేశం వినపడింది. నేను వెంటనే లేచి ఉదయం ఆరు గంటలకే స్టేషను చేరుకున్నాను. కాసేపటికి నా మెదడులో ఒక మెరుపు మెరిసింది. స్టాక్‌రూంలో నుంగంబాక్కం రైల్వేస్టేషనుకు, పలవంతంగళ్ రైల్వేస్టేషనుకు పోయే టిక్కెట్లుండే సొరగుల్లో కాబోలు అనుకున్నాను. సైదాపేట నుండి మద్రాసు బీచ్ స్టేషనుకు పోయేదారిలో పలవంతంగళ్ మూడవది. కనుక పలవంతంగళ్ స్టేషన్ టికెట్ల స్టాకులో ముందుగా వెదకినాను. అందులో నా చేతికి ముందుగా తాకినది ఇందాక పోయిందనుకున్న క్రోంపేట 1000 టికెట్ల కట్ట! నా ఆశ్చర్యానికి ఆనందానికి అవధులు లేవు. పొరపాటున ఒక స్టేషను టికెట్ల కట్ట మరొక స్టేషన్ టికెట్ల కట్టల్లో మేము స్టాకు

తీసుకున్నపుడే కలిసిపోయి ఉంటుంది. స్వామివారు ఆపద్బాంధవులై నా కష్టం తీర్చినందుకు కన్నీటి కృతజ్ఞతలు తెలుపుకున్నాను.

ఇంకొక ఆశ్చర్యకరమైన స్వామి లీల మనవిచేస్తాను. సొరకాయలస్వామి కైంకర్య సమాజం ప్రస్తుత కార్యదర్శి శ్రీ ఎం.రామచంద్రన్‌గారు 1985లో నాకొక పని పురమాయించినారు. సేంట్ థామస్‌మౌంట్‌లో ఉన్న హిందుస్తాన్ ఇంజనీరింగ్ ఇన్స్టిట్యూట్ లో తమ అబ్బాయిని చేర్పించటానికై ఆ సంస్థవారి ఎలక్ట్రానిక్ ఇంజనీరింగ్ కోర్సుకు ప్రభుత్వామోదం ఉందో లేదో కనుక్కొని రమ్మన్నారు. అక్కడికి చేరుకోవటానికి 18 సి బస్సు పట్టుకోవాలె కనుక నేను మద్రాసు పారిస్ కార్నరుకు ఉదయం 8.30 గంటలకే చేరినాను. బస్సుకోసం ప్రతీక్షిస్తుండగా ఒకచోట ఆఫీసర్ల గుంపు కనపడింది. వీధి సాముద్రికం జోస్యం చెప్పే ఒక పెద్దమనిషి చుట్టు వాళ్ళంతా మూగినారు. ఆతడు తలా పది పైసలు తీసుకొని జోస్యం చెప్పుతున్నాడు. అటువంటి వాళ్ళపై నాకు విశ్వాసం లేకున్నా కుతూహలం పట్టలేక నేనూ తల దూర్చినాను. అక్కడ చినిగిన గుడ్డలతో ఎదుట ఒక చిరుదీపం పెట్టుకొని చెదురుమదురుగా పడిఉన్న తెల్ల కాగితం ముక్కల మధ్యన నేలకు వాల్చిన తలతో ఒక వృద్ధమూర్తిని గమనించినాను. ఆయన ఒక తెల్లకాగితం తీసి దీపశిఖపై పెట్టి పదిపైసలు ఇచ్చినవారి పేరు ఉచ్చరిస్తున్నాడు. దీపజ్వాలకు కాగితం కాలటం లేదు, సరికదా దానిపై తీరు తీరు పక్షుల మృగాల మందిరాల చిత్రాలు వస్తున్నాయి. వచ్చే బొమ్మలను బట్టి పృచ్ఛకులకు ఆ వృద్ధమూర్తి మంచి చెడుగులు జోస్యం చెప్పుతున్నాడు. ఆయన ఎవ్వరి ముఖమూ చూడటం లేదు. దించిన తల ఎత్తకుండానే తోసుకవచ్చే జనాన్ని చీదరిస్తున్నాడు, తిడుతున్నాడు. వాళ్ళేమో తమ తమ ఆఫీసులకు సకాలంలో చేరుకోవటానికై అహమహమికగా తోసుకపడుతున్నారు. నేను కూడ కుతూహలం కొద్ది పదిపైసలిచ్చి నా పేరు చెప్పినాను. తల యెత్తకుండానే ఆయన ఒక తెల్లకాగితం ముక్క దీపశిఖపై పట్టుకున్నాడు. ఆ కాగితంపైన తలపై పాగా పొడవైన గడ్డమూ ధరించిన మనుష్యాకారం కనపడింది. ఇంతదాకా ఎవరి ముఖమూ చూడని వృద్ధుడు తలయెత్తి ఆశ్చర్యంతో మెరిసే కన్నులతో నా ముఖం చూస్తూ వినమ్రంగా సాదరంగా "నీతో ఎల్లపుడూ ఒక మహాయోగి ఉన్నాడు కనుక నీవు జోస్యం చెప్పించుకోవటానికి ఎవ్వరి వద్దకూ పోనక్కరలేదు. ఆ మహానుభావుడే నీ యోగక్షేమాలు చూసుకుంటాడు. నీవు ఎవ్వరినీ అడుగ పనిలేదు. మంచికి గాని చెడ్డకు గాని ఆయనే నీవెంట సదా ఉంటాడు. మీకు నా నమస్కారాలు. ఇక మీరు వెళ్ళవచ్చు" అన్నాడు. వచ్చినపని మరచిపోయి నేను సుమారు అరగంట దాకా అక్కడే అవాక్కుగా నిలిచి పోయినాను. ఎట్టకేలకు

తెలివి తెచ్చుకొని సేంట్ థామస్ మౌంటుకు పోయే బస్సెక్కినాను. నావంటి పేద ముసలి వానిపై ఆ స్వామి కురిపే కారుణ్యావృష్టి ఏమని వర్ణించను! వయో భారంతో వచ్చే ఏ అనారోగ్యానికైనా స్వామి నామమే నాకు దివ్యౌషధం. ఇంత వయసు వచ్చినా నాకేరోగమూ రొష్టూ లేకుండా ఆ స్వామి నన్ను కాపాడుతున్నారు. నా చేతనైన సేవ చేయించుకుంటున్నారు. ఈనాటికి గూడ నా అనుభవం ఇదే. ఇందులో కాసంతైనా అతిశయోక్తి లేదు. శ్రీ సొరకాయల స్వామి మనలందరినీ దీర్ఘాయురారోగ్యాలతో సిరిసంపదలతో కటాక్షించుగాక !

### 3. డి.హరికృష్ణమరాజు, కె.ఎన్.రోడ్డు, పుత్తూరు, 5-7-1992

నాకు వరుసగా ముగ్గురు ఆడపిల్లలే కలిగినారు. పురుష సంతానం లేని చింత మమ్ములను పీడిస్తుండగా ఒక పెద్దమనిషి నారాయణవరం సొరకాయల స్వామిని సేవిస్తే కొడుకు పుడుతాడని సలహా యిచ్చినాడు. ఆనాటినుండి ప్రతి శుక్రవారం పుత్తూరు నుండి నారాయణవరం వెళ్ళి సొరకాయలస్వామి సమాధిని పూజించి గుండంలోని విభూతిని ప్రసాదంగా సేవించే పని పెట్టుకున్నాను. ఈ వ్రతం ఏడాది సాగింది. స్వామికి దయ కలిగింది. నా కోరిక ఫలించింది. నాకు కొడుకును ప్రసాదించి నా ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచినారు సొరకాయల తాతయ్య. పెరటిలో ఉన్న పెన్నిధివలె వాకిటిలో ఉన్న వాంఛితార్థ ప్రదాయి శ్రీ సొరకాయల స్వామివారిని ఇంతకాలం కనుగొనలేక పోయినందుకు నిరుత్సాహపడక ఇప్పటికైనా స్వామి అనుగ్రహానికి పాత్రుడనైనందుకు ఈ జన్మను ధన్యం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నాను. ఇల్లు కట్టి 'సొరకాయల స్వామి నిలయం' అని పేరు పెట్టి మిద్దె పైభాగంలో స్వామి మందిరం నిర్మించి అందులో వారి పటం పెట్టుకొని ఆరాధిస్తున్నాము. నాకు ఏ సమస్య వచ్చినా, ఏ కష్టం కలిగినా నారాయణ వరం పోతాను. స్వామి సమాధికి మొరపెట్టుకుంటాను. కష్టాలు కరిగిపోతాయి. మనశ్శాంతి లభిస్తుంది. స్వామిని తలచుకొని ఏ కార్యం తలపెట్టినా జయం సిద్ధిస్తుంది. పాలక మండలి సభ్యుడుగా సేవచేసే భాగ్యం కూడ నాకు స్వామివారు ప్రసాదించినారు.

### 4. సి.వి.వరదరాజు . 52, తిరుచానూరు రోడ్డు, తిరుపతి, 8-7-1992

నా యెనిమిదవ యేట 1940లో మా తండ్రి శ్రీమాన్ కోమండూరు రామానుజం గారు (రేణిగుంట స్టేషన్ మాస్టరు) పరమపదించినారు. మా పెద్దన్నయ్య కుటుంబ పెత్తనం చేపట్టి దుష్టసాంగత్యంతో ఇల్లు గుల్లచేసి మమ్ముల కష్టాల కడలిలో

ముంచినాడు. అట్టి దుస్థితిలో 1960 సంవత్సరం శ్రీ సొరకాయల స్వామి కైంకర్య సమాజం కార్యదర్శి జె.వి. శ్రీనివాసులు నాయుడు (ఎక్జిక్యూటివ్ ఇంజనీరు) వెంట తిరుపతినుండి నారాయణ వరం వెళ్ళి స్వామి సమాధిని మొదటిసారి దర్శించినాను. సంసార కష్టములే కాదు భవజలధిని గూడ తరింపజేసే నౌకను కనుగొన్నాను. ఆనాటినుండి మా పరిస్థితులు మారుతూ వచ్చినవి. కొలిచినవారికి కొంగుబంగారం, తలచినవారికి తరుగని నిధి సొరకాయలస్వామి.

ఒకసారి మా తమ్ముడు దేవరాజుకు అద్భుతమైన అనుభవం కలిగింది. రాయవేలూరు వద్ద తొరపాడు అనే గ్రామంలో గురి చెప్పుతారు. గురి చెప్పించుకునే వాళ్ళు తమ పెద్దలను గాని, కులదైవతమును గాని మనసులో తలచుకొని కర్పూరం వెలిగిస్తారు. కర్పూరం వెలిగితే గురి చూచే వ్యక్తి మనం స్మరించే దేవత పక్షాన గురి చెప్పుతాడు, వెలుగక పోతే చెప్పడు. శ్రీ సొరకాయల తాతను స్మరించి కర్పూరం వెలిగించుమని మా తమ్మునికి చెప్పి పంపినాను. అతడు అట్లే చేసినాడు. గురి చెప్పే వ్యక్తి కర్పూరజ్యోతిలో సొరకాయల స్వామి దర్శనం ఇచ్చినట్లు చెప్పినాడు. మా తమ్ముని సంతోషానికి ఆశ్చర్యానికి అవధులు లేవు. వాని భక్తి కూడ బాగా దృఢపడింది.

ఇంకొక తమ్ముడు తిరువెంగడంకు స్వామిపై అంత విశ్వాసం లేదు. అతడు ఒకనాడు ఇంట్లోనే బంతి ఆడుతుండగా అది ఎగిరిపోయి గోడకు వ్రేలాడుతున్న కాలెండరులోని స్వామి తలకు తగిలింది. వెంటనే తిరువెంగడం తలలో బొడిపె లేచింది. బంతి స్వామి బొమ్మ తలకు తగిలితే బంతి ఆడేవాని తలపై బొడిపె లేవటం నమ్మరాని అద్భుతం కదా! నమ్మనివాని తలలో నమ్మకం కలిగించే బొడిపె అది. స్వామిని క్షమాపణ వేడుకొని బొడిపెకు స్వామి విభూతి రాసుకున్నాడు మా తమ్ముడు. తత్క్షణమే అది కరిగిపోయింది. బొడిపె లేచినదానికంటె బొడిపె మాయం కావటం ఇంకా గొప్ప అద్భుతం. అంతటితో తిరువెంగడం తిక్క కుదిరింది. వాడు స్వామి భక్తుడైనాడు.

షిర్డీలోని సాయిబాబా, నారాయణవరంలోని సొరకాయలస్వామి ఒకరే. వారే వీరు, వీరే వారు. మా దైనందిన జీవితాల్లో ఇటువంటి అద్భుతాలు లెక్కకు మిక్కిలి. "నీవు నన్ను స్మరిస్తే నిన్ను గుర్తుంచుకుంటాను" అని స్వామివారు చేసిన ప్రతిజ్ఞ అక్షరసత్యం, నిత్యసత్యం.

## 5. ఎం. రామచంద్రన్, ఎం.ఎ, ఎం.కాం, ఎం.ఇడి, బి.ఎల్.,

కార్యదర్శి శ్రీ సొరకాయల స్వామి కైంకర్య సమాజం, 9 - అరుణాచల పండారం వీథి, పెరుమాళ్ పేట, వేపేరి, మద్రాసు - 600007. 18-7-1992.

అది 1990 సంవత్సరం. శ్రీ సొరకాయలస్వామి వారి 88వ గురుపూజా మహోత్సవాలు జయప్రదంగా ముగిసినవి. చివరినాడు నేను కొందరు ఆప్తులతో కలసి నారాయణవరానికి నాలుగైదు మైళ్ళ దూరంలో ఉన్న కైలాస కోన జలపాతాలు చూడ బోయినాను. అక్కడి మనోహర దృశ్యాలు చూస్తూ రెండు గంటలు గడిపి మరల నారాయణ వరానికి తిరుగు ప్రయాణమైనాను. కైలాసకోన నుండి పుత్తూరుకు పోయే బస్సు ఎక్కినాము. కొండ ప్రదేశం మొరటు దారిలో ఒక మైలు గడచిన తరువాత ట్రంకు రోడ్డులో ప్రయాణం. అది పుత్తూరుకు పోయే ప్రధాన మార్గంలో కలుస్తుంది. మా బస్సు ట్రంకురోడ్డు, ప్రధాన మార్గంలో కలిసే కూడలి సమీపిస్తుండగా ప్రధానమార్గంలో మరొక బస్సు మహావేగంతో కూడలివైపు రావటం డ్రైవరు గమనించినాడు. ఆ బస్సు కూడలి దాటిపోయిన తరువాతనే ప్రధానమార్గంలో ప్రవేశించే ఉద్దేశంతో డ్రైవరు మా బస్సును నిలపటానికి ప్రయత్నించినాడు. కాని బ్రేకులు పని చేయలేదు. డ్రైవరుకు మాకు ఎటూ తోచలేదు. రెండు బస్సులు కూడలిలో గుద్దుకొని మేము ఏమైపోతామో అని ఆందోళన పడుతూ కండ్లు మూసుకొని శ్రీ సొరకాయలస్వామికి శరణాగతి చేసినాము. స్వామి తప్ప ఈ దుర్ఘటన నుండి మమ్ముల నెవరూ రక్షించలేరని అరచేతిలో ప్రాణాలు పెట్టుకొని వేడుకున్నాము. శరణాగత రక్షకుడు ఆపద్బాంధవుడు ఐన స్వామి, దూసుకవచ్చే బస్సుకంటె ఒక క్షణం ముందే మా బస్సును కూడలి దాటించినారు. ఎదురుగా ఉన్న ఒక మట్టికుప్పను ఢీకొని మా బస్సు నిలిచిపోయింది. ఘోరప్రమాదం తప్పి మా ప్రాణాలు దక్కినవి. మట్టికుప్పతో ఢీకొన్నందుకు గాని ఆ కుదుపుకు గాని మాకు ఏ బాధ కలుగలేదు. ఒక్క తృటిలో దుర్మరణంనుండి స్వామి మమ్ముల రక్షించినారు. అందుకే స్వామిని ప్రణతార్తిహరుడన్నారు.

ఇటీవల జరిగిన మరొక లీల చిత్తగించండి. 3-8-1992 నుండి జరుగబోయే స్వామివారి 90వ ఆరాధనోత్సవాల ఏర్పాట్లు చూడటానికై ఒకనాడు నారాయణవరం వెళ్ళినాను. ఆనాడు రాత్రి 8.30 గంటలకు నేను తప్పనిసరిగా మరల మద్రాసులో ఉండాలె. కనుక నారాయణవరంలో పని ముగించుకొని రైలుబండి వేళకంటె ముందుగానే పుత్తూరు చేరినాను.

తిరుపతినుండి మద్రాసుకు పోయే సప్తగిరి సాయం 6.20 గంటలకు పుత్తూరు వస్తుంది. కాని ఆనాడు సప్తగిరి చాలా ఆలస్యంగా వస్తుందని తెలిసింది. రాత్రి 8.30 గంటల లోగా మద్రాసుకు చేరకపోతే మాట దక్కదని నాలో తీవ్రమైన ఆందోళన చెలరేగింది. నా పరువు కాపాడవలసిందిగా స్వామిని ప్రార్థిస్తూ ప్లాటుఫారం బెంచిపై కూర్చున్నాను. స్వామి నా మొరాలకించినారు. బొంబాయినుండి మద్రాసు పోయే ఎక్స్‌ప్రెస్ రైలు అనుకోకుండా పుత్తూరు స్టేషనులో ఆగింది. నేను వెంటనే ఆ బండి ఎక్కి రాత్రి 8 గంటలకే మద్రాసు చేరుకున్నాను. ఆగకూడని స్టేషనులో ఈ ఎక్స్‌ప్రెస్ బండి ఎందుకు ఆగిందని విచారిస్తే ఇంజనులో హఠాత్తుగా ఏదో చిన్నలోపం వచ్చినందున బండిని నిలిపినారని తెలిసింది. నా పరువు కాపాడటానికే స్వామి ఆ రైలుబండిని పుత్తూరులో ఆపినారని నా దృఢవిశ్వాసం. శ్రీ సారకాయలస్వామి భక్తుల పాలిటి ఆపద్బాంధవుడు. స్వామివారి అనుగ్రహం మన అందరికీ ఎప్పుడు లభించుగాక !

**6. డా॥ ఎం.వి.కృష్ణారెడ్డి - ప్రశాంతినిలయం, పుట్టపర్తి-515134, 23-11-1998.**

మా తల్లి మన్నెం శేషమ్మ (1890-1927) నెల్లూరు మునసబు ఆనం రంగారెడ్డి తులసమ్మల ప్రథమపుత్రిక 9 సంవత్సరాల బాలికగా ఉండినపుడు ఆమె కుడిచేయి నడిమివ్రేలు బాగా వాచిపోయి కష్టపెట్టింది. ఏ వైద్యాలు పని చేయలేదు. సారకాయల స్వామి మాహాత్మ్యం విన్న తల్లిదండ్రులామెను నారాయణవరం తీసుక పోయినారు. అప్పుడే ఎచటికో బయలుదేరిన స్వామి తమ ప్రయాణం ఆపి "ఇరుదురా! ఇంగే కుట్టి వరదు" అనుకుంటూ శేషమ్మను ఒడిలోనికి తీసుకొని ఆమె ఒడలంతా నిమిరి వాచిపోయిన వ్రేలును మెల్లగా తీడినారు. వెంటనే వాపు బాధ తొలగిపోయినవి. అప్పటినుండి శేషమ్మ ఆమె తల్లిదండ్రులు సారకాయల స్వామి భక్తులైనారు. శేషమ్మకు 17వ యేట డా॥ మన్నెం శేషాద్రిరెడ్డితో వివాహం జరిగింది. శేషాద్రిరెడ్డి గారు కూడ స్వామి భక్తులైనారు. ఆయన (1888-1932) మద్రాసులో గొప్ప శస్త్రవైద్యుడుగా పేరు పొందినారు. ఆయన సేవలకు మెచ్చి బ్రిటిషు ప్రభుత్వం రావు సాహెబు బిరుదమిచ్చింది. ఆ దంపతుల సంతానం రంగమ్మ, రాజలక్ష్మమ్మ, శ్రీనివాసరెడ్డి, డా॥ రాజశేఖరరెడ్డి, డా॥ ఎం.వి.కృష్ణారెడ్డి, ధన్వంతరి రెడ్డి, ఆత్రేయరెడ్డి ఏడ్గురం. మా తల్లిదండ్రుల మూలంగా మేము సారకాయల స్వామి భక్తులమైనాము. స్వామి సమాధి చెందిన తరువాత వారి సమాధి పైకప్పు మా తల్లిగారే కట్టించినారు. ఆమె 1927 సంవత్సరం శ్రావణ బహుళ ఏకాదశి నాడు సారకాయలస్వామి పటం ఎదురుగా పెట్టుకొని రామనామం చేస్తూ

స్వామి పాదాలలో కలసిపోయిన ధన్యురాలు. ఆమె నిర్యాణానంతరం శేషాద్రిరెడ్డిగారు సొరకాయల స్వామి సమాజానికి నెల్లూరులో 2 ఎకరాల మాగాణి దానం చేసి దానిపై వచ్చే ఆదాయం స్వామిసేవకోసం పంపించేవారు. మా నాయనగారి తరువాత ఆ భూమికి మేము ట్రస్టీలమైనాము. కొంతకాలం తరువాత భూమి కౌలు సరిగా రాకపోతే ఆ భూమిని అమ్మి రూ.20,000/- నెల్లూరు ఎస్.బి.ఐలో వేసి దానిపై వచ్చే మిత్తిని సొరకాయలస్వామి కైంకర్య సమాజానికి పంపుతుండినాము. 20 ఏండ్ల తరువాత బాంకువారు గడువు పొడిగించ నిరాకరించి మిత్తి ఇవ్వటం మానివేసినారు. అప్పటికి వృద్ధియైన మొత్తం రూ.40,000/- సమాజం అధ్యక్ష కార్యదర్శుల కోరిక మేరకు సమాజం వారి మద్రాసు ఎకౌంటులో 1997లో చేర్చినాము.

# తృతీయ భాగం

## సమకాలీన మహానుభావులు

కారణజన్ములైన మహాపురుషులు యోగులు సిద్ధులు ఒక్కొక్కరు ఒక్కొక్క నిర్దిష్టకార్యం కోసం భూమిపై అవతరిస్తారు. తమ కర్తవ్యం పూర్తికాగానే వెళ్ళిపోతారు. ఒకే కాలంలో ఇటువంటి మహాపురుషులు సమీపంలో ఉన్నా సుదూరంలో ఉన్నా ఒకరు చేసేపని ఇంకొకరు ఎరుగుదురు. పరస్పరం తటస్థపడినపుడు హృదయాలతో కన్నులతో మౌనభాషలో మాట్లాడుకుంటారు. ఒకరినొకరు సంభావించుకుంటారు. సారకాయలస్వామికి సమకాలీనులైన మహాపురుషులు కొందరు వారికంటె ముందు, కొందరు వారి తరువాత తమతమ దేహాలు చాలించినవారున్నారు. కొందరు స్వామివారిని ఆశ్రయించి మంత్రోపదేశం పొంది మహితాత్ములైనవారున్నారు. ఈ గ్రంథం ప్రథమ ద్వితీయభాగాల్లో కన్నుకుట్టిస్వామి, మద్రాసు మహమ్మదీయయోగి, చట్టిపరదేశి, కాశీస్వామి, శివరాజయోగి రాజమ్మాళ్, భగవంత గురువులు, మేడం బ్లావట్స్కీ, కర్నల్ ఆల్కాట్ ప్రభృతుల ప్రసక్తి వచ్చింది. తిరుచురాపల్లి మండలంలో మహామహిమోపేతులుగా ప్రసిద్ధికెక్కిన తాయుమానవర్లు కూడ సారకాయల స్వామికి సమకాలీనులే. కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్ళే పుత్తూరులో కట్టించిన సత్రం లెక్కల్లో స్వామివారి ప్రస్తావన ఉండడం చేత వారు క్రీ.శ. 1700 ప్రాంతంలో జన్మించి, 1902 సంవత్సరంలో సమాధి చెందటం చేత 202 సంవత్సరాలు బ్రతికినట్లుగా చారిత్రకులు నిర్ణయించినారు. స్వామి 1902 లో మద్రాసుకు వచ్చినప్పుడు వి. యతిరాజులు నాయుడు ఇంట్లో వారి అక్క శ్రీమతి సుబ్బరావమ్మ అడిగిన ప్రశ్నకు తమ వయస్సు అప్పటికి 500 ఏండ్లన్నారు. శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీ దయానంద సరస్వతి, లాహిరీ మహాశయుల చేత సంభావింపబడిన తెలుగు యోగి వారణాసి పంచగంగా ఘాట్‌లో బ్రహ్మరంధ్రం భేదించుకొని మహాసమాధి చెందిన త్రైలింగస్వామి 280 ఏండ్లు బ్రతికినట్లు చారిత్రకాధారా లున్నవి. లాహిరీ మహాశయుల గురువులు మహావతార్ బాబాజీ వయస్సు అప్పటికే 1200 ఏండ్లంటారు. కొందరు బాబాజీ ఇప్పటికీ ఉన్నారంటారు.

సొరకాయల స్వామివారి సమకాలీనులు, వారి చరమావస్థలో జన్మించిన యోగులు సిద్ధ పురుషులు భారతదేశం వివిధప్రాంతాలలో ఎందరో ఉన్నారు. ఏనుగు పాదంలో అన్నింటి పాదాలు ఇమిడినట్లు సొరకాయలస్వామి దీర్ఘ జీవితకాలంలో వీళ్ళందరి జీవిత కాలాలు ఇమిడి పోతాయి. వంగదేశీయులైన శ్యామాచరణ లాహిరీ (1828 - 1895), రామకృష్ణ పరమహంస (1836 - 1886), శారదామాయి (1853 - 1920), యుక్తేశ్వరగిరి (1855 - 1936), స్వామి వివేకానంద (1862 - 1902), కుసుమహరనాథులు (1865 - 1927), శ్రీ అరవిందులు (1872 - 1950), సౌరాష్ట్రంలో జలరాం బాపా (1799 - 1881), దయానంద సరస్వతి (1824 - 1940), పంజాబ్‌లో రామతీర్థస్వామి (1873 - 1906), ఫతేగఢ్ మహాత్మా శ్రీరామచంద్రజీ (1873 - 1931), కాశీలో త్రైలింగస్వామి (తెలుగువారు 1607 - 1887), గుజరాతు, రాజస్థాన్‌లలో ప్రకాశానంద (తెలుగువారు 1871 - 1963), మహారాష్ట్రంలో అక్కలకోట స్వామి సమర్థులు (? - 1878), షిర్డీ సాయిబాబా (1838 - 1918), షేగావ్ గజానన్ మహారాజు (? - 1910), తాజుద్దీన్ బాబా (1861 - 1925), గోందావళేకర్ మహారాజు (1845 - 1913), శ్రీ వాసుదేవానంద సరస్వతి (1854 - 1914), బాబా జాన్ (? - 1931), ఉపాసనీ బాబా (1870 - 1941), గులాబ్ రావు మహారాజు (1880 - 1914), ఖేడ్‌గావ్ భేట్ నారాయణ మహారాజు (1885 - 1945), నిత్యానంద స్వామి - గణేశపురి (? - 1961), కర్ణాటకలో మాణిక్యప్రభువు (1817 - 1865), కోమటి వెంకమ్మ (తెలుగువారు ? - 1862), జ్ఞానానంద మహారాజు (1824 - 1974), గురు సిద్ధారూఢులు (1836 -1929), తమిళదేశంలో సదాశివ బ్రహ్మేంద్రులు (తెలుగువారు 1638 - 1738), పుదుక్కోట జడ్జి స్వామి (తెలుగువారు 1850 - 1915), శేషాద్రి స్వామి (1870 - 1929) , కుంభకోణంలో మాస్టర్ సి.వి.వి. (తెలుగువారు 1868 - 1922), కుర్తాళం మౌనస్వామి (తెలుగువారు 1868 - 1943), కన్యాకుమారి అమ్మ, రమణమహర్షి (1879 - 1950), కేరళలో చత్తంపి స్వామిగళ్ (1853 - 1924), తెలుగు దేశంలో పరమానందయతి (1650 - 1750), దూదేకుల సిద్దయ్య (1665 - 1735), గుంటూరు నల్లమస్తాన్ (1685 - 1885), ప్రభల భోగీశ్వరులు (1700 - 1750), రామడుగు శివరామ దీక్షితులు (1700-1770), ఈశ్వరమ్మ (1703-1803), ఓరుగల్లు పరశురామపంతుల లింగమూర్తి (1710 - 1800), లింగందిన్నె ధరణి సీతారామయోగీంద్రులు (1714 - 1776), పలుగురాళ్ళపల్లె గోవిందస్వామి (1729 - 1789), అనుమసముద్రం నాయబ్‌రసూల్ (? - 1762), మిట్టపాళెం నారాయణస్వామి (? - 1750), కసుమూరు

మస్తానయ్య (? - 1750), తరిగొండ వెంకమ్మ (1730 - 1817), కైవారం అమరేనారేయణ స్వామి (1730 - 1840), తుంగదుర్తి బుచ్చయ్య (1760-1854), పెనకచెర్ల చితంబరస్వామి (1772-1872), నీలకంఠ సచ్చిదానంద ఘనేంద్రులు (1788-1907), సోలీపురం యోగానంద నరసింహస్వామి (1798-1899), ధర్మవరం చిరుమామిళ్ళ సుబ్బదాసు (1802-1882), మచిలీపట్నం దొంతులమ్మ (1807-1932), ఆదోని తిక్క లక్ష్మమ్మ (1815-1993), కలశపాడు ఇందూరు అప్పయ్య (1817-1877), లింగాలదిన్నె బ్రహ్మస్వామి (1820-1890), చేళ్ళగురికి ఎఱ్ఱిస్వామి (1822-1895), ఎల్లారెడ్డిపేట హజ్రత్ ఇమామలీ బాబా (1825-1934), సత్తెనపల్లి పీరోజీ మహర్షి (1829-1889), చిప్పగిరి భంభంస్వామి (1833-1911), ధాభా కొండయాచార్యస్వామి (1834-1939), ఓబుళరాజు పల్లె నారాయణరెడ్డి అవధూత (1834-1915), సనారీ విశ్వనాథావధూత (1850-1916), నెమిళ్ళదిన్నె హుసేన్ గురుడు (1850-1929), గోవర్ధనగిరి మద్దయ్యస్వామి (1850-1940), నాగండ్ల ప్రతాపకోటయ్య శాస్త్రి (1854-1896), చినలింగాయపాలెం ఉన్నవ ఆనంద రామదాసు (1855-1935), భద్రాచలం గోవిందస్వామి (1855-1927), రేపల్లె చిన్నమ్మ (1857-1956), బనగానపల్లె హంసానంద సరస్వతి (1859-1979), మహేంద్రవాడ రెడ్డి సుబ్రహ్మణ్య మహర్షి (1860-1949), గడికోట సచ్చిదానంద పరమహంస (1865-1957), మాదిరాజు వెంకట అప్పారావు (1859-1935) బ్రహ్మానంద సరస్వతీ స్వామి (1863-1938), నెల్లూరు నిత్యానందస్వామి (1864-1936), దీపాలదిన్నె పాటిబండ్ల వీరయ్య (1867-1922), కొత్తలంక సయ్యద్ అహ్మదలీషా ఖాదర్వలీ (1868-1948), కురుమద్దాలి మాల పిచ్చమ్మ అవధూత (1870-1951), నార్పల తిక్కయ్యస్వామి (1870-1951), తాండూరు అబ్దుల్‌షా కరీంవలీ (1870-1947), కదిరిమంగళం మునీంద్రస్వామి (1876-1961), కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని (1876-1936), బాపట్ల బ్రహ్మానంద తీర్థులు (1879-1918), బందరు రంగావధూత (1880-1905) వంటి మహా పురుషులు ఎందరో ఉన్నారు. వీరిలో సొరకాయల స్వామితో ప్రత్యక్షంగా లేదా పరోక్షంగా సంబంధం ఉన్నవాళ్ళెవరో తెలియదు.

శ్రీ సొరకాయల స్వామివారితో ప్రత్యక్ష సంబంధమున్నవారు లేదా స్వామివారి వద్ద మంత్రదీక్షితులైనవారు ఆనాటి మహాత్ముల గురించి తెలుసుకుందాము.

1. మూటలమ్మ :- నెల్లూరు జిల్లా ఒక పల్లెటూరి నిరుపేద గొల్లల యింట పూర్వజన్మల యోగబలంతో ఒక ఆడకూతురు పుట్టినది. పూవుతో తావి పుట్టినట్లు

ఆమెతో సద్గుణాలు పుట్టినవి. గాలితో గంధం వ్యాపించినట్లు ఆ పిల్ల నడచిన తావుల్లో ప్రేమానురాగాలు పెనవేసుకున్నవి, వినయవిధేయతలు విచ్చుకున్నవి, భక్తి ప్రపత్తులు పల్లవించినవి. దైవనిర్ణయం ప్రకారం ఆ పిల్లకు గర్భాష్టకంలోనే కన్నవారు కరువైనారు. అప్పుడా అనాథబాలికను శ్రీమంతులు చేరదీసి పనిపిల్లగా సాకినారు. చేదోడు వాదోడుగా ఉంటుందని తమతోపాటు కాశీయాత్రకు తీసుకపోయినారు. కాశీక్షేత్రంలో వాళ్ళంతా ఒక బ్రాహ్మణో త్తముని ఇంట బస చేసినారు. ఆ బ్రాహ్మణుడు సాధారణుడు కాదు. గొప్ప తపస్సంపన్నుడు, మహాభక్తుడు. ఆతని దయావృష్టి అనాథబాలిక మీద కురిసింది. ఆ పిల్లకు ఆతని మీద భక్తివిశ్వాసాలు పెరిగినవి. కిలుము లేని ఇనుపరజాన్ని అయస్కాంతము ఆకర్షించినట్లు సుగుణాల పుట్ట అనాథబాలికను ఆ బ్రహ్మనిష్ఠుడు ఆకర్షించినాడు. చిన్నప్పుడే తల్లిదండ్రులను కోలుపోయిన ఆ పిల్లకు అతడే తల్లి తండ్రి గురువు ఐనాడు. కాశీయాత్ర ముగించుకున్న కామందులు స్వదేశం తిరిగి పోవటానికి సెలవు కోరితే ఆ బాపనిగేస్తు అనాథబాలికను తన వద్దనే విడిచిపొమ్మన్నాడు. భక్తి బంధాలకు కట్టుబడ్డ ఆ పిల్ల తన అంగీకారాన్ని తెలిపింది. యాత్రికులు వచ్చిన త్రోవన వెళ్ళిపోయినారు. నాటినుండి అమ్మాయి కాశీ పండితుని కనుసన్నలలో మెలగుతూ ఆతని వాత్సల్యం చూరగొన్నది. ఆ యింటివాళ్ళంతా ఆ పిల్లను పుత్రీనిర్విశేషంగా గారాబంతో సాకినారు.

ఆ పిల్ల మాహాత్మ్యమో ఆ బ్రాహ్మణుని అదృష్టమో కాని ఆ యిల్లు సిరి సంపదలతో తామర తంపరగా దినదినాభివృద్ధి చెందినది. ఇంటివారికి ఆ పిల్లపై మక్కువతో పాటు ఆదరం పెరిగింది. వాళ్ళ ఆదరాభిమానాలతో ఆ అమ్మాయి పెరిగి పెద్దదై యుక్తవయస్క రాలైనది. కన్నవారికంటె కొన్నవారికి మక్కువ ఎక్కువంటారు. పెండ్లీడు వచ్చిన పిల్లను యథోచితంగా ఒక అయ్య చేతిలో పెట్టేయత్నం సాగింది. వాళ్ళు చేస్తున్న సంరంభం పసిగట్టి ఆ కన్యక తనకు పరాత్పరుడే పతిగాని అన్యమానవులను ఒల్లనన్నది. పరమపద ప్రాప్తి ఆమెకు పరమధ్యేయం కాగా శమదమాదులు ఆమెకు చెలిమికత్తెలుగా సహకరించినవి. బ్రాహ్మణ పండితుడు ఆమెను తీవ్ర ముముక్షువుగా గుర్తించినాడు. కారణజన్మురాలుగా గుర్తించి మంత్రోపదేశం చేసి కారణగురువైనాడు.

నాటినుండి ఆ యువతి సంగం వర్జించి తీవ్రధ్యానంలో మునిగిపోయింది. ఇల్లు విడిచింది. జన సంచారానికి దూరంగా తిరగటం ప్రారంభించింది. పల్లెలు పట్టణాలు అడవులు కొండలు నదులు తీర్థప్రదేశాలు ఏండ్లు పూండ్లు తిరిగి తిరిగి మళ్ళా దక్షిణ

దేశానికి వచ్చింది. నెల్లూరు, వెంకటగిరి, ఉత్తర ఆర్కాడు, అంబూరు, గుడియాత్తం సంచారం చేసింది. ఈ సంచారంలో తన ఆంతరదృష్టికి కనపడిన సారకాయలస్వామిని సేవించటానికి నారాయణవరం చేరింది. పరిపక్వ స్థితికి వచ్చిన ఆయమ్మకు సారకాయల స్వామివారు చక్షుర్దీక్ష ప్రసాదించినారు. స్వామివారామెను తమ శిష్యురాలుగా అంగీకరించినారు. ఆమె కూడ స్వామిని గురుర్బ్రహ్మగా కొలిచింది. అటు తరువాత గురువు మహిమను చాటుతూ తానుకూడ మహిమలు ప్రదర్శిస్తూ మరికొంతకాలం దేశసంచారం చేసి శ్రీకాళహస్తి సమీపాన పెద్దకన్నవి గ్రామం పొలిమేరలో దారి ప్రక్కన వృక్షచ్ఛాయలో తన మూటలు పెట్టుకొని నిద్రించింది. ఆమె ముఖం చుట్టున్న ప్రభామండలాన్ని గమనించి గ్రామస్థులు ఆకృష్టులైనారు. ఆమె దివ్యాత్మురాలని కొందరు గుర్తించి ఆదరించినారు. పెద్దకన్నవిలోను చుట్టుప్రక్కల గ్రామాల్లోను ఆమె భిక్షకు పోతే తెలిసినవాళ్ళు అహమహమికతో భిక్ష చేసేవారు. తెలియని వాళ్ళు పిచ్చిబిచ్చపు ముసలిదని ఉపేక్షించేవారు. ఆమె మౌనవ్రతం పాటించటం చేత ఎవ్వరు ఏమి అడిగినా సమాధానం చెప్పేది కాదు. ఆమె ఊరు ఆమె పేరు తెలుసుకోవటానికి చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. ఆమె ఎల్లప్పుడు మూటలు మోసేది కనుక జనులు ఆమెను మూటలమ్మ అని పిలువసాగినారు. కన్నవారు పెట్టిన పేరేమో తెలియదు, కాశీపండితు డేపేరుతో పిలిచినాడో తెలియదు. జనులు మాత్రం మూటలమ్మ అన్నారు. ఆ పేరే ఆమెకు స్థిరమైపోయింది.

శ్రీ కాళహస్తి చుట్టుపట్టు గ్రామాలవాళ్ళు మూటలమ్మకు తమ కష్టాలు మనవి చేసుకునేవారు. ఆమె కారుణ్యదృష్టి సోకితే రోగాలు బాధలు తొలగిపోయేవి. కొందరు మూటలమ్మను తమ తమ ఇండ్లలో నిలుపుకోవటానికి ప్రయత్నం చేసినారు. ఆమె మెట్టిన ఇంట్లో చింతలు దూరమై సిరులు పొంగేవి, ఆధివ్యాధులు తొలగిపోయి ఆనందం తాండవించేది. ఐతే ఆయమ్మ ఎవ్వరింటిలోనూ శాశ్వతంగా నిలువలేదు. ఈనాడొక యింట్లో మరునాడు మరొక యింట్లో ఉన్నా తెల్లవారేవరకు తన గుడ్డల మూటలతో దారిప్రక్క చెట్టుక్రింద ఉండేది. ఈవిధంగా మూటలమ్మ చాలా సంవత్సరాలు సంచార జీవిగానే ఉండి అక్కుర్తి గ్రామం వెలుపల మైదానంలో స్థిరంగా ఉండసాగింది. ఆమె తల దాచుకోవటానికి గ్రామస్థులు ఒక పూరిపాక వేసినారు. చుట్టు గ్రామాలవారు దూర ప్రాంతాలవారు తమ తమ కోరికలు తీర్చుకోవటానికి కష్టసుఖాలు చెప్పుకోవటానికి ఆమె సన్నిధికే వచ్చేవారు. ఎవ్వరే కానుకలు ఖాద్యాలు తెచ్చినా ఆమె తినేవి పిడికెడు మెతుకులే. తక్కినవన్నీ వచ్చిపోయే భక్తులకు ప్రసాదంగా పంచి పెట్టేది. మూటలమ్మ పేరు దూరదూరాలకు వ్యాపించటంతో ఉత్తరాన విశాఖపట్నం

గోదావరి జిల్లాలనుండి దక్షిణాన వేలూరు చిత్తూరు మండలాలనుండి భక్తులు వచ్చి దర్శించిపోయేవారు.

మూటలమ్మను సమీపించటం అందరికీ సాధ్యమయ్యేది కాదు. పాపులను ఆమె తనవద్దకు రానీయలేదు. వాళ్ళు దూరంనుండే నమస్కరించేవారు. పాపులు దుర్మార్గులు ఆమెను సమీపించటానికి ప్రయత్నిస్తే ఆమె రాళ్ళు రువ్వేది. కొలది మంది ఉత్తమసంస్కారం ఉన్న పుణ్యాత్ములే మూటల్మ గుడిసెలో కాలు పెట్ట గలిగేవారు. అప్పుడప్పుడు రాత్రుల్లో మూటలమ్మ గుడిసె మండుతున్నట్లు కనిపించేది. నీళ్ళ కుండలతో జనులు మంటలు చల్లార్చటానికి పోతే అక్కడ ఏమీ ఉండేది కాదు. ఇది ఆమెలోని దివ్యత్వానికి నిదర్శనం. అందరికీ ఆ జ్యోతి స్వరూపం తెలిసిన తరువాత దూరంనుండే నమస్కరించి పోయేవారు. శ్రీమంతులు ఉన్నతాధికారులు మూటలమ్మకు మంచి ఆవాసం కల్పించదలచుకున్నారు. కాని అమ్మ అంగీకరించ లేదు. ఆ పూరిగుడిసే మూటలమ్మకు సౌధరాజం, కటిక నేలయే ఆమెకు హంసతూలికాతల్పం. భక్తులు చీని చీనాంబరాలు తెచ్చి సమర్పించినా మూటలమ్మ పాతలే కట్టుకునేది. సొరకాయల స్వామికి శిష్యురాలనని చెప్పుకుంటూ ఆమె గురువుగారికంటె భిన్నంగా ఎట్లు వర్తిస్తుంది? గురువుకు తగిన శిష్యురాలు. గురువుగారి వలె ఆమె కూడ పేదరికాన్ని వలచింది. ఈవిధంగా దీనులను, ఆర్తులను భక్తులను ఆదుకొని సుఖసంతోషాలు పంచిన ఆ తల్లి 1949 సంవత్సరంలో తనువు చాలించింది. ఆమె నివసించిన కుటీరానికి సమీపంలోనే భక్తులు ఆమెను సమాధి చేసినారు. ఈనాడా సమాధిపై ఇటుక సున్నంతో చిన్న గుడి కూడ కట్టినారు. ఇది రేణిగుంట-గూడూరు ఇనుపదారిలో అక్కూర్తి రైల్వేస్టేషనుకు సుమారు రెండు ఫర్లాంగుల దూరంలో ఉంది. ఇప్పటికీ మూటలమ్మకు దూరప్రాంతాల్లో భక్తులు, శిష్యులు ఉన్నారు. ఏటేటా ఆరాధనోత్సవాలు జరుపుతుంటారు. దుఃఖితులు, రోగులు, నిస్సంతులు ఆమె సమాధికి పోయి మ్రొక్కుకుంటారు. అందరు మహాత్ములవలె మూటలమ్మ సమాధి లోపలినుండే తనను నమ్మినవారిని ఆదుకుంటున్నారు. గురువుకు తగిన శిష్యురాలు మూటలమ్మ.

2. మడుగు స్వాములు :- మూటలమ్మ వలెనే మడుగు స్వాములు కూడ సొరకాయల స్వామి శిష్యులు. యోగులచరిత్ర వలె వారి ప్రవర్తనలు కూడ చిత్రంగా ఉంటవి. మూటలమ్మ, మడుగుస్వాములు సమకాలీనులు కనుక వాళ్ళిద్దరు ఎప్పుడైనా

ఎక్కడైనా తారసపడితే ఒకరి వీపువైపు మరొకరి వీపు ఉండేటట్లు నిలుచుండి ఏదో సాంకేతిక భాషలో మాట్లాడుకొని ఎవరి త్రోవన వారు పోయేవారు. మడుగు స్వామి తమిళదేశం కుత్రాళంవారు. వారు సొరకాయలస్వామి వలె తమిళమే మాట్లాడేవారు. యౌవనంలోనే వారికి వైరాగ్యం కలిగి స్వస్థలం విడిచి సాధన చేస్తూ గ్రామైకరాత్రంగా దేశ సంచారం చేసేవారు. వారి అదృష్టం ఫలించి సొరకాయల స్వామిని దర్శించి దీక్షితులైనారు. అప్పటికి ఆయన వయస్సు 50 సంవత్సరాలు. గురువు ఎంత పొట్టివారో శిష్యుడు అంత పొడుగరి. వారు దేశాటనం చేసి చేసి 1921లో కాళహస్తి తాలూకా మన్నె సముద్రం గ్రామం చేరినారు. ఆ గ్రామం వెలుపల ఒక మడుగు ఉన్నది. స్వామి ఆ మడుగులో స్నానం చేసి ఒడ్డున ఉన్న చెట్టు నీడలో యోగసాధన చేస్తుండేవారు. ఆకలైతే గ్రామంలోకి పోయి భిక్షించి తినేవారు; లేకపోతే లేదు. మడుగువద్ద నివసించిన కారణంగా ఆ గ్రామం జనులు ఆయనను మడుగుస్వామి అనటం చేత వారికి మడుగుస్వామి అనే సార్థకనామం ఏర్పడింది. వారి అసలు పేరుగాని కులగోత్రాలు గాని తెలియవు.

మడుగుస్వామి ఎప్పుడూ యోగనిష్ఠలోనే ఉండేవారు. ఎవరితోను మాట్లాడక పోయేవారు. సజ్జనులెవరైనా కష్టంలో ఉండి వారి వద్దకు వచ్చి చాలాసేపు ప్రతీక్షిస్తే సమాధ్యవస్థనుండి లేచి ఒకటి రెండు మాటలు చెప్పి మరల సమాధిలోనికి పోయేవారు. అంతటితోనే ఆశ్రయించినవారి ఆపదలు పోయేవి. కలరా మశూచి వంటి అంటు వ్యాధులు సోకకుండా భక్తులను కాపాడటం మడుగుస్వామి విశిష్టత. ఋష్య శృంగుడున్న చోట వర్షాభావం ఉండనట్లు మడుగుస్వామి ఉన్నచోట అంటువ్యాధు లుండేవి కావు. కనుక ఆయా గ్రామాలవాళ్ళు తమ తమ గ్రామాలకు స్వామివారిని బతిమాలి తోడ్కొని పోయేవారు. అక్కడున్న అంటురోగాలు మటుమాయమయ్యేవి. మడుగుస్వామి మన్నె సముద్రం గ్రామం బయట 12 ఏండ్లున్నారు. అటు తరువాత ఏర్పేడు గ్రామం సమీపాన బుగ్గలో రెండేండ్లున్నారు. బుగ్గనుండి శ్రీ కాళహస్తి క్షేత్రానికి వచ్చి అక్కడ 16 ఏండ్లు తపస్సు చేసి 80 ఏండ్ల వయస్సులో 1951లో మహాసమాధి చెందినారు. సొరకాయలస్వామి వారి సంపూర్ణానుగ్రహానికి పాత్రులైన శిష్యులలో మడుగుస్వామి ఉత్తములు. శ్రీకాళహస్తి ప్రాంతంలో మడుగుస్వామికి అనేకశిష్యులు, భక్తులు ఉన్నారు.

**3. చట్టి పరదేశి :-** పందొమ్మిదవ శతాబ్దం చివరిపాదంలో వెల్లూరులో తోభాస్వామి అనే మహనీయులుండేవారు. కేరళ, తమిళ, కర్ణాటక, ఆంధ్ర ప్రాంతముల

నుండి జిజ్ఞాసువులు జ్ఞానులు భక్తులు ఆ మహనీయుని దర్శించి ఇష్టార్థములు పొందేవారు. వారి వారి అర్హతలను బట్టి పరిపాకాన్ని బట్టి స్వామి ఉచితమైన ఉపదేశం చేస్తుండేవారు. కొందరికి భక్తి, కొందరికి యోగము, మరికొందరికి మంత్రము ఉపదేశించి అనుగ్రహిస్తుండే వారు. అటువంటి సమయంలో బెంగుళూరులో ప్రభుత్వోద్యోగం చేస్తున్న ఒకానొక పెద్దమనిషి వైరాగ్యంతో ఉద్యోగానికి నీళ్ళు వదలి మోక్షాపేక్షతో సద్గురువులను వెదకుతూ బయలు దేరినాడు. పూర్వపుణ్య విశేషం చేత వేలూరులో తోభాస్వామి దర్శనం లభించింది. వైరాగ్య పరిపూర్ణుడైన ఆ వ్యక్తిని చూడటంతోనే తోభాస్వామికి దయ కలిగింది. హస్తమస్తక సంయోగం చేసి మంత్రం ఉపదేశించినారు. నడుముకు తుండుగుడ్డ, అరచేతిలో చట్టి (మట్టిపాత్ర) ధరించి ఆ విరాగి ఒక పూట మూడిండ్లు తిరిగి భిక్షాన్నం తింటూ ఏకాంత సాధన సాగించినాడు. చేతిలో మట్టిపాత్ర ధరించటం చేత ఆ విరాగిని అందరూ చట్టిపరదేశి అని పిలువసాగినారు. తమిళులు కన్నడిగలు విరాగిని, సన్యాసిని పరదేశి అంటారు. చట్టి పరదేశి ఒక్కటొక్కటిగా ఆధ్యాత్మిక సోపానాలు అధిరోహించినాడు.

ఇట్లుండగా నారాయణవరం సొరకాయల స్వామివారి మాహాత్మ్యాలు కీర్తి చంద్రికలు మద్రాసు, వెల్లూరు ప్రాంతాలకు వ్యాపించినవి. చట్టి పరదేశి ఇతోధిక జ్ఞాన ప్రాప్తి కోసం నారాయణవరం చేరినాడు. సొరకాయలస్వామిని కన్నులార చూచినాడు. తాను ఇంతకుపూర్వం విన్నదానికంటె కన్నులార చూచిన సొరకాయలస్వామి అవతారం ఇంకా విశిష్టంగా ఘనంగా కనపడింది. ఒకరినొకరు అర్థం చేసుకున్నారు. తొలిపరిచయం అటుతరువాత స్నేహంగా మారింది. మౌనభాషలో ఏమి మాట్లాడుకునేవారో ఎవరికీ తెలియదు. చట్టి పరదేశి అప్పటినుండి నారాయణవరం తరచుగా వచ్చి సొరకాయల స్వామితో అగ్నిగుండం వద్ద కూర్చుండి ఏదో తాంత్రికక్రియ చేస్తుండగా ఉన్నట్లుండి స్వామివారు శక్తిపాతం చేసి చట్టిపరదేశికి దీక్ష ఇచ్చినారు. తన్మయావస్థలో చట్టిపరదేశి 'ఆనందగురవే ఆనందగురవే' అని అరచినాడు. అంతే, అనాటినుండి చట్టిపరదేశికి సొరకాయలస్వామి 'ఆనందగురువు'లైనారు. వారు ఏప్రాంతానికి పోయినా ఆనందగురు నామస్మరణం చేస్తుండేవారు.

చట్టిపరదేశివద్ద ఉపదేశం పొందినవారు కూడ మహనీయులైనారు. అష్టసిద్ధులు వారి అరచేతిలో నాట్యమాడేవి. ఒకే సమయాన పెక్కుచోట్ల దర్శనం ప్రసాదించేవారు. అట్టి శిష్యులలో **'కన్నుకుట్టి'** స్వామి ఒకరు. వారు గొప్ప యోగ సంపన్నులు, జీవన్ముక్తులు.

సారకాయలస్వామి మొదటిసారి మద్రాసుకు 1893 సంవత్సరం వేసవిలో రత్నసభాపతి పిళ్ళే అమ్మాయి వివాహానికి వచ్చి కళ్యాణమంటపంలో వధూవరులను ఆశీర్వదించి ఉన్నట్లుండి "మా తమ్ముడు వస్తున్నాడు, మా తమ్ముడు వస్తున్నాడు" అని బిగ్గరగా అరచినారు. అక్కడున్న వారి కెవరికీ స్వామి మాటలు బోధపడలేదు. ఇంతలో ఈ కన్నుకుట్టి స్వామి వచ్చి సారకాయలస్వామిని దర్శనం చేసుకొని పోయినారు.

చట్టిపరదేశి గారు సారకాయలస్వామివారు జీవించి ఉండగానే మద్రాసులో తమ దేహం చాలించినారు. స్వామివారు తమ శిష్యుడు చెంగల్వరాయ మొదలియారుతో కలిసి నారాయణవరంలో ఒకనాడు నదికి స్నానం చేయటానికి వెళ్ళినారు. స్నానం చేస్తూ స్వామి హఠాత్తుగా నిట్టూర్చి "నా చెలికాడు పాయెనే ! ఏం చేసేది?" అంటూ దీనంగా చేతులు పిసుక్కున్నారు. స్వామి అట్లా ఎందుకంటున్నారో అట్లా ఎందుకు చేస్తున్నారో మొదలియారుకు అర్థం కాలేదు. స్వామి ఆవిధంగా సంతాపం చెందిన సమయంలోనే 70 మైళ్ళ దూరాన చట్టి పరదేశిగారు దివంగతులైన వార్త అటు తరువాత తెలిసింది. చట్టి పరదేశిగారికి కూడ అనేకభక్తులు జీవన్ముక్తులైన శిష్యులుండినారు. వారు గురువుల పార్థివశరీరాన్ని మద్రాసునుండి తిరువత్తియూరుకు తీసుకపోయి అక్కడ దండుబాట ప్రక్కన సమాధి చేసి తరువాత గుడి కట్టినారు. ఇప్పుడు ఆ స్థలం ఒక పుణ్యతీర్థం. నిత్యపూజలు ఏటేటా గురు సమారాధనలు వైభవంగా జరుగుతున్నాయి. చట్టి పరదేశిగారి చరిత్రంలో సారకాయలస్వామి "బ్రహ్మజ్ఞాన ప్రదాత" గా కీర్తింపబడినారు.

**4. ముంత పరదేశి :-** ముంత పరదేశి విద్యావంతుడైన సాతాని వైష్ణవులు. ఆయన చాలాకాలం అబ్కారీ శాఖలో ఉద్యోగం చేసి ఉన్నట్లుండి విరక్తుడైనాడు. ఇల్లు వాకిలి బంధుమిత్రులను సర్వసంగమును పరిత్యజించి చేతిలో మట్టిముంత ధరించి భిక్షావృత్తి స్వీకరించి ఏకాంతవాసం చేసేవాడు. కొంత సంగీతసాధన చేసినవాడు కనుక తిరునామాలు దివ్యప్రబంధాలు మనోహరంగా పాడుతూ తిరిగేవాడు. ఇట్లా తిరిగి తిరిగి మద్రాసు మహానగరం చేరినాడు. ఇప్పుడు రైల్వే ఆడిట్ కార్యాలయం ఉన్న ప్రదేశాన్ని పూర్వం రాణితోట అనేవారు. ముంత పరదేశి నగరంలో నాలుగిండ్లు బిచ్చమెత్తి ఆ రాణి తోటకు చేరి భిక్షాన్నం తిని ఒక చెట్టునీడన ధ్యానమగ్నుడై ఉండేవాడు. స్వయం సాధనతో ఆయన కొంత ఆధ్యాత్మిక ప్రగతి సాధించి ఆత్మానందంలో మునిగిపోయేవాడు.

రాణితోటకు వచ్చిపోయేవారు కాని తదితరులు కాని ఆయన గురించి ఎవరూ పట్టించుకోలేదు. కారణం ఆయన ఎవరితోను మాట్లాడేవాడు కాదు, నిరంతరం ధ్యానంలోనే ఉండేవాడు.

ఇట్లుండగా మద్రాసు గిడ్డంగి వీథిలో ఉండే ఒక కోమటి ఉదరశూలతో చాలాకాలం బాధపడ్డాడు. మందులు మాకులు తిన్నాడు. దానాలు ధర్మాలు చేసినాడు. దివ్యతీర్థాలు తిరిగినాడు కాని ఆతని ప్రారబ్ధం తీరలేదు. మద్రాసులో అప్పటికే సొరకాయల స్వామి మహిమలు అద్భుతాలు బాగా ప్రచారమైనవి. నారాయణవరం పోయి స్వామివారిని సేవిస్తే కడుపునొప్పి తగ్గుతుందని ఎవరో హితం ఉపదేశించినారు. ఆ వైశ్యుడు వెంటనే నారాయణవరం చేరి సొరకాయల స్వామికి పూలుపండ్లు సమర్పించి సాగిల పడ్డాడు. స్వామి అనుగ్రహంకోసం ఎదురుగా నిల్చున్నాడు. స్వామి అతణ్ణి ఎగాదిగా చూచి "నీవు ఇక్కడికి ఎందుకు వచ్చినావు? రాణి తోటలో ఉన్నవాని దగ్గరికి పో" అన్నారు. అంతే, పాపం ఆ వర్తకుడు వచ్చినబాట పట్టి తిరిగి మద్రాసు చేరి నేరుగా రాణితోట ప్రవేశించినాడు. ఒక చెట్టునీడన పరధ్యానంలో ఉన్న ముంత పరదేశిని సమీపించి నమస్కరించి తనగురించి తన రోగం గురించి చెప్పి అందుకోసం నారాయణవరం సొరకాయలస్వామిని ఆశ్రయిస్తే రాణితోటలో ఉండే తమవద్దకు పొమ్మన్నారని కడుపునొప్పితో బాధపడుతునే వివరంగా తన గోడు వినిపించాడు. ముంత పరదేశి హృదయంలో ఏదో సంకేతం తళుక్కుమన్నది. విప్పారిన ముఖంతో ఆయన కొంతసేపు సొరకాయల స్వామి గురించి ఏవో ప్రశ్నలడిగి సమాధానం పొంది ఉన్నట్లుండి "ఇప్పుడు నీ కడుపు నొప్పి ఎట్లుంది? ఇంకా ఉన్నదా పోయిందా?" అని ప్రశ్నించినాడు. ఆ వైశ్య శిఖామణి తన కడుపు తడుముకున్నాడు. నొప్పిలేదు గిప్పీ లేదు. ఏండ్ల తరబడి నానా యాతన పెట్టిన ఉదరశూల చేతితో తీసి పారవేసినట్లు క్షణంలో మటుమాయమై పోయింది. నీరోగి ఐన వైశ్యుని సంతోషానికి పట్టపగ్గాలు లేవు. ఆతడు ఉబ్బి తబ్బిబ్బయి పోయినాడు. తాను ఇంతకాలం ఈ నగరంలోనే ఉండి పెరటిలో ఉన్న పెన్నిధిని కనుగొననైతినే అనుకున్నాడు. ఆనందంతో తన యింటికి పోయినాడు.

ఆతడు పోగానే ముంత పరదేశిగారు ఒక్కక్షణం కండ్లు మూసుకొని ధ్యానించినాడు. ఈ సంఘటనకు సొరకాయల స్వామి తనను సన్నిధికి రమ్మని ఆదేశించినట్లు అర్థం చేసుకున్నాడు. వెంటనే నారాయణవరం బయలుదేరినాడు. స్వామివారిని సమీపించి సాష్టాంగదండప్రణామం చేసి ముకుళితహస్తాలతో ఎదురుగా నిల్చినాడు.

**సొరకాయల స్వామి :-** ఎవరు నీవు? ఇక్కడికి ఎందుకు వచ్చినావు? నిన్నెవరు రమ్మన్నారు?

**ముంత పరదేశి :-** కడుపునొప్పితో బాధపడే వైశ్యునితో తమరు రమ్మని ఆజ్ఞాపిస్తే వచ్చినాను.

**సొరకాయలస్వామి :-** ఐతే ఆ శిథిలమైన పోలీసుస్టేషను ప్రక్కన పడి ఉండు.

**ముంతపరదేశి :-** తాము జ్ఞానోపదేశం చేస్తారని మీ ఆశ్రయం కోరి వచ్చినాను.

**సొరకాయలస్వామి :-** అట్లానా? ఇందాకా నేను చెప్పిన చోటనే ఆరు నెలలు ఉండు. అటు తరువాత బుధవారం మధ్యాహ్నం 12 గంటలకు నాకు కనపడు.

స్వామివారి ఆజ్ఞ ప్రకారం ముంత పరదేశి పాడుపడిన పోలీసుస్టేషన్ గోడల మధ్యన ఆరు నెలలున్నాడు. నారాయణవరంలో స్వామి సన్నిధిలో జరిగే భజన గోష్ఠుల్లో తన్మయత్వంతో ఆడుతూ పాడుతూ భగవన్నామం చేసేవాడు. ఆకలైనపుడు గ్రామంలో నాలుగిండ్లు తిరిగి ఎవరేది పెడితే తెచ్చుకొని తినేవాడు. ఇట్లా ఆరు నెలలు గడచిపోయినవి. స్వామివారు నిర్దేశించిన బుధవారం ఉదయంనుండి భజనగోష్ఠి చేసి అట్లాగే ఆడుతూ పాడుతూ స్వామి యెదుట నిల్చినాడు. సొరకాయల స్వామి ముంత పరదేశిని చూచి రుసరుస లాడుతు "నీ నృత్యగానాలకు లోబడేవాణ్ణి కాను, నిన్ను నీవే తెలుసుకోవలె" అని గద్దించి కోపంతో అటు ఇటు పరుగులు తీయసాగినారు. ముంత పరదేశి ఆ సంకేతం గుర్తించి అక్కడున్న వాళ్ళతో "వెయ్యి టెంకాయలు తీసుకరండి. స్వామివారు నాకు సరిగా 12 గంటలకు ఉపదేశం చేస్తారు. అట్లా జరుగకపోతే ఆ వెయ్యి టెంకాయలు నా నెత్తిపై కొట్టండి" అన్నాడు. ఆవేశంతో ఆడుతూ పాడుతూ 11 గంటల 45 నిమిషాలకు మైమరచి క్రింద పడిపోయినాడు. టెంకాయలు తెచ్చేవారు తెస్తూనే ఉన్నారు. సరిగ్గా 12 గంటలకు సొరకాయల స్వామి ముంత పరదేశి పరుండి ఉన్న చోటుకు పోయి "నా కండ్లలోకి బాగా చూడు" అని ఆదేశించి ఆతని కండ్లలోకి తీవ్రంగా చూచినారు. స్వామివారి దృష్టిపాతంతో ముంత పరదేశికి "చక్షుర్దీక్ష" లభించింది. ఆ దివ్యదృష్టిపాతంతో బ్రహ్మజ్ఞానం పరిపూర్ణంగా లభించింది. తానే అఖండ సచ్చిదానంద పరబ్రహ్మంగా వెలిగిపోయినాడు. కన్నులతో గురువు చెప్పిన గుర్తును ముంతపరదేశి నారాయణవరంలోనే మరికొంత కాలం ఉండి భజించినాడు. గురువు సెలవంది మద్రాసుకు తిరిగి పోయినాడు. ఇంతకాలం ఎవరికంట బడకుండా రాణి తోటలో ఉన్న పరదేశి ఇపుడు మద్రాసు భక్తులకు స్వామివారి ప్రతినిధిగా ఆప్తుడైనాడు, తదితరులకు బాధితులకు రోగగ్రస్తులకు ఆపద్బాంధవుడైనాడు.

9-8-1902 నాడు నారాయణవరంలో స్వామివారు తనువు చాలించిన వార్త రాగానే ముంత పరదేశి బయలుదేరి పోయి 10-8-02నాడు గురువుగారిని మహాసమాధి చేసి గురు ఋణం తీర్చుకొని మద్రాసుకు తిరిగివచ్చి మైలాపురంలో ఒక యింటి అరుగుపై తమ వసతి ఏర్పాటు చేసుకున్నారు. గురువుగారి వలెనే ముంత పరదేశికి కూడ ఇంటి అరుగే ఆవాసమైనది. ఆయన తనను ఆశ్రయించిన వారి కష్టాలు కడగండ్లు తీర్చేవారు. ఐతే తమ ఛాయాచిత్రం (ఫోటో) తీయటానికి ఎవరినీ అనుమతించలేదు. అంతేకాదు. తాము దేహం చాలించిన తరువాత సమాధి చేయవద్దని దహనం చేయాలెనని, తన చితాభస్మాన్ని నిశ్శేషంగా సముద్రంలో కలిపి వేయాలెనని, తనను ఎవరూ స్మరించవద్దని, భజించవద్దని పూజించవద్దని గట్టిగా శాసించినారు. దీనికి విరుద్ధంగా ఎవరైనా చేస్తే కీడు మూడుతుందని భయపెట్టినారు. వారు ఆజ్ఞాపించినట్లే భక్తులు వారి పార్థివ శరీరాన్ని అగ్నిదేవునికి, ఆ చితాభస్మాన్ని సముద్రునికీ అర్పించినారు. తనను తాను నిశ్శేషంగా పూర్ణబ్రహ్మంలో లీనం చేసుకున్న ముంత పరదేశి సాధు సంతుల్లో వైరాగ్యానికి పరాకాష్ఠ.

**5. కుమార కుప్పం స్వామి :** - తిరుత్తణి నుండి ఘటికాచలం (షోలింగర్) పోయే ప్రధానమార్గంలో మూడు మైళ్ళదూరాన కుమారకుప్పం గ్రామమున్నది. సొరకాయల స్వామి ఆ గ్రామానికి అప్పుడప్పుడు వెళ్ళేవారు. ఆ గ్రామంలో నరసింహో పాసకుడు మహాభక్తుడైన పెరుమాళ్‌రెడ్డి అనే రైతు ఉండేవాడు. ఆయన 109 సంవత్సరాలు జీవించినాడు. తన మరణకాలం తెలిసిన మహాజ్ఞాని పెరుమాళ్‌రెడ్డి. ఆ కాలం సమీపించగానే బంధు మిత్రులను రావించి తన కర్తవ్యం నెరవేరిందనీ తాను వెళ్ళిపోతున్నానీ చెప్పి తన కొడుకు గోవిందరెడ్డితో తులసితీర్థం నోటిలో పోయించుకొని మాట్లాడుతూ మాట్లాడుతూ ప్రాణాలు విడిచిన ధన్యజీవి పెరుమాళ్‌రెడ్డి. అటువంటి పుణ్యాత్ముని కడుపుపంట గోవిందరెడ్డిగారే తరువాతికాలంలో కుమారకుప్పం స్వామిగా ప్రసిద్ధులైనారు. పులి కడుపులో చలిచీమ పుడుతుందా? గోవిందరెడ్డి ముందుగా తండ్రిని మించిన తనయుడనిపించు కున్నాడు. తరువాత యోగమార్గంలో ఉన్నతోన్నత శ్రేణులధిగమించి గురువుకు తగిన శిష్యుడని పించుకున్నాడు.

గోవిందరెడ్డికి తండ్రితోపాటు సాధు సంతులను సేవించటం సిద్ధ పురుషుల సాంగత్యం చేయటం చిన్ననాటి నుండే అలవాటైనది. ఒకసారి పెరుమాళ్‌రెడ్డి సొరకాయల స్వామిని దర్శించటానికి నారాయణవరం కొడుకును వెంట బెట్టుక పోయినాడు. ఆ సమయాన

ఒక గృహస్థు స్వామివారికి భిక్ష చేస్తున్నాడు. అది పట్టపగలు ఆకటివేళ. కడుపు మాడుతున్నా స్వామివారిని దర్శించనిదే భోజనం చేయనని బాలగోవిందరెడ్డి ఆ యింటి అరుగుపై పడుకున్నాడు. ఇంటియజమాని స్వామివారికి గురుపూజ చేసి హారతి ఇచ్చి శాకపాకములు వడ్డించినాడు. కాని స్వామి అన్నం ముట్టలేదు. భోజనానికి ఉపక్రమించవలసిందిగా గృహస్థుడు స్వామిని ప్రార్థించినాడు. "ఇంటిబయటి అరుగుపై నా బిడ్డడు ఆకలితో ఉన్నాడు. వాణ్ణి తీసుకవచ్చి ముందుగా అన్నం పెట్టు" మని స్వామి ఆజ్ఞాపించినారు. స్వామి ఆజ్ఞ నెరవేరింది. ఈ విధంగా బాల్యంలోనే సొరకాయల స్వామివారి మనసుకెక్కిన మహాభక్తుడు గోవిందరెడ్డి.

గోవిందరెడ్డి 14 ఏండ్ల బాలుడైనాడు. ఆ సంవత్సరం సంక్రాంతి మరునాడు పశువుల పండుగ చేసుకోవటానికి ముంజనార కోసం గోవిందరెడ్డి తిరుత్తణి మార్గంలో రాత్రిపూట ఒంటరిగా అడవికి పోయినాడు. దారిలో నంది నది వద్ద ఒక ఎత్తైన ప్రదేశంలో మసక చీకటిలో మనుష్యాకారం చూచి బాల గోవిందరెడ్డి భయభ్రాంతుడై నిలిచిపోయినాడు. "గోవిందా ! ఇటురా" అంటూ ఆ మనుష్యాకారం పిలవటంతో భయంతోపాటు సంభ్రమం పైకొన్న గోవిందరెడ్డి చీకటిని చీల్చే నిశితదృక్కులతో నిరీక్షించినాడు. సొరకాయలస్వామి దిగంబరంగా ఉన్నట్లు కనిపించింది. "భయపడకు ! దగ్గరికి రా ! నీవు పెరుమాళ్ రెడ్డి కొడుకువు కదా? ఐదుగురు అన్నదమ్ములలో నీవు ఒకనివి కదా? రా!" అంటూ ఆనవాలు చెప్పే సొరకాయల స్వామివారి అభయంతోడి ఆజ్ఞ. గోవిందరెడ్డి నిర్భయంగా సమీపించినాడు. స్వామి "నాకు దాహం వేస్తున్నది. నీళ్ళున్న చోటికి తీసుకపోతావా?" అంటే బాలగోవిందరెడ్డి స్వామివారిని నంది నదికి తీసుక పోయినాడు. ఆ సమయంలో గోవిందరెడ్డి స్వామిని దగ్గం నుండి చూచినాడు. స్వామి దిగంబరులుగా ఉన్నారు. ఐతే వారు స్త్రీ కాదు పురుషుడు కాదు. శుద్ధ పరబ్రహ్మస్వరూపులు. గోవిందరెడ్డి ఆశ్చర్యంగా చూస్తుంటే స్వామి "గోవిందా! నేను నీకొక వస్తువు ఇవ్వటానికి ఇంతదూరం వచ్చినాను. ఆ వస్తువులో మూడు భాగాలు ఇంతకు ముందే ముగ్గురికి ఇచ్చి వేసినాను. నాల్గవ భాగానికి నీవే తగుదువని తెచ్చినాను తీసుకో" అన్నారు. గోవిందరెడ్డి వినయంతో "స్వామీ! మా తండ్రిగారి ఆజ్ఞ లేకుండా నేను ఎవరివద్ద ఏమీ తీసుకోను" అన్నాడు.

సొరకాయలస్వామి గోవిందరెడ్డి పితృభక్తికి సంతోషించి "అట్లాగే కానీయ వయ్యా! నీ తండ్రి అనుమతితోనే ఈ వస్తువును ఉపయోగించు. నేనుపదేశించే మంత్రం వ్రాసుకో" అన్నారు. గోవిందరెడ్డి నదిఒడ్డున ఉన్న నాగదాళిపండు రసంలో ఒక పుల్లను

అద్దుతూ అక్కడే పడిఉన్న ఒక కాగితంపై ఆ మంత్రం వ్రాసుకున్నాడు. స్వామివారు గోవిందరెడ్డితో "బిడ్డా! ఇది మహామంత్రం. చాలా రహస్యమైనది. దీనిని లెస్సగా మననం చేసిన తరువాత గంగలో కలిపివేయాలె సుమా" అని హెచ్చరించి అదృశ్యులైపోయినారు. ఆశ్చర్యానందాలలో తేలిపోతూ గోవిందరెడ్డి తన యింటికి పరుగెత్తి తండ్రికి యావద్విషయం తెలిపినాడు. భక్తుడు దివ్యభావనారక్తుడైన పెరుమాళ్‌రెడ్డి తన కొడుకు అదృష్టానికి మహదానందం పొంది "నాయనా! నీ పూర్వపుణ్యవిశేషంచేత సొరకాయలస్వామి అనుగ్రహానికి పాత్రుడవైనావు. ఈ మంత్రాన్ని ఏకాగ్రచిత్తంతో జపించి లోకోపకారం చేస్తూ ధన్యుడవు క"మ్మని దీవించినాడు. తండ్రి అనుమతితో గోవిందరెడ్డి స్వామివారిచ్చిన మహామంత్రాన్ని దీక్షతో జపించినాడు. కొలది యేండ్లలోనే అతని దీక్ష ముగిసింది. స్వామి ఆదేశించినట్లు గోవిందరెడ్డికి అమోఘమైన శక్తులు అబ్బినవి. ఇరువైఏండ్లు నిండకుండానే గోవిందరెడ్డి కుమారకుప్పంస్వామి ఐపోయినాడు.

కుమారకుప్పం స్వామి అప్పుడప్పుడు సొరకాయల స్వామిని దర్శించటానికి వెళ్ళేవాడు. స్వామివారు తమ యాత్రల్లో కుమారకుప్పం వచ్చినపుడల్లా తన శిష్యచూడామణిని ఆశీర్వదించి పోయేవారు. ఒకసారి దర్శనార్థం నారాయణవరం వెళ్ళినప్పుడు సొరకాయలస్వామి కుమారకుప్పం స్వామిని అగ్నిగుండం కోసం కట్టెలు తెచ్చే మిషతో అడవికి తీసుకపోయినారు. అక్కడ ఇరువురే ఏకాంతగా ఉన్నప్పుడు స్వామివారు శిష్యునితో "అబ్బాయీ! నీవు నీ తలపై చాలా పెద్దభారం మోయవలసి ఉందయ్యా!" అన్నారు. దీని అర్థం గురువుగారివలె శిష్యుడు కూడ చాలాకాలం దీన దుఃఖితుల సేవ చేయవలసి ఉందని సూచన. ఆనాటినుండి డెబ్బైఏండ్లు కుమారకుప్పం స్వామి ప్రజాహితం చేసినారు. ధనికులు దరిద్రులు, ఉన్నతోద్యోగులు, న్యాయాధీశులు, రోగులు, దీనులు, నిస్సంతులు, పిశాచాది పీడాగ్రస్తులు వేలసంఖ్యలో కుమారకుప్పం స్వామిని సేవించి సుఖసంతోషాలు పొందినారు.

గురువుగారిచ్చిన మంత్రంతో ఆయన అనేకాద్భుతాలు చేసినారు. దీర్ఘసమాధి లో ఉన్నప్పుడే వారికి ఊపిరి కూడ ఆడేదికాదు. వారి శరీరం కొన్ని దినాలపాటు మృతకళేబరం వలె పడిఉండేది. వారే స్వయంగా ముందుగా హెచ్చరించి ఉండకపోతే వారు చనిపోయినారని అంత్యక్రియలు చేసే ప్రమాదం ఉండేది. అటువంటి సమయంలో తమ శరీరాన్ని భద్రంగా కాపాడవలసిందని చెప్పి స్వామివారు సమాధిలోకి వెళ్ళిపోయేవారు. వారు స్పృహలోనికి వచ్చేనాటిదాకా వందలసంఖ్యలో భక్తులు శిష్యులు కాచుకొని ఉండేవారు. అట్లా స్పృహలోనికి

వచ్చినపుడల్లా కుమారకుప్పం స్వామి అనేకాద్భుతాలు చేసేవారు. ఈవిధంగా భక్తులపాలిటి కల్పవృక్షమై కుమారకుప్పం స్వామి 90వ ఏట 1958 సంవత్సరం ఉగాది పండుగునాడు తనువు చాలించి గురువుగారి పాదపద్మాల్లో లీనమైపోయినారు. కుమారకుప్పం స్వామి భౌతికకాయం ఈనాడు కనపడకున్నా గురువు గారివలెనే భక్తజనుల కోరికలు తీర్చుతూ పూజలందుకుంటున్నారు. నారాయణవరం వలె కుమారకుప్పం కూడ ఈనాడొక పుణ్యక్షేత్రం.

6. మంగమ్మ :- నారాయణవరంలో వన్నెరెడ్డి కులంలో పుట్టిన మంగమ్మ చిన్నప్పటినుండి సొరకాయలస్వామిని దర్శిస్తూ ఉండేది. స్వామివారు భిక్షకోసం నారాయణ వరంలో తిరుగుతున్నప్పుడు లేదా సుందరచెట్టి యింటి అరుగుమీద విశ్రాంతులై ఉన్నప్పుడు స్వామి ఆ అమాయికురాలి భక్తికి ప్రేమకు సంతోషించి ఆశీర్వదించేవారు. భక్తులు మంచి మంచి ఖాద్యపదార్థాలు స్వామికి సమర్పిస్తే స్వామి అందులోనుండి మంగమ్మకు ప్రసాదంగా మిఠాయిలు ఇచ్చేవారు. మంగమ్మ యుక్తవయస్కురాలు కాగానే పదిహేనవ యేట పెండ్లి జరిగింది. అత్తవారు నగరి. అత్తవారింటినుండి పుట్టింటికి వచ్చినపుడల్లా మంగమ్మ స్వామివారిని దర్శించి సేవించి ఆశీస్సులందుకొని పోయేది. ఆమె అత్తవారింట్లో ఉన్నప్పుడే నారాయణవరంలో స్వామివారు సమాధి చెందినారు. మంగమ్మకు ఈ వార్త తెలిసి గోడుగోడున విలపించినది. నిద్రాహారము లుడిగినది. ఆమె మనస్సు వికలమైపోయింది. అప్పటికే మంగమ్మ పన్నెండేండ్లు సంసారం చేసి ఇద్దరు బిడ్డలను కన్నది. స్వామి సమాధి చెందిన వార్త విన్నప్పటినుండి ఆమె మనస్సు సంసారం పట్ల విముఖమైపోయింది. వైరాగ్యం పెల్లుబికింది. ఒకరాత్రి ఎవరికీ చెప్పక చేయక భర్త బిడ్డలు ఇల్లు వాకిలి సమస్తము వదలి పారిపోయింది. ఆమెకోసం పుట్టింటి వారు మెట్టినింటివారు గ్రామాలన్నీ గాలించి తిరిగినారు. బావులు చెరువులు చూచినారు. కొండలు కోనలు వెదకినారు. నాలుగుమాసాలు వెదకగా నారాయణవరానికి తూర్పున ఉన్న శింగరికోనలో నరసింహస్వామి దేవళంలో మంగమ్మ కనపడింది. ఆమెను నారాయణవరం తీసుకవచ్చినారు.

మంగమ్మ తన పుట్టింటికి కాని పరిచితులింటికి కాని పోలేదు. తన గురువు ఆరాధ్యదైవం సొరకాయలస్వామివారి మందిరంలోనే ఉండేది. ఎవరేమైనా పెడితే తినేది. నిరంతరం స్వామి సమాధికి ఎదురుగా ధ్యానముద్రలో కూర్చుండేది. క్రమంగా మంగమ్మ యోగమార్గంలో ఒక్కొక్కమెట్టు ఎక్కి దివ్యశక్తులు సంపాదించింది. గురువుగారి వలె దుఃఖితుల రోగుల బాధలు దూరం చేసేది, భవిష్యత్తు చెప్పేది. ఒక కుష్ఠరోగికి ఆరోగ్యం ప్రసాదించింది. ఈవిధంగా మంగమ్మ

పేరు కూడ సొరకాయలస్వామి భక్తజనంలో బాగా ప్రచారానికి వచ్చింది. మంగమ్మ మాత్రం తనకే శక్తులు లేవని అంతా గురుకృప అని చెప్పేది. ప్రతిదినం అడవికి పోయి స్వామివారి అగ్నిగుండానికి కావలసిన పుల్లలు కట్టెలు తెచ్చేది. సమాధి మందిరాన్ని శుభ్రంగా ఉంచేది. రాత్రుల్లో సమాధికి ఎదురుగా గురుదేవుని స్మరిస్తూ పడుకొనేది. ఈవిధంగా గురుసేవ చేసి, 27-9-1930 ఆశ్వీజశుద్ధ పంచమి పెరటాశి నెల 11వ తేది శనివారం నాడు మంగమ్మ తనువు చాలించింది. చాలా కాలం గురువుగారి సమాధిసేవ చేసిన భక్తురాలు కనుక ఆమెను కూడ స్వామివారి మందిరం ఆవరణలోనే సమాధి చేసినారు. ఆ సంవత్సరం గురుపూజా కార్యక్రమాలు జరుగుతుండగా ఆమె విగ్రహాన్ని సమాధిపైన ప్రతిష్ఠించి చిన్నగుడి కట్టినారు. విగ్రహాన్ని స్థాపించినవారు కుమారకుప్పం స్వామివారు. ఆ విగ్రహం క్రింద వెండికాసులు బంగారు మాంగల్యం కూడా ఉంచినారు. మంగమ్మ చనిపోయేనాటికి వితంతువైనా ఆమె గురుసన్నిధిలో బ్రాహ్మీభూతురాలు ఐనందున వితంతుదోషం లేదని కుమారకుప్పం స్వామివారే బంగారు మాంగల్యం పెట్టించినారు. గురువుగారి సమాధి సమీపంలోనే సమాధి ఐన మంగమ్మ ధన్యురాలు.

7. నందనారు స్వామి :- సొరకాయల స్వామి సమాధి చెందే పది సంవత్సరాలు ముందునుండి ఒక మాదిగ బాలుడు స్వామివెంట తిరుగుతూ సేవలు చేస్తుండేవాడు. అంత చిన్న వయసులోనే ఆతడు తల్లిని తండ్రిని ఇల్లును వదిలి స్వామి వెంటనే ఉండేవాడు. స్వామివారికి ఆ బాలునిపై విశేష వాత్సల్యం. స్వామికి దయ కలిగి ఆ బాలునికి కూడ ఉపదేశం అనుగ్రహించినారు. అతడు పెరిగి పెద్దవాడై నారాయణవరం లోను చుట్టుప్రక్కల గ్రామాల్లోను భిక్షమెత్తుతూ తిరిగేవాడు. గురుభక్తులు అతణ్ణి నందనారు స్వామి పేరుతో పిలుస్తుంటారు. ఆతడు కూడ గురువుగారి వలె పొట్టివాడు.

ముడతలు పడ్డ శరీరంతో తెల్లని గడ్డంతో తలపై పెద్దపాగాతో బ్రహ్మవర్చస్సు ఉట్టిపడే ముఖంతో మెరసే కన్నులతో గురువుగారిని తలపిస్తూ దేశసంచారం చేసేవాడు. నారాయణవరం వస్తే మంగమ్మగారివలె గురువుగారి సమాధి వద్దనే నిద్రించేవాడు. ఒకసారి నందనారుస్వామి భద్రాచలం యాత్ర చేసినారు. రామచంద్రుని ఆలయం ముందు తన గురువు సొరకాయలస్వామిని ధ్యానిస్తూ నిలుచుండగా నందనారు స్వామికి సొరకాయల స్వామివారే ప్రత్యక్షమైనారు. సొరకాయల స్వామి భక్తసులభుడు. శిష్యవాత్సల్యం కలవారు కనుక నందనారు స్వామికి ఆవిధంగా దర్శనం ప్రసాదించినారు. నందనారు స్వామి 1971 తరువాత దేహం చాలించినారు. వారిని నగరి సమీపాన ఏకాంబర కుప్పంలో సమాధి చేసినారు.

# అనుబంధం - 1

# శ్రీ సొరకాయల స్వామి కైంకర్యసమాజం

శ్రీ సొరకాయల స్వామి ఆడినెల (శ్రావణ) శుక్లపంచమి నాడు క్రీ.శ.9-8-1902 హస్తా నక్షత్రంలో తమ దేహం చాలించినందున క్రీ.శ.1903 సంవత్సరం నుండి ఆడినెల హస్తానక్షత్రంతోడి శుక్లపంచమి, నాగ - గరుడ పంచమినాడు ప్రతియేట మహాగురు పూజోత్సవాలు నిర్వహిస్తున్నారు. స్వామివారికి సన్నిహిత భక్తుడు, స్వామివారు నాగరకుల మధ్యలోనికి రావటానికి కారణభూతుడైన ఎన్.రత్నసభాపతి పిళ్ళే, మదరాసు, నారాయణ వరంలోని ప్రముఖులను, భక్తులను సంప్రదించి ఏటేటా గురుపూజోత్సవాలు అప్రతిహతంగా జరపటానికి ఒక చక్కని వ్యవస్థ శ్రీ సొరకాయలస్వామి కైంకర్య సమాజం పేరుతో కల్పించి 1903 నుండి 1913 దాకా తానే స్థాపకాధ్యక్షుడుగా వ్యవహరించినాడు. ఆయన అల్లుడు టి.భక్తవత్సలం స్వామివారి చరిత్రభాగాన్ని, యన్.రాజునాయుడు భక్తుల అనుభవాల భాగాన్ని సంపాదించి రత్నసభాపతి ఆదేశానుసారం 1911లో The Sage of Narayanavaram అనే గొప్ప గ్రంథం ప్రకటించినారు.

రత్నసభాపతిగారి తరువాత మద్రాసు ప్రముఖులు 3-6-1913 నాడు సమావేశమై శ్రీ సొరకాయలస్వామి కైంకర్య సమాజాన్ని రిజిష్టర్డు సంస్థగా చేసినారు. నారాయణవరంలో గాని ఇతరత్ర గాని స్వామిపేరుతో సేవ చేసే వారంతా దీనికి సంబంధించినవారే. నారాయణవరంలోని స్వామి మందిరం దానికి సంబంధించిన స్థిర చరాస్తులు ఈ సంస్థ యాజమాన్యంలోనే ఉన్నవి. 3-6-1913 నాటి సమావేశంలో ఈ సమాజానికి ఎమ్.కుప్పుస్వామి చెట్టియారు ఎం.ఏ, నెల్లూరు తాసీల్దారు అధ్యక్షుడుగాను, కె.టి.భాష్యం నాయుడు, డా॥జె.వి.రామస్వామినాయుడు ఉపాధ్యక్షులుగాను, బి.వేణు గోపాల నాయుడు కార్యదర్శిగాను, యన్.రాజునాయుడు సహాయ కార్యదర్శి గాను, సర్వశ్రీ పి. విజయరాఘవులు నాయుడు, పి.పార్థసారథి నాయుడు, బి.కన్నచెట్టి, పి.వి.కోదండరామ

నాయుడు, కె.టి.నారాయణప్ప నాయుడు, ఎమ్.రామస్వామయ్య, ఎమ్.కృష్ణస్వామి నాయుడు, ఎస్.మురుగేశ మొదలియారు, సి.రాఘవరావు నాయుడు, ఎ.అప్పలరావు పాలకమండలి సభ్యులుగాను ఎన్నికైనారు. ఆ దినాలలో సమాజం కార్యాలయం 11, చిన్నతంబి ముదలి వీధి, జార్జిటౌన్‌లో ఉండేది.

కుప్పుస్వామి చెట్టియారు తరువాత 1927 నుండి సి.విజయరాఘవులు నాయుడు అధ్యక్షుడుగాను, వి.దామోదరం నాయుడు, ఆర్.కృష్ణస్వామి నాయుడు కార్యదర్శులుగాను ఈ సమాజం సేవ చేసినారు. వీరి కాలంలోనే నారాయణవరంలోని స్వామి మందిరం బాగు చేసి విస్తృతపరచినారు. తరువాతి కాలంలో కైంకర్యసమాజం సేవా కార్యక్రమాలు అవ్యాహతంగా జరుగుతున్నా అధ్యక్షకార్యదర్శుల పేర్లు కాని పాలక మండలి సభ్యుల పేర్లుగాని లభించటం లేదు. 1953 నుండి కైంకర్యసమాజం కార్యకలాపాల రికార్డు సక్రమంగా లభిస్తున్నది.

1953 నుండి 1971 దాకా కె.వెంకటస్వామి నాయుడు, 1971 నుండి 1978 దాక భక్తవత్సలం గారి చిన్నల్లుడు టి.చెంగల్వరాయ పిళ్లే అధ్యక్షులుగాను వి.దామోదరం నాయుడు, జె.వి.శ్రీనివాసులు నాయుడు, టి.ఆర్.ఎమ్. కృష్ణస్వామి నాయుడు కార్యదర్శులుగాను పనిచేసినారు. తరువాత భక్తవత్సలం గారి దౌహిత్రులు డా॥ వి.ఎ. దేవసేనాపతి 1978 నుండి అధ్యక్షులుగాను, 1986 నుండి ఎమ్.రామచంద్రన్ కార్యదర్శిగాను, పి.భూపతి సంయుక్త కార్యదర్శిగాను ఎ.వి.గోపాల్ కోశాధ్యక్షులుగాను కైంకర్య సమాజం మార్గదర్శనం చేస్తున్నారు. ఈ దేవసేనాపతిగారు సి.పారిజాతం గారు కలిపి The Sage of Narayanavaram గ్రంథాన్ని సవరించి 1951లో మరల ప్రకటించినారు. సమాజం కార్యాలయం 9, అరుణాచల పండారం వీధి, పెరుమాళ్ పేట, వేపేరి, మద్రాసు -7లో ఉంది.

శ్రీ సొరకాయలస్వామి కైంకర్య సమాజం వారు ఏటేటా గురుపూజా మహోత్సవాలు పెద్దయెత్తున నిర్వహిస్తారు. దూరదూరాలనుండి వేలసంఖ్యలో భక్తులు నారాయణవరం వచ్చి స్వామివారి ఆరాధనోత్సవాల్లో పాల్గొంటారు. ఉదయం నారాయణసేవ సాయంకాలం స్వామి ఊరేగింపు జరుగుతవి. మొదట గురుపూజోత్సవాలు ఒకటి రెండు దినాలే జరిగేవి కాని ఉభయందార్ల సంఖ్య జీవిత సభ్యుల సంఖ్య విశేషోత్సవాలు జరిపించేవారి సంఖ్య ఎక్కువ కావటంతో రెండుమూడు దశాబ్దాలనుండి గురుపూజోత్సవాలు 10 దినాలు

జరుగుతున్నవి. అన్నదాన కార్యక్రమం స్వామికి చాలా యిష్టమైనది కనుక నారాయణసేవ చాలా పెద్దయెత్తున జరుగుతుంది. ద్వితీయ ప్రపంచ సంగ్రామకాలంలో (1939-1944) రేషనింగ్ అమలులో ఉన్నపుడు కూడ భక్తులు తమ తమ రేషనులనుండి దానం చేసి ఈ నారాయణసేవను అవ్యాహతంగా నిర్వహించినారు. చాలా కాలంగా మద్రాసు భక్తులు కొందరు చిత్రపూర్ణిమనాడు గురుపూజ నారాయణసేవ నిర్వహిస్తున్నారు. సమాజం పక్షాన ప్రతి పున్నమనాడు అభిషేకం ప్రత్యేక పూజ అన్నదానాలు జరుగుతున్నవి. స్వామి మందిరంలో త్రికాలపూజలు హారతి జరగటం చేత స్థానికులు చుట్టుపట్ల గ్రామాల భక్తులు నిరంతరం వచ్చి సేవిస్తుంటారు. కడచిన 5 సంవత్సరాల నుండి జనవరి 1వ తేది నూతన సంవత్సర విశేషపూజలు కూడ జరుగుతున్నవి. మద్రాసునుండి అశేషభక్తజనం ఈ ఉత్సవాలకు వస్తారు. ఆనాడు ప్రాత:కాలంనుండే అభిషేకాది ప్రత్యేకార్చనలు వైయక్తిక గోత్రనామాలతో జరిపిస్తుంటారు. ప్రస్తుతం జీవిత సభ్యుల సంఖ్య 1008, సాంవత్సరిక విరాళలిచ్చేవారి సంఖ్య 220 దాకా పెరిగింది. ఈ సంఖ్య దినదినం పెరుగుతుండటం చేత స్వామివారి గురుపూజోత్సవాలలో ఏటేట క్రొత్తరూపం సంతరించుకుంటున్నవి.

శ్రీ సారకాయలస్వామి కైంకర్యసమాజాన్ని సువ్యవస్థితం చేసి మందిరాన్ని అభివృద్ధి పరచి అచ్చట జరిగే గురుపూజోత్సవాలను చాలా సమర్థవంతంగా నిర్వహించిన కొందరు కీర్తిశేషులైన కార్యకర్తల సేవలను ఇచ్చట స్మరించటం అవసరం. ఆర్.కృష్ణస్వామి నాయుడు (సౌత్ ఇండియన్ ఎక్స్‌పోర్టు కంపెనీ దుబాసి) సేవలు ప్రశంసనీయమైనవి. ప్రతి గురుపూజా మహోత్సవానికి అయాచితంగా వేలకొలది రూపాయలు వారు వెచ్చించేవారు. ఈనాటికీ వారి సంబంధీకులు ఉత్సవాలప్పుడు పూలసేవలు చేస్తున్నారు. వి.దామోదరం నాయుడు స్వామివారు సమాధి చెందినపుడు చెంతనుండిన 12 ఏండ్ల బాలుడు. స్వామి ఆతనికి దీర్ఘాయురారోగ్య వైభవాలు ప్రసాదించినారు. 90 ఏండ్లు బ్రతికిన భక్తుడీయన. స్వామి మందిరవిస్తరణకార్యం ఈయన చేతిమీదుగానే జరిగింది. జె.వి.శ్రీనివాసులు నాయుడు 1964 నుండి 1975 దాకా కైంకర్య సమాజానికి కార్యదర్శిగా ఉండి మందిర సంరక్షణానికి ఆర్థికాభివృద్ధికి చాలా తోడ్పడ్డారు. జీవితసభ్యులను చేర్పించటం వీరి కాలంలోనే ప్రారంభమైనది. ఈనాడు జీవితసభ్యుల సంఖ్య 1000 దాటటానికి వీరి ముందుచూపే కారణం. వీరి తరువాత టి.ఆర్.ఎమ్.కృష్ణస్వామి నాయుడు 1975 నుండి 1986 దాకా కార్యదర్శిగా సేవ చేసినాడు. ఆయన గొప్ప పరిపాలనా దక్షుడు, అనుశాసకుడు, ఉత్సాహశీలి భక్తుడు కనుక మందిర సర్వతోముఖాభివృద్ధి కైంకర్య సమాజ పటిష్ఠత వీరికాలంలో ఇతోధికంగా జరిగినవి.

భక్తులు ఇప్పటికీ ఆయన సేవలను నీతి నిజాయితీలను కొనియాడుతుంటారు. ఈయన నాలుగేండ్ల బాలుడుగా తమ తండ్రి వెంట నారాయణవరం వెళ్ళి స్వామిని సేవించిన ధన్యుడు. 1986లో తమ 90వ యేట నాయుడుగారు స్వామి పాదపద్మములలో కలసిపోయినారు.

అధ్యక్షులు శ్రీ దేవసేనాపతిగారు, తమ అనుభవాలు వినిపించిన ఎమ్.యతి రాజులు నాయుడు స్వామిభక్తిలో పండుబండిన వృద్ధులు. కార్యదర్శి ఎమ్.రామచంద్రన్ నిస్వార్థసేవాభావంతో నిరంతర కార్యతత్పరుడుగా ఉంటున్న భక్తుడు. ఈ పుస్తకం ఈవిధంగా రూపు దిద్దుకోవటానికి ఈ ముగ్గురు సహకరించినారు.

శ్రీ సొరకాయల స్వామి కైంకర్య సమాజం వారు 20.6.1993 నాడు జరిగిన మహాసభలో ఉపాధ్యక్షుడుగాను, శ్రీ దేవసేనాపతి గారు కీర్తికాయులైన తరువాత 26.12.1994 నాడు జరిగిన మహాసభలో అధ్యక్షుడుగాను నన్ను (బి.రామరాజును) ఎన్నుకున్నారు. శ్రీ సొరకాయల స్వామి కైంకర్య సమాజానికీ, స్వామి భక్తులకూ సేవ చేసే భాగ్యం కలిగినందుకు ధన్యుడనుగా భావిస్తాను. ఇటీవలి కాలంలో సమాధి మందిరం స్థలం దురాక్రమణకు గురి కాకుండా ప్రహరీ నిర్మాణం, నేలమట్టమంతా సిమెంటు పూత వేయించటం జరిగింది. దక్షిణాదినుంచి తిరుపతికి పోయే యాత్రికులకు నారాయణవరం ఒక మజిలీ కనుక వందలమంది యాత్రికులు మందిరావరణంలో విశ్రాంతులై తిరుపతికి సాగిపోవటానికి పడుకోవటానికి స్నానపానాలకు ఇది వసతిగా ఉంటున్నది. స్వామి సమాధి మంగమ్మ సమాధి - అంతరాళాలకు పాలరాళ్ళు అమర్చినాము. 100 + 44 వైశాల్యం గల ఒకపెద్ద హాలు నిర్మించినాము. ఇది భోజనాలకు, భజనలకు, సత్సంగాలకు కూడ ఉపయోగపడే విధంగా నిర్మించబడింది. మహాగురుపూజా కార్యక్రమాలకు వచ్చే అసంఖ్యాక భక్తులకు ఇది బాగా ఉపయోగపడుతుంది. పూర్ణిమ అమావాస్యలనాడు నారాయణ సేవ ఇందులోనే జరుగుతున్నది. మహాసమాధి శతాబ్ద్యుత్సవాలనాటికి ఒక ధ్యానమంటపం నిర్మించవలెనని సమాధి మందిరానికి క్రొత్తరూపు సంతరించవలెనని కార్యవర్గం కోరిక. భక్తులు స్వహస్త పరహస్తాలతో ఈ కార్యానికి తోడ్పడవలెనని ప్రార్థన.

సేవ, స్వచ్ఛశీలం, దయాగుణం, వైరాగ్యం వంటి మేలిగుణాలు తమ భక్తకోటిలో తరతరాలుగా పెంచుతున్న కారుణ్యమూర్తి శ్రీ సొరకాయలస్వామి అనుగ్రహం మన అందరికీ లభించుగాక.

# అనుబంధం - 2

# అష్టోత్తరం

## స్తోత్రం

శ్లో ॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

యదా లంబోదరం హన్తి సతాం ప్రత్యూహ సంభవం ।
తదాలంబే దయాలంబం లంబోదర పదాంబుజం ॥
అఖండానందసంబోధో వందనాద్యస్య జాయతే ।
అలాబుం తమహం వందే చిదానందతనుం గురుం ॥
అఖండం సచ్చిదానన్దం ఆవాఙ్మానస గోచరం ।

1. ఓంకార పంజరాన్తస్థశుక శ్రీమాన్ పరాత్పరః । 2
చిద్ఘనః పరమాత్మాచ వేదాంతాబ్ధి సుధాకరః ॥
2. షడూర్మిరహితో విద్వాన్ సచ్చిదానన్ద విగ్రహః ।
అలాబునామ్నా సంచారీ సర్వజ్ఞ స్సాధుపుంగవః ॥
3. సహస్రారాబ్జ మార్తాండ స్సద్గురు స్తత్త్వబోధకః ।
స్వానందాబ్ధి సుధాపానమత్త స్సాధు శిఖామణి : ॥
4. ప్రణతార్తిహరో ధీరః కరుణారస సాగరః ।
నారాయణవనే వాసి నిత్యానంద రసాలయః ॥
5. పరమాత్మా పరంజ్యోతి రాత్మానంద రసాలయః ।
త్రయీవేద్య శ్శివో విష్ణుః సర్వద శ్శాన్తమానసః ॥
6. యోగజ్ఞో యోగినాంశ్రేష్ఠః విశ్వగోప్తా జితేంద్రియః । 3
విరాగీ విశ్వస్రష్టాచ విశ్వయోని ర్విచక్షణః ॥

7. కామాదిరిపు సంహారీ కరుణావరుణాలయః ।
రాగద్వేష విహీనస్తు భగవాన్ సమదర్శనః ॥
8. నిర్మమో నిరహంకార స్సద్గురు ర్భక్త వత్సలః ।
పరమేష్ఠీ పరంధామా నిత్యతృప్తో నిరాశ్రయః ॥
9. భక్తకల్పద్రుమః స్వామీ నిర్గుణః కరుణాకరః ।
ప్రపన్న పారిజాతశ్చ సూర్యకోటి సమప్రభః ॥
10. సూర్యమండల మధ్యస్థః ప్రకృతేఃపర అవ్యయః ।
వ్యాపక స్సద్గుణాంభోధి రాధివ్యాధి హరౌషధం ॥
11. శాశ్వత స్సన్తతానందః హిమశీత దృగంచలః । 4
అవస్థాత్రయసాక్షీ చ ఆశ్రితానందదః ప్రభుః ॥
12. లోకశోక మహామత్త గజపంచాననో విభుః ।
అజ్ఞానాఖ్యతమ స్సూర్యః ఆశ్రితామర పాదపః ॥
13. అహేతుక దయాసింధు రద్వయానంద సాగరః ।
సిద్ధికాంతాపతి స్సిద్ధః శమాది గుణ భూషణః ॥
14. సర్వసంగపరిత్యాగీ సర్వాభీష్ట ఫలప్రదః ।
ముక్తికాన్తారతః శ్శాన్తః స్వాత్మైక్య పరమో మునిః ॥
15. బ్రహ్మచారీ నిరాకారో నిష్కళంకో నిరామయః ।
సమాక్రాన్త త్రిలోకశ్చ తేజస్వీ జితమన్మధః ॥
16. కరుణామృత వర్షీచ ఇంద్రోపేంద్ర సమప్రభః । 5
తాపత్రయహర శ్శూరో సత్యవాక్ప్రియదర్శనః ॥
17. సమాక్రాన్త త్రిలోకస్తు చిదాకాశ ప్రభాకరః ।
అచల సర్వగస్సర్వః కాలరూపీ కలానిధిః ॥
పరంజ్యోతిః పరంబ్రహ్మ పరమాత్మా సనాతనః ॥

## ఫలశ్రుతి

అష్టోత్తర మిదం పుణ్యం యః పఠేత్సుసమాహితః ।
దివా వా యదివా రాత్రౌ విఘ్నశాంతిర్భవిష్యతి ॥
నరనారీ నృపాణాం చ భవేద్దుస్స్వప్న నాశనం ।
ఐశ్వర్యమతులం తేషాం ఆరోగ్యం పుష్టివర్ధనం ॥ 6
గ్రహనక్షత్రజా పీడాస్తత్ క్షణేన వినశ్యతి.

# అష్టోత్తర శత నామావళిః

ఓం ఓంకార పంజరాన్తస్థ శుకాయ నమః
ఓం శ్రీమతే నమః
ఓం పరాత్పరాయ నమః
ఓం చిద్ఘనాయ నమః
ఓం పరమాత్మనే నమః
ఓం వేదాంతాబ్ధి సుధాకరాయ నమః
ఓం షడూర్మి రహితాయ నమః
ఓం విదుషే నమః
ఓం సచ్చిదానన్ద విగ్రహాయ నమః
ఓం అలాబునామ్నా సంచారిణే నమః 10
ఓం సర్వజ్ఞాయ నమః
ఓం సాధుపుంగవాయ నమః
ఓం సహస్రారాబ్జ మార్తాండాయ నమః
ఓం సద్గురవే నమః
ఓం తత్త్వబోధకాయ నమః
ఓం స్వానందాబ్ధి సుధాపానమత్తాయ నమః
ఓం సాధు శిఖామణయే నమః
ఓం ప్రణతార్తి హరాయ నమః
ఓం ధీరాయ నమః
ఓం కరుణారస సాగరాయ నమః 20
ఓం నారాయణ వనవాసినే నమః
ఓం నిత్యానంద రసాలయాయ నమః
ఓం పరమాత్మనే నమః
ఓం పరంజ్యోతిషే నమః
ఓం ఆత్మానంద రసాలయాయ నమః

| | | |
|---|---|---|
| ఓం త్రయీ వేద్యాయ | నమః | |
| ఓం శివాయ | నమః | |
| ఓం విష్ణవే | నమః | |
| ఓం సర్వదాయ | నమః | |
| ఓం శాన్తమానసాయ | నమః | 30 |
| ఓం యోగజ్ఞాయ | నమః | |
| ఓం యోగినాం శ్రేష్ఠాయ | నమః | |
| ఓం విశ్వగోప్త్రే | నమః | |
| ఓం జితేంద్రియాయ | నమః | |
| ఓం విరాగిణే | నమః | |
| ఓం విశ్వస్రష్ట్రే | నమః | |
| ఓం విశ్వయోనయే | నమః | |
| ఓం విచక్షణాయ | నమః | |
| ఓం కామాదిరిపు సంహారిణే | నమః | |
| ఓం కరుణా వరుణాలయాయ | నమః | 40 |
| ఓం రాగద్వేష విహీనాయ | నమః | |
| ఓం భగవతే | నమః | |
| ఓం సమదర్శనాయ | నమః | |
| ఓం నిర్మమాయ | నమః | |
| ఓం నిరహంకారాయ | నమః | |
| ఓం సద్గురవే | నమః | |
| ఓం భక్తవత్సలాయ | నమః | |
| ఓం పరమేష్ఠినే | నమః | |
| ఓం పరంధామ్నే | నమః | |
| ఓం నిత్యతృప్తాయ | నమః | 50 |
| ఓం నిరాశ్రయాయ | నమః | |
| ఓం భక్తకల్పద్రుమాయ | నమః | |
| ఓం స్వామినే | నమః | |

ఓం నిర్గుణాయ నమః
ఓం కరుణాకరాయ నమః
ఓం ప్రపన్న పారిజాతాయ నమః
ఓం సూర్యకోటి సమప్రభాయ నమః
ఓం సూర్యమండల మధ్యస్థాయ నమః
ఓం ప్రకృతేః పరాయ నమః
ఓం అవ్యయాయ నమః 60
ఓం వ్యాపకాయ నమః
ఓం సద్గుణాంభోధయే నమః
ఓం ఆధివ్యాధి హరౌషధాయ నమః
ఓం శాశ్వతాయ నమః
ఓం సంతతానందాయ నమః
ఓం హిమశీతదృగంచలాయ నమః
ఓం అవస్థాత్రయ సాక్షిణే నమః
ఓం ఆశ్రితానందాయ నమః
ఓం ప్రభవే నమః
ఓం లోకశోక మహామత్త గజపంచాననాయ నమః 70
ఓం విభవే నమః
ఓం అజ్ఞానాఖ్యతమస్సూర్యాయ నమః
ఓం ఆశ్రితామర పాదపాయ నమః
ఓం అహేతుకదయాసింధవే నమః
ఓం అద్వయానంద సాగరాయ నమః
ఓం సిద్ధికాన్తాపతయే నమః
ఓం సిద్ధాయ నమః
ఓం శమాది గుణభూషణాయ నమః
ఓం సర్వసంగపరిత్యాగినే నమః
ఓం సర్వాభీష్ట ఫలప్రదాయ నమః 80
ఓం ముక్తికాన్తారతాయ నమః

ఓం శాన్తాయ నమః
ఓం సాత్వికాయ నమః
ఓం స్వాత్మైక్య పరమాయ నమః
ఓం బ్రహ్మచారిణే నమః
ఓం నిరాకారాయ నమః
ఓం నిష్కళంకాయ నమః
ఓం నిరామయాయ నమః
ఓం సమాక్రాన్త త్రిలోకాయ నమః
ఓం తేజస్వినే నమః 90
ఓం జితమన్మథాయ నమః
ఓం కరుణామృత వర్షిణే నమః
ఓం ఇంద్రోపేంద్ర సమప్రభాయ నమః
ఓం తాపత్రయ హరాయ నమః
ఓం శూరాయ నమః
ఓం సత్యవాచే నమః
ఓం ప్రియదర్శనాయ నమః
ఓం సమాక్రాన్త త్రిలోకాయ నమః
ఓం చిదాకాశ ప్రభాకరాయ నమః
ఓం అచలాయ నమః 100
ఓం సర్వగాయ నమః
ఓం సర్వాయ నమః
ఓం కాలరూపిణే నమః
ఓం కలానిధయే నమః
ఓం పరంజ్యోతిషే నమః
ఓం పరంబ్రహ్మణే నమః
ఓం పరమాత్మనే నమః
ఓం సనాతనాయ నమః 108

ఓం తత్సత్

# మంగళము

మంగళం గురునాథాయ
మంగళం గుప్తభాషక
మంగళం సర్వరూపాయ
మంగళం సర్వదర్శక. ౧

మంగళం శివరూపాయ
మంగళం చిద్ఘనాయ చ
మంగళం సార్వభౌమాయ
మంగళం శాశ్వతాయ చ. ౨

మంగళం పరరూపాయ
మంగళం పావనాయ చ
మంగళం కార్యరూపాయ
మంగళం కారణాయ చ. ౩

మంగళం త్రిగుణాతీత
మంగళం గుణగణాయ చ
మంగళం సద్గుణోపేత
మంగళం నిర్గుణాయ చ. ౪

మంగళం భవదూరాయ
మంగళం భావనాశక
మంగళం నిర్మలాకార
మంగళం నిత్యతృప్తయే. ౫

మంగళం మోహనాశాయ
మంగళం మోదమానస
మంగళం శాన్తచిత్తాయ
మంగళం సమబుద్ధయే . ౬

మంగళం భక్తమందార
మంగళం ముక్తిదాయక
మంగళం సింధుగంభీర
మంగళం చిత్సుఖాయ చ. ౭

మంగళం విష్ణురూపాయ
మంగళం విమలాత్మనే
మంగళం సత్స్వరూపాయ
మంగళం సాధుమానస. ౮

మంగళం విశ్వరూపాయ
మంగళం విశ్వకారణ
మంగళం కందతుష్టాయ
మంగళం శునకతోషక. ౯

మంగళం భక్తకామాయ
మంగళం భవమోచక
మంగళం ముక్తిమార్గాయ
మంగళం మునివల్లభ. ౧౦

మంగళం క్షీణపాపాయ
మంగళం పావకప్రియ
మంగళం స్తుత్యకర్మణే
మంగళం జితమానస. ౧౧

మంగళం తుంబీఫలధర
మంగళం మౌనశాలినే
మంగళం సొరమునీంద్రాయ
మంగళం మద్గురూత్తమ. ౧౨

# అనుబంధం - 3

# శ్రీ తుంబిరదేవ స్తుతిః

-టి.వెంకటాచల శాస్త్రి - సంస్కృత పండితులు, చిత్తూరు.

1. నమ్రాణాం సకలార్థదం శమధనం సర్వజ్ఞ పీఠంగతం
లోకోద్ధారణ కారణం వపురిదం స్వేచ్ఛాగృహీతం శివమ్ ।
శ్రీ నారాయణ కాననే సుఖమయే సంచారశీలం విభుం
శ్రీ రామేత్యభిధా ప్రతీతమనఘం వందే సదానందదమ్ ॥

2. సురకాయనామ్నా భువి సంచరన్తం
జగదీడ్యమేనం పరమాత్మ రూపమ్ ।
సదానంద కందం పరమం పవిత్రం
తాపోప తాపాపహ మేఘ మీడే ॥

3. వేదాన్త సారస భవన్మధుపాన భృంగం
కామాది మత్తగజ కేసరిణం మహాన్తమ్ ।
జ్ఞానాగ్నిదగ్ధ ఘనకల్మష తూలరాశిం
వందే మునీంద్రతిలకం సురకాయమీడ్యమ్ ॥

4. నారాయణాఖ్య వనసీమని నిర్వికల్ప
నిష్ఠానిమీలిత మనోనయనాంబుజాతమ్ ।
ప్రఖ్యాతముక్తి వనితామణి సౌధదేశే
ప్రేమ్ణా రమన్త మనయా మునిరాజమీడే ॥

5. ప్రజ్ఞాన ఖడ్గేన నిహత్య మృత్యుం
తీర్త్వా గభీరం భవవారిరాశిమ్ ।
ముకుంద సామ్రాజ్యమధిష్ఠితం తం
వందే యతీన్ద్రం సురకాయ సిద్ధమ్ ॥

6. కారుణ్య సారస విభాకర మార్తబంధుం
భక్త్యా ప్రపన్నజనతామరపాదపం తమ్ ।
బ్రహ్మాభిరామ వనభూమి విహారలోలం
వందే ముకుందసదనం గతముక్త సిద్ధమ్ ॥

7. యస్యైవ సిద్ధయ స్సర్వాః
లోకోద్ధరణ హేతవః ।
అభవన్ తస్య సిద్ధస్య
స్మరణం సుఖ సాధనమ్ ॥

8. అమరపురవరే సా దోగ్ధి కామాఖ్య ధేనుః
పదకమలనతానాం భాగ్యదాతా మునీంద్రః ।
భువిచరసురశాఖీ దోగ్ధి కామానశేషాన్
సతతమవనశీలః పాతున స్సిద్ధయోగీ ॥

9.పాదాబ్జ రేణుకణ పావిత భక్తలోకం
నారాయణాఖ్య వనభూమి విహారలోలమ్ ।
జ్ఞానాగ్నిదగ్ధ భవ కారణ బీజరాశిం
ముక్తం మునీంద్ర తిలకం సురసిద్ధమీడే ॥

10. అజ్ఞానరాత్రి సమయోదిత పూర్ణచంద్రం
ప్రజ్ఞాన సింధు పరివర్ధన శారదేన్దుమ్ ।
వైరాగ్య ఖడ్గ సువినాశిత వైరిషట్కం
వందే పరాత్మమహసా సువిభాసమానమ్ ॥

11. అజ్ఞానకానన హవిర్భుజ మాత్తతత్త్వం
ప్రజ్ఞానసాగర సుధాకర పూర్ణబింబమ్ ।
వేదాన్త నీరధిపయః పరమం పిబన్తం
వందే సుధీభిరనిశం మతపాదపద్మమ్ ॥

12. శ్రీ నారాయణ కాననే కుసుమితే ముక్తి శ్రియాసంగతం
బంధూక ప్రసవారుణం పదయుగం బంధుం నతానాం సదా ।
ప్రజ్ఞానాఖ్య మహాసినా ద్యుతిమతా హత్వా రిపూన్ తత్క్షణం
స్వారాజ్యం పరమం గతం మునివరం వందే సుఖాంభోనిధిమ్ ॥

13. భక్తమానస పుండరీక విభాకరం పరమక్షరం
పాదపంకజరేణు పావితభక్తబృంద సమావృతమ్ ।
సర్వకామద భూతలోద్భవ కల్పపాదప మక్షయం
సంచితాఘ విమోచనక్షమమాశ్రయే గురుమీశ్వరమ్ ॥

14. వేదదర్శిత యోగమార్గ సుబోధకం కరుణాకరం
లీలయాకృత మానవాకృతి మచ్యుతం సుగుణాకరమ్ ।
భక్తపాలనతత్పరం భవపాశబంధ విమోచకం
చిత్సుఖాత్మకమాశ్రయే సురకాయ నామక సద్గురుమ్ ॥

15. ఆత్మాభిన్న పదం గతం సుమనసాం యద్దుర్లభం తత్పదం
యేన శ్రీ సురకాయ సిద్ధమునినా తం యోగివంద్యం మునిమ్ ।
సర్వాభీష్ట ఫలప్రదం భువి సదా కారుణ్యవారాంనిధిం
వందామః సతతం వయం సురమునిం భూలోక కల్పద్రుమం ॥

ఓం

